# ఆంధ్రప్రదేశ్

సంపుటి : 14 | ఆగస్టు 1970 | సంచిక : 10

శ్రావణం – భాద్రపదం. 1892 శా. శ.

ప్రధాన సంపాదకులు : పెండ్యాల వామనరావు

## ఈ సంచికలో...

రెండవ అట్ట : రాజమండ్రి దగ్గర గోదావరి కాలువ వార కదిలే గ్రామీణ జీవితం

మూడవ అట్ట : మేలురకం వ్యవసాయ పనిముట్లతో సేద్యం




వెల : 50 పైసలు

సాలు చందా 6 రూపాయలు

రిజిస్టర్ నెం. 135




12–1

# పత్రికా స్వాతంత్ర్యం

ఇటీవల హైదరాబాదు నగరంలో ప్రసంగిస్తూ, కేంద్ర ప్రభుత్వ సమాచార, ప్రసార శాఖ స్టేట్ మంత్రి శ్రీ ఐ. కె. గుజ్రాల్, భావప్రకటనా స్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం అనే వాటికి మన జాతి పూర్తిగా కట్టుబడివున్నదని ప్రకటించారు. ప్రజాస్వామిక వ్యవస్థను పటిష్ఠ పరచడానికి పత్రికలు చాలా ప్రధానపాత్ర నిర్వహించవలసి వుంటుంది. ప్రకటన స్వాతంత్ర్యం గల పత్రికా ప్రపంచంవేరు; ప్రజాస్వామిక వ్యవస్థను సమూలచ్ఛేదం చేయగలిగిన, బాధ్యతా రహితమైన ప్రవర్తనగల పత్రికా ప్రపంచంవేరు. ఈ రెంటికీ ఎంతో తేడావుంది. అన్ని వృత్తులలోకి జర్నలిజం వృత్తి కత్తిమీద సాము వంటిది. వ్యక్తిగత ప్రవర్తన మీద దాని మంచి చెడులు ఆధారపడి వుంటాయి. పత్రికలు ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించడంతోపాటు, జాతీయ ప్రయోజనాలదృష్ట్యా ప్రజాభిప్రాయాన్ని తీర్చిదిద్దడానికి కూడా ప్రయత్నించాలి. ప్రజలకు ఏది కావాలో దానిని ప్రచురించడం ఒక్కటే పత్రికల బాధ్యతకాదు. అది ఒక్కటే వాటి బాధ్యత అయినట్లయితే పత్రికలు యిప్పుడున్న రూపంలో వుండేవికావు. యిప్పుడు ప్రచురించకుండా వదలి వేయబడుతున్న అనేక విషయాలు అప్పుడు ప్రచురించబడుతుండేవి. ఏది దేశక్షేమానికి అవసరమైన మార్గమో దానిని పత్రికలు ప్రజలకు చూపాలి. అంతిమ లక్ష్యానికి అనుగుణంగా ప్రజలను సక్రమమార్గంలో నడిపించడానికి వీలుగా, ప్రజలు కావాలంటున్నదేది, ప్రజలకు కావలసింది ఏది అనే రెండు భిన్నమార్గాల మధ్య సమన్వయ పూర్వకమైన దృష్టితో పత్రికలు నడవాలి.

పత్రికా స్వాతంత్ర్యం అంటే ఏమిటి ? పత్రికలకువున్న స్వాతంత్ర్యాన్ని దుర్వినియోగ పరచడంకాదు. అలాచేస్తే ప్రజాస్వామ్యానికే దెబ్బతగులుతుంది. ఫలితంగా పాసిస్టు లక్షణాలు తలయెత్తుతాయి. నీలాపనిందలు వేసి వ్యక్తిని రచ్చకు యీడ్చడంవల్ల అనేక అనారోగ్యకరమైన పరిస్థితులు ఏర్పడుతాయి. ఇదంతా ఒక విషవలయంగా తయారవుతుంది. అనేక విషయాలను బైట పెట్టడం అనేదానిమీద పత్రికలు ఆధారపడివున్న మాటనిజమే. కాని సత్యాన్ని వెల్లడించాలిగాని, నిందలనూ, అసత్యవార్తలనూ, పుకార్లను ప్రకటించడం పత్రికల పనికాదు. నిష్పాక్షికత అనేది పత్రికలకు ప్రధాన లక్షణంగా వుండాలి. అంతమాత్రాన ఒకానొక ప్రత్యేక అభిప్రాయాన్నిగానీ, అధికారాన్నిగానీ అంగీకరించాలని అర్థంకాదు. యథార్థాన్ని మరుగు పరచకుండా, దానిని పవిత్రంగా భావించి ప్రకటించాలి. దానిని గురించి వ్యాఖ్యచేయాలంటే, స్వేచ్ఛగా చేసుకోవచ్చు.

పత్రికలయొక్క స్థాయి, మంచి చెడులు, వాటిని నిర్వహిస్తున్న వారియొక్క ప్రవర్తన, నిజాయితీలమీద చాలావరకు ఆధారపడివుంటాయి. స్వాతంత్ర్యం వచ్చినతర్వాత పత్రికా రచన ఒక దీక్షగా, ధర్మ నిర్వహణగా భావించడం తగ్గిపోయింది. కాని యిప్పటికీ పత్రికారచన శక్తివంతమైన ఆయుధమే. బాధ్యతాయుతంగా దానిని వినియోగించుకుంటే ప్రజాస్వామ్యాన్ని పదిల పరచుకునే సాధనంగా పనికి వస్తుంది. దానిని దుర్వినియోగపరిస్తే, ముప్పుకలిగిస్తుంది.

ఏకపక్ష భావనలేకుండా, ఎవరి అభీష్టానుసారమో ఏ విధమైన రంగులు వేయకుండా, మార్పులు చేయకుండా నిజాన్ని నిజంగా ప్రజలముందు వుంచడమే పత్రికల కర్తవ్యం. యథార్థ ప్రకటనమే పత్రికల నిజమైన శక్తి. ప్రకటించబడిన విషయంలోని మంచి చెడులను అంచనా వేసుకునే పని పాఠకులకు వదలివేయాలి. యథార్థాన్ని ప్రకటిస్తే, దానిని గురించిన అభిప్రాయాలు వారే ఏర్పరచుకుంటారు. పత్రికలు తమ విద్యుక్త ధర్మాన్ని నిర్వహించడానికి యిదే మార్గం.

కుల, మత, ప్రాంతీయ తత్వాలు, హింసాకాండకు పురికొల్పే రచనలను పూర్తిగా వదలి వేయవలసివుంటుంది. జర్నలిజం కేవలం ఒక వ్యాపారంగా మాత్రమేకాక ఒకవిధి నిర్వహణ అనే బాధ్యతాయుత భావనతో నిర్వహించబడాలి. పత్రికలో వార్త పడిందంటే, అది నిజమే అయి వుంటుందన్నంత విశ్వాసం ప్రజల్లో వున్నటువంటి దేశంలో పత్రికలు ఎంతో బాధ్యతతో ప్రవర్తించవలసి వుంటుంది.

—పి. వి. ఆర్.



# అంతిమ విప్లవం

— వి. యల్. సుందరరావు

రెండవ ప్రపంచ సంగ్రామం 1939 సెప్టెంబరులో ప్రారంభమైంది. కాని, అంతకుపూర్వం నాలుగైదు సంవత్సరాలనుండి ప్రతిదేశం సంఘర్షణకు తయారై ఉంది. అగ్ర రాజ్యకూటమి రాజ్యాలు ఒకప్రక్క తమతమ బలాలు పెంచుకుంటున్నాయి. కీలకస్థావరాలపై నిఘాపెట్టి పనిచేస్తున్నాయి. ఒకటి ఫాసిస్టు కూటమి. మరొకటి కరుడుగట్టిన సామ్రాజ్య కూటమి. ఈ రెండు శక్తుల మధ్య యుద్ధం ప్రారంభమైనప్పుడు తమ ఉనికి ఏమిటి? అని చిన్న చిన్న దేశాలు, తటస్థ శక్తులు తమ తమ భవిష్యత్తును గురించి విచారించ మొదలుపెట్టాయి. నలుబదికోట్ల ప్రజల ఏకైక ప్రతినిధి సంస్థ అయిన జాతీయ కాంగ్రెసు తన కార్యక్రమ విధానాలు గురించి సుదీర్ఘ చర్చలు చేసింది. విభిన్న అభిప్రాయాలు సేకరించింది. సముచిత నిర్ణయాలను తీసుకొన్నది. ఫాసిస్టు శక్తులకు వ్యతిరేకంగా పోరాడుతున్న బ్రిటిషు ప్రభుత్వాన్ని మనం బలహీనపరచగూడదు. ప్రపంచ ఫాసిజాన్ని తుదముట్టించుటకు మనం గూడా కృషిచేయాలి. ప్రజాస్వామ్య విధానాన్ని, మానవతా సిద్ధాంతాన్ని అంగీకరించిన భారత జాతీయ కాంగ్రెసు ఏ పరిస్థితులలోనూ పరోక్షంగా గాని, ప్రత్యక్షంగా గాని ఫాసిస్టు శక్తులతో ఐక్యం కాగూడదు. మనకు స్వేచ్ఛగా కృషి చేయుటకు అవకాశం కల్పించిన యెడల భారత దేశంలోని జనబలం, వస్తుబలం, ఆర్థిక సంపదను యిచ్చి బ్రిటిషువారి యుద్ధప్రయత్నాలకు తోడ్పడి ఫాసిస్టుశక్తులకు వ్యతిరేకంగా పనిచేయాలి అని ఆనాడు జాతీయ కాంగ్రెసు నాయకులైన పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ, శ్రీమాన్ రాజగోపాలాచారిగార్ల నాయకత్వాన జాతీయ కాంగ్రెసు తీర్మానించింది. ఇది, పూనాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు నిర్ణయం. దీనినే 'పూనా ఆఫర్' అని అంటారు. అప్పుడు గాంధీజీ తటస్థ వైఖరి అవలంబించారు. నేతాజీ సుభాష్‌చంద్రబోసు దీనికి పూర్తి విరుద్ధమైన అభిప్రాయాన్ని వెల్లడించారు. ఈ విధానం సామ్రాజ్యవాదానికి అమ్ముడుబోయినవారుతలపెట్టే విధానం లాంటిదని నేతాజీ సుభాష్ చంద్రబోసు గట్టిగా విమర్శించారు.

ఈ తీర్మానం మేరకు బ్రిటిషు పెత్తందారులతో వొప్పందం చేసుకొనుటకు అవిరళ కృషి జరిగింది. కాని, సామ్రాజ్యవాదులు జాతీయవాదులకు ప్రాతినిధ్యం యిచ్చి తాత్కాలిక జాతీయప్రభుత్వాన్ని యీ యుద్ధ అవసరాలకోసం నెలకొల్పుటకు ఇష్టపడలేదు. పైపెచ్చు సామ్రాజ్యవాదులు యుద్ధ ప్రయత్నాలు విచ్చల విడిగా చేసుకొంటున్నారు. సుమారు 16 లక్షల సైనికులను రిక్రూటు చేసుకొన్నారు. దయా దాక్షిణ్యం లేకుండా విపరీతమైన యుద్ధ నిధులను వసూలు చేస్తున్నారు. ప్రజలలో కరువు కాటకాలు తాండవించినా ఆహార పదార్థాలు యుద్ధభూమికి యింగ్లండుకు తరలించుతున్నారు. దేశంలో స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మృగ్యమయ్యాయి. నిరంకుశత్వం విలయ తాండవం చేస్తున్నది. యుద్ధమనే సదవకాశాన్ని వినియోగించుకొని మన భారత స్వాతంత్ర్య పోరాటాన్ని వెనువెంటనే ప్రారంభించాలని, మన స్వాతంత్ర్యం యిప్పుడు వాయిదాపడితే కలకాలం వాయిదాపడుతుందని కాంగ్రెసు హైకమాండుకు

అఖిల భారత పార్వర్డుబ్లాకు వేదికనుండి నేతాజీ సుభాష్‌చంద్రబోసు తీవ్రమైన హెచ్చరికలు చేస్తూ వచ్చారు. తన విధానం కార్యక్రమాల ననుసరించి పోరాటం ప్రారంభించుటకు ప్రయత్నం చేశారు. కాని, అఖిల భారత కాంగ్రెసు, పూజ్య గాంధీజీ సుముఖంగాలేని కారణంగా, తన ప్రయత్నంలో కృతకృత్యులు కాలేదు. ప్రజలు కలిసిరాలేదు. వామ పక్షాలు కాగితం మీద వ్రాతలు తప్ప—పోరాటంలో భాగస్వాములు కాలేకపోయ్యారు.

## యుద్ధం కలిగించిన సదవకాశం

నేతాజీ అక్షరాజ్యాల సహాయం అర్థించి దేశంవీడి బయటకు వెళ్ళారు, తన వ్యూహాన్ని కొనసాగించుకొనుటకు. పార్టీలకూ, సంస్థలకూ అతీతులైన జాతిపిత బాపూజీ పునరాలోచన ప్రారంభించాడు. మన భారత స్వాతంత్ర్యాన్ని గురించి యీ యుద్ధ సమయంలో కృషి చేయకపోతే—ఆ తరువాత మన స్వాతంత్ర్యాన్ని గురించి ఎవరు గౌరవించుతారు। అంగీకరించుతారు? కనుక సామ్రాజ్య వ్యతిరేకమైన ప్రజల మనోభీష్టానుసారం మనం దేశములో ప్రజా పోరాటాన్ని ప్రారంభించాల్సిందే।—అని బాపూజీ స్పష్టం చేశారు. యిది నా అంతర్వాణి ప్రబోధం. అంతర్జాతీయంగా ఎవరేమి సిద్ధాంతాలు వల్లించినా భారతీయుడుగా యిది నా ప్రధాన కర్తవ్యం. పోరో—చావో నిర్ణయించుకోవాలి।—అని వివరించి చెప్పారు.

అప్పటికి యూరపు ఖండాన్నంతా హిట్లరు ఆక్రమించాడు. మిణుకు మిణుకుమంటూ అక్కడక్కడ బ్రిటను యుద్ధంచేస్తున్నది. మరొక ప్రక్క మనుబోతు మాదిరి రష్యా సైన్యాలు పోరాడుతున్నాయ్ హిట్లరుతో. జపాను దూరప్రాచ్యాన్ని కబళించి మన సరిహద్దుల్లో యుద్ధం చేస్తున్నది. చెక్కుచెదరని అమెరికా ఆయుధాలు మిత్రమండలికి, రష్యాకు శరణాగతమయ్యాయి. అమెరికను విమాన బలం మిత్ర మండలికి రష్యాకు శ్రీరామ రక్ష అయ్యింది.

అటువంటి కలుషిత యుద్ధ మేఘావృతమైవున్న అంతర్జాతీయ పరిస్థితులలో ఆగస్టు 9వ తేదీన 1942 సం॥లో అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం జరిగింది. యావత్ ప్రపంచం ఈ సమావేశంవైపు దృష్టి సారించివుంది. ఈ చరిత్రాత్మకమైన బొంబాయి సమావేశం భారత చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడింది.

## "క్విట్ ఇండియా"

భారత దేశం నుండి వెనువెంటనే బ్రిటిషు సామ్రాజ్యాధికారులు తొలగిపోవాలి. భారత స్వాతంత్ర్యానికై ప్రజాపోరాటాన్ని ప్రారంభించుచున్నాము. ఈ పోరాట రథసారధిగా పూజ్య బాపూజీకి సర్వాధికారాలు యిస్తున్నాము అని తీర్మానించారు. దీనినే "క్విట్ యిండియా" తీర్మానం అంటారు.

ఈ తీర్మానాన్ని ప్రతిపాదించుతూ పండిత నెహ్రూ కొద్దిసేపు మాట్లాడారు. బలపరుస్తూ వల్లభాయి పటేల్ దీర్ఘోపన్యాసం చేశారు. బ్రిటిషువారి శాంతి ప్రతిపాదనలు, స్మశాన శాంతికి సంబంధించినవి. కనుక పోరాటమే మన గమ్యం అని వల్లభాయ్ ఉపన్యసించారు. ఆనాడు ఆగస్టు 9వ తేదీ రాత్రి 10 గం॥లకు ఆ వేదిక నుండి ఒక గంటసేపు భారత ప్రజా వాణి సాక్షాత్కరించింది. ఆ బాపూజీ దివ్యవాణి భారత ప్రజల రక్తనాళాలను ఉత్తేజపరచింది. దేశ భక్తితో సామ్రాజ్యవాదాన్ని పెకలించి వేసింది. యావత్ ప్రపంచాన్ని దద్దరిల జేసింది. శతాబ్దాలుగా నివురుగప్పివున్న భారతీయుల త్యాగాన్ని ప్రకోపింప జేసింది.

## బాపూజీ ఉద్బోధ

ఓ పాత్రికేయులారా। ధైర్యం ఉంటే సత్యాన్ని ప్రకటించండి.
లేకుంటే పత్రికలు నిలుపుదల చేయండి.

ఓ వాణిజ్య ప్రముఖులారా। భారతీయ రక్తం మీలో ప్రవహిస్తే
ఎగుమతులు దిగుమతులు కట్టివెయ్యండి
వ్యాపారానికి స్వస్తి చెప్పండి.

ఓ కార్మికులారా। మీరు—మీ శ్రేయస్సు 'మీ దేశ శ్రేయస్సు
కాంక్షించితే కర్మాగారాల్లో పని మానెయ్యండి.
సమ్మెలు చేయండి.

ఓ విద్యార్థి యువకుల్లారా। విద్యార్థులు పాఠశాలలకు స్వస్తిచెప్పండి.
ప్లీడర్లు కోర్టులను బహిష్కరించండి.
స్వేచ్ఛా భారత్‌లోనే చదువు కొందురుగాని. కోర్టులకు హాజరవుదురుగాని

ఓ భారతీయులారా। మీ త్యాగాలకై ఆత్మ బలిదానంకై భారతమాత
పిలుస్తోంది. 'పోరో—చావో' వినా మీ కర్తవ్యం
వేరులేదు, అని గద్గద స్వరంతో వెలువడిన ఆనాటి బాపూజీ ఉపన్యాసం భారత జాతికి ఒక ప్రమాణ పత్రం అని చెప్పాలి.

పరాయి ప్రభుత్వం ముందుగానే అన్ని యేర్పాట్లు ముగించుకొని ఉంది. మహాసభల నుండి నాయకులు ప్రజలు తరలి వెళ్ళారు. అర్ధరాత్రివేళ నాయకుల్ని అరెస్టుచేసి అజ్ఞాతవాసానికి తీసుకెళ్ళారు.

ఆగస్టు 10వ తేదీ అరుణభానుడితోపాటు బొంబాయి పట్టణంలో భారత ప్రజా స్వాతంత్ర్య భానుడు ఉదయించాడు. చండప్రచండంగా విజృంభించి సామ్రాజ్యవాదకుత్తుకను దుయ్యబట్టాడు. లాఠీచార్జీలు, కాల్పులు, టియరు గ్యాసులు సర్వ సాధారణమయ్యాయి. దేశంలోని నలుమూలల మహాత్ముని సందేశమే స్వాతంత్ర్య రణరంగపు పిలుపైంది.

## ప్రజాశక్తి విజృంభణ

జాతీయ నాయకుల నిర్బంధమే దేశం నలుమూలలా జాతీయ పతాక ఉద్యమంగా భావించబడింది. భారతీయుల స్వాతంత్ర్య దావానలానికి సామ్రాజ్య ప్రభుత్వం దగ్ధమైపోయింది. వేలు, లక్షల మంది జైళ్ళు చేరారు. సత్యాగ్రహాలు చేశారు. అశేష ప్రజా వాహినులు, ప్రభుత్వ ఆఫీసులు, ఠాణాలు దగ్ధం చేశారు. పరాయి ప్రభుత్వం మటు మాయమైంది. విమానాలు కొన్ని చోట్ల బాంబుల వర్షం కురిపించినవి. కాని, స్వాతంత్ర్య పిపాసను అణచే శక్తి మాత్రం బ్రిటిష్ వారి దగ్గర లేదు.

ఈ 'ఆగష్టు విప్లవం' భారత స్వాతంత్ర్యానికి అంతిమవిప్లవం. ప్రతి ఒక భారతీయునిలో తెలియని ఒక వెలుగు ఉద్భవించింది. నేను స్వతంత్ర భారతీయుణ్ణి. నా దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. మా స్వాతంత్ర్యం వాయిదా వేయుట ఎవరివల్లా కానిపని.

నాయకుల్ని అరెస్టు చేశాక దేశమంతా కార్మికులు నిరవధిక సమ్మె చేశారు. బెంగుళూరులో హిందుస్తాన్ ఫ్యాక్టరీలో పదివేల మంది సమ్మెచేశారు. దానికి బెంగాలు రాష్ట్రానికి చెందినఒక ఇంజనీరునాయకత్వం వహించుతున్నారు. అచ్చటఉన్న ఇంగ్లీషు ఉద్యోగి యీ ఇంజనీరు దగ్గరకు వచ్చి "గాంధీజీ పిచ్చివాడు. వాని మాటలు విని మీరు సమ్మె చేయటం న్యాయంకాదు." అని అన్నాడు "నీవు యీ మాటను ఉపసంహరించుకొని క్షమాపణ చెప్పుతావా లేదా? లేక నిన్ను తుపాకి పేల్చి చంపమంటావా?" అని రివాల్వరు తీశాడు. వెంటనే ఆ ఇంగ్లీషువాడు ఇంజనీరు కాళ్ళ మీద పడ్డాడు.

యిటువంటి సంఘటనలు వేలు, లక్షలు ప్రతిఒకరూ వారి వారి అనుభవాలు చెప్పగలరు.

## నావికుల తిరుగుబాటు

యిదే సమయంలో దూరప్రాచ్యంలో ఉన్న భారతీయులెల్లరు సాయుధ పోరాటం ప్రకటించారు. ఆ తరువాత యీ అజాద్ హింద్ ఉద్యమానికి నేతాజీ సుభాస్ చంద్ర బోస్ నాయకత్వం వహించారు. సామ్రాజ్య మదగజ కుంభస్థలాన్ని బ్రద్దలు చేశాడు. తత్ ఫలితంగా యింతకాలం బానిస సైన్యంలో ఉన్న భారత సైనికులు మేల్కొంచారు. దేశభక్తి ప్రపూరితులయ్యారు. భారత స్వాతంత్ర్యం మా జన్మహక్కని త్రివర్ణ పతాకాన్ని ఎగురవేసారు. అదే 1946 నాటి నావికా సైనికుల తిరుగుబాటు ఉద్యమం.

అప్పుడు సామ్రాజ్యవాదులు తప్పనిసరై భారతస్వాతంత్ర్య ప్రదానం చేస్తామని మంతనాలు ప్రారంభించారు. యింగ్లీషువారి హృదయాల్లో ఉన్న ద్వేషం, అసూయ కారణంగా, భారతీయులలోని కొంతమంది అధికార వ్యామోహం కారణంగా, సిద్ధాంతం సన్నగిల్లింది. పూజ్య బాపూజీ సలహాలుసైతం త్రోసిరాజన్నారు. దేశవిభజన అంగీకరించారు. మంచితోపాటు కీడుకూడా సంప్రాప్తమైంది. ఆ కారణంగా వేర్పాటు ధోరణులు, సంకుచిత తత్వం అధికార వ్యామోహం ఆనాడే మనలో అంకురించినవి.

అందువల్లనే దేశంలో అశాంతి, అనైక్యత వేళ్ళు పాతుకుపోయాయి. వాటిని విరోధించి, భారతజాతి ఐక్యమత్యాన్ని భారత దేశ గౌరవ ప్రతిష్టలను యినుమడింప చేయుటకు ప్రతి పౌరుడూ కృషి చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఆగష్టు విప్లవ వార్షికోత్సవ సందర్భమున యిటువంటి దీక్ష ప్రమాణ స్వీకారం చాలా అవసరం.

---

# మన రాష్ట్రంలో స్వాతంత్ర్య సమర యోధులు

## బుద్దయ్య దొర

విశాఖ పట్నంలోని కొయ్యూరు గ్రామంలో జన్మించారు. ఉపాధ్యాయుడిగ పనిచేస్తూ వుండే వారు. 1922–24లో అల్లూరి సీతారామరాజు నడిపించిన రంప తిరుగుబాటులో ప్రముఖ పాత్ర వహించారు. బ్రిటిష్ వారి మలబార్ రిజర్వ్ పోలీస్‌తో జరిగిన సంఘర్షణలో తుపాకి గుండు గాయానికి గురియై మరణించారు.

## భాస్కరుని లక్ష్మీనారాయణ

గుంటూరు జిల్లాలోని తెనాలిలో జననం. క్విట్ ఇండియా (1942) ఉద్యమంలో చేరారు. 12, ఆగష్టు 1942 నాడు తెనాలి రైల్వే స్టేషన్‌మీద జరిగిన దాడిలో పాల్గొన్నారు. పోలీసు కాల్పుల్లో గుండె దెబ్బ తగిలి అదే రోజున వీరస్వర్గాన్నలంకరించారు.

("భారత దేశపు అమర వీరులు" అనే గ్రంథం నుండి)

---



# ప్రణాళికలలో జరిగిన అభివృద్ధి

మొదటి మూడు ప్రణాళికల కాలంలో వ్యవసాయ రంగంలో గణనీయమైన ప్రగతి సాధించబడింది. ఆంధ్రప్రదేశ్‌లో 1950_51 సంవత్సరములో 181 లక్షల యెకరాల భూమి సాగు అయ్యేది. అయితే ఇది క్రమేణా అభివృద్ధి చెందింది 1964_65లో 233 లక్షల యెకరాలు సాగులోయినాయి. అంటే 1950 కి 1964 కు పోల్చినట్లయితే సాగుభూమి 28.5 శాతం పెరిగిందని తెలుస్తుంది.

ఇదే విధంగా ఆహారధాన్యాల ఉత్పత్తి కూడా పెరిగింది 1950_51 సం॥లో 39.66 లక్షల టన్నుల ఆహారధాన్యం ఉత్పత్తి కాగా 1964_65 లో 75.82 లక్షల టన్నుల ధాన్యం ఉత్పత్తి అయింది. అంటే ఆహారధాన్యం 91.2 శాతం పెరిగిందన్నమాట. యెకరా దిగుబడి కూడా చాలా హెచ్చింది.



ఈ మూడు ప్రణాళికల కాలంలో పరిశ్రమల ఉత్పత్తి కూడా చాలా పెరిగింది. 1956లో 100ను ప్రాతిపదికగా తీసుకొని సాధారణ పరిశ్రమల ఉత్పత్తి సూచీని గమనించినట్లయితే వివరాలు ఈ విధంగా వుంటాయి. 1961లో 163 పాయింట్లు, 1965లో 242 పాయింట్లు, 1966లో 214 పాయింట్లు, 1967లో 215 పాయింట్లు 1968లో మొదటి 6 నెలల్లో 214 పాయింట్లు వుండినాయి. రెండవ ప్రణాళికలో మొత్తంమీద పరిశ్రమల ఉత్పత్తి 63 శాతం పెరిగింది. అంటె సాలీనా పెరుగుదల 12.6 శాతం వుంది. మూడవ ప్రణాళిక మొదటి నాలేండ్లలో ఇది 48.5 శాతం పెరిగింది. అంటే ఈ కాలంలో ప్రగతి రేటు 12.1 శాతం వుంది.

రాష్ట్రంలో పరిశ్రమల ఏర్పాటుకు తగిన వాతావరణ సౌకర్యాలు కల్పించడం, వీటికి సంస్థలద్వారా ఆర్థిక సహాయం చేయడం వరకు మాత్రమే స్థూలంగా ప్రభుత్వపాత్ర పరిమితమై వుంది. పరిశ్రమల అభివృద్ధికి ముఖ్యమైనది విద్యుచ్ఛక్తి. ఈ విషయంలో రాష్ట్రం చాల అభివృద్ధి చెందింది 1950_51లో విద్యుదుత్పాదక శక్తి 43 మిలియన్ వాట్లువుండింది. ఇది మూడవ ప్రణాళిక అంతమయ్యేనాటికి 292 మి. వా.కు పెరిగింది. 1967_68 లో ఇది 645 మి.వా.కు పెరిగింది. అంటే 140 శాతం పెరిగింది. తలసరి విద్యుచ్ఛక్తి వినిమయం 1950_51లో 2.5కి వా. గంటలు వుండింది. 1965_66కు ఇది 26 కి.వా.గంటలకు పెరిగింది. అంటే 940 శాతం పెరిగింది. నీటి పారుదల విషయంలో కూడా రాష్ట్రం చాలా ముందంజవేసింది. 1950_51 లో నికరం 243.63 లక్షల యెకరాలు సాగు అయింది. ఇది 1966_67లో 280.28 లక్షలకు పెరిగింది. 1950_51లో 58.22 లక్షల యెకరాల ప్రాంతానికి మాత్రమే నీటి పారుదల సౌకర్యంవుండింది. 1966_67లో 75.85 లక్షల యెకరాల భూమికి నీటిపారుదల సౌకర్యం లభించింది.

సాంఘిక సంక్షేమ విషయములో ముఖ్యంగా విద్య ఆరోగ్య సదుపాయాల విషయంలో_చెప్పుకోదగిన ప్రగతి సాధించబడింది.

ఈ సందర్భంలో మూడవ ప్రణాళికలో వివిధ అభివృద్ధి పథకాలకై చేసిన ఖర్చు విషయం పేర్కొనడం అప్రస్తుతంకాదు. మొదటి ప్రణాళికలో 96.78 కోట్ల రూ.ల ఖర్చు జరిగింది. రెండవ ప్రణాళికలో రూ.188.60 కోట్లు ఖర్చు జరిగింది. మూడవ ప్రణాళికలో ఈ ఖర్చు రు. 352.42 కోట్లకు పెరిగింది. రాష్ట్ర నాల్గవ ప్రణాళికకు తాత్కాలికంగా రు. 420.50 కోట్లు నిర్ణయించడమయింది. ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం గనుక త్వరిత గతిన నీటి పారుదల, విద్యుచ్ఛక్తి పథకాలను అమలు జరపడానికి ప్రత్యేక శ్రద్ధ వహించడమయింది. కనుకనే రెండవ ప్రణాళికలో కేటాయించిన 188.60 కోట్ల రూ.లలో 40 కోట్లు విద్యుచ్ఛక్తికై వినియోగించడం జరిగింది. మూడవ ప్రణాళికలో 352.42 కోట్లలో 135 కోట్లు విద్యుచ్ఛక్తి అభివృద్ధికి కేటాయించబడింది. రెండవ, మూడవ ప్రణాళికల మొత్తంలో సుమారు 33 శాతం ఈ ప్రధానరంగానికి కేటాయించడం జరిగింది.

## నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు

కృష్ణా గోదావరి నదులు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని సస్యశ్యామలంచేస్తున్నాయి. కనుక వ్యవసాయం అభివృద్ధి ఈ రెండు నదులపైన ఆధారపడి వుంది. మొట్టమొదటి నీటి పారుదల ప్రాజెక్టుగా పరిగణింపబడుతున్న ధవళేశ్వరం ఆనకట్టను సర్ ఆర్థర్ కాటన్ అను సుప్రసిద్ధ ఇంజనీరు 18 6_52 లో నిర్మించాడు. దీని క్రింద రెండు పంటలలోను పది లక్షల యెకరాల భూమి సాగు అవుతుంది. కృష్ణా ఆనకట్ట విజయవాడ వద్ద 1855లో నిర్మించబడింది. ఈ ఆనకట్ట పురాతనమైనందువల్ల, దీనికి దగ్గరలోనే 1954_58లో ప్రకాశం బ్యారేజి పేరుతో మరొకటి నిర్మించబడింది. ప్రణాళిక కాలంలో నిర్మించబడిన మధ్య తరహా ప్రాజెక్టులైన ఎగువ పెన్నార్ ప్రాజెక్టు మధ్య పెన్నార్ ప్రాజెక్టు సోమశిల ప్రాజెక్టులు నీటి పారుదల సేద్యం కొరకు పెన్నా నదీ జలాలను మళ్ళించడానికి ఉపయోగ పడుతున్నాయి.



## నాగార్జున సాగరు

భారతదేశంలో బహుళార్థ సాధక ప్రాజెక్టులలో అగ్రగణ్యమైనదిగా పేరు గాంచిన నాగార్జున సాగరు ప్రాజెక్టు, రాష్ట్రం తలపెట్టిన బృహత్ప్రణాళిక. దీనిని నిర్మించడానికి మొత్తం రూ. 166 కోట్లు ఖర్చుకాగలదని అంచనా. నల్గొండ జిల్లా మిర్యాలగూడెం తాలూకా నందికొండ గ్రామం సమీపంలో ఇది నెలకొని వుంది. దీనికి కీ.శే. శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ, 1955న డిశెంబరులో శంకు స్థాపన చేశారు. ఆకర్షణీయంగా నిర్మించబడిన రాతి ఆనకట్ట ప్రపంచంలో కెల్లా ఎత్తైనది, పెద్దదైనది. నదికి ఇరువైపులా రెండు కాలువలున్నాయి. అక్కడ ఒక్కొక్కటి 50000 కి. వా. శక్తిగల 8 జనరేటింగు యూనిట్లతో విద్యుదుత్పాదక కేంద్రం వుంటుంది. ఇవి ప్రాజెక్టులోని ప్రధాన విశేషాలు.

స్పిల్‌వే, నాన్_స్పిల్‌వే భాగాలలో ఈ డామ్ పూర్తి ఎత్తు వరకు నిర్మించబడింది. దాని యెత్తు 409 అడుగులు. అడుగున దాని వెడల్పు 325 అడుగులు. ఇది సుమారు 1 మైలు పొడవు వుంది. ఈ రాతి ఆనకట్టకు రెండు వైపులా 85 అడుగుల ఎత్తున మట్టితో నిర్మించబడిన డామ్‌లువున్నాయి. ఒక్కొక్క మట్టి డామ్ సుమారు మైలు పొడవువుంది. కుడికాలువ 245 మైళ్ళ పొడవు వుంటుంది. ఇందులో 21000 క్యూసెక్కుల జలం ప్రవహిస్తుంది. దానిక్రింద సుమారు 20.58 లక్షల యెకరాలు సాగు అవుతాయి. ప్రపంచములోని నీటి పారుదల కాలవలలో ఇది చాలా పెద్దది. ఎడమ వైపున 218 మైళ్ళ పొడవున కాలువ వుంటుంది. ఇందులో 15000 క్యూసెక్కుల నీరు ప్రవహిస్తుంది. దాని క్రింద 11 లక్షల యెకరాలు సాగు అవుతాయి.

కుడిప్రక్కన ఉన్న 'జవహర్ లాల్ నెహ్రూ కాలువ' విషయంలో_మొదటి 57 మైళ్ళవరకు కాలవనిర్మాణం పూర్తి అయింది. దాని క్రింద 6,77,000 ఎకరాల ఆయకట్టు సాగు అవుతుంది. ఎడమవైపున వున్న 'లాల్ బహద్దూర్ కాలువ' నిర్మాణం మొదటి 72 మైళ్ళవరకు పూర్తి అయింది. దీని ఆయకట్టు ప్రాంతం 2,30,000 ఎకరాలు.

కృష్ణా నదీజలాలను, మానవ నిర్మితమైన 110 చ. మైళ్ళ సరస్సులో నాగార్జునసాగర్ డాము అడ్డగిస్తుంది. ఈ జలాశయం భారతదేశంలోకెల్ల పెద్దది. ప్రపంచంలో మూడవస్థానం ఆక్రమిస్తుంది. ఈ జలాశయంలో 9.3 మిలియన్ యెకరాల అడుగుల నీరు నిలువవుంటుంది. భాక్రానంగల్ జలాశయంలో 7.4 మిలియన్ యెకరాల అడుగుల నీరు నిలవవుంటుంది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు పని ఆరంభమైనప్పటినుంచి 1970 మార్చి ఆఖరు వరకు రూ. 158 కోట్లు ఖర్చు అయినాయి. 1969_70 సంౣలో అదనంగా 1,57,000 ఎకరాల భూమికి నీటి పారుదల సౌకర్యం కల్పించటం జరిగింది. ఇంతవరకు మొత్తం రూ. 9,07,000 యెకరాల సాగుకు సౌకర్యం కల్పించబడింది.

ఇప్పుడు అమలు జరుగుతున్న భారీ నీటిపారుదల ప్రాజెక్టులలో తుంగభద్ర ప్రాజెక్టు, దిగువకాలువ, తుంగభద్ర ఎగువకాలవ మొదటిదశ, కర్నూలు. కడప కాలవ, కడెం ప్రాజెక్టులు పూర్తి అయినాయి. నీటిక్రింద సాగునీటి జలాలు వినియోగం అయినాయి ఈ ప్రాజెక్టుక్రింద 7,40,000 ఎకరాలు సాగు అవుతాయి. పోచంపాడు, తుంగభద్ర ఎగువకాలవ రెండవ దశలపైన పని సంతృప్తికరంగా కొనసాగుతున్నది. రూ. 90 కోట్లు ఖర్చుకాగల పోచంపాడు ప్రాజెక్టు విషయంలో రాతి, మట్టిడాము పనులు చురుకుగా కొనసాగుతున్నాయి. దానివల్ల ముఖ్యంగా తెలంగాణా ప్రాంతానికి చాలా లాభం చేకూరుతుంది. 69.85 శాతం రాతిపని 44.52 శాతం మట్టిపని పూర్తి అయినాయి. 1970 ఫిబ్రవరి ఆఖరువరకు ముఖ్యకాలవ నిర్మాణంలో 27.95 శాతం పని పూర్తి అయింది. ఈ ప్రాజెక్టుపని ఆరంభమైనప్పటి నుంచి 1970 ఫిబ్రవరి వరకు రూ. 15.90 కోట్లు ఖర్చు అయింది. 1970 జూన్‌నాటికి 40,000 ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం కల్పించేందుకు నిర్మాణపు పనులు చురుకుగా కొనసాగుతున్నాయి.

గోదావరి బ్యారేజి నిర్మాణానికి ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డి 1970 ఏప్రిల్ 11న శంకుస్థాపన చేశారు. ఇది పాత ఆనకట్టకు ఎగువన కొంతదూరంలో నిర్మించబడుతుంది. వంశధార ప్రాజెక్టును రెండు దశలుగా నిర్మించాలని ప్రతిపాదించబడింది. గొట్టవద్ద వంశధారపైన మొదటిదశలో బ్యారేజి నిర్మించబడుతుంది. దానికి ముఖ్యమంత్రి ఏప్రిల్ 16న శంకుస్థాపన చేశారు. రెండవదశలో రూ. 8.64 కోట్ల ఖర్చుతో దిగువకాలవ త్రవ్వకం పని ఆరంభించబడుతుంది. దానిక్రింద సుమారు 14,48,300 ఎకరాలు సాగు అవుతాయి.

ఆంధ్రరాష్ట్రం ఎర్పడిన తరువాత విద్యుచ్ఛక్తి అభివృద్ధి విషయంలో గణనీయమైన ప్రగతి సాధించబడింది. 1969_70లో విద్యుదుత్పాదకశక్తి 580.4 మి.వా. వుండింది. ఆంధ్ర ఒరిస్సా రాష్ట్రాలు, మాచ్‌ఖండ్ జలవిద్యుచ్ఛక్తి పథకాన్ని సమిష్టిగా అమలు జరుపుతున్నాయి. ఇది విశాఖపట్టణం రైల్వే స్టేషనుకు సుమారు 120 మైళ్ళ దూరంలోవుంది. ఈ పథకం రూ. 22.92 కోట్ల ఖర్చుతో పూర్తి అయింది. దాని ఉత్పాదకశక్తి 1,14,750 కిలోవాట్లు. ఇందులో ఆంధ్రప్రదేశ్ వాటా 70 శాతం. మిగిలినది ఒరిస్సా రాష్ట్రానికి చెందుతుంది.



రూ 11 కోట్లు ఖర్చుకాగల తుంగభద్ర జలవిద్యుచ్ఛక్తి పథకాన్ని ఆంధ్రప్రదేశ్, మైసూర్ రాష్ట్రాలు సంయుక్తంగా నిర్వహిస్తున్నాయి. ఈ పథకంవల్ల ముఖ్యంగా రాయలసీమ ప్రాంతానికి మేలు చేకూరుతుంది. తుంగభద్ర ఆనకట్ట దగ్గర దీనికి దిగువ 14 మైళ్ళ దూరంలోవున్న హంపి వద్దగల పవర్ స్టేషనులలో ఒక్కొక్కటి 9 కి.వా. శక్తిగల ఎనిమిది జలవిద్యుచ్ఛక్తి సెట్లు పని చేస్తున్నాయి.

రాష్ట్రంలో రామగుండం, కొత్తగూడెం థర్మల్ స్టేషనులు థర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు చాలా ముఖ్యమైన కేంద్రాలు. రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి గిరాకి ఎక్కువగా వుంటున్న కారణాన ఈ రెండు కేంద్రాలను అభివృద్ధి పరచడం జరుగుతున్నది. ఈ రెండు ప్రాజక్టుల ఉత్పాదనశక్తి 182.5 మి. వా. వుంటుంది.

రాష్ట్రంలోని జలవిద్యుత్ కేంద్రాలలో బృహత్తరమైనది శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి పథకం. దీనికి రూ. 75 కోట్లు ఖర్చు అవుతుంది. అప్పటి ప్రధాన మంత్రి కీ. శే. జవహర్ లాల్ నెహ్రూ 1963 లో ఈ ప్రాజెక్టుపనికి ప్రారంభోత్సవం జరిపారు. ఇక్కడ పని తృప్తికరంగా కొనసాగుతున్నది. నాల్గవ ప్రణాళిక అంతంనాటికి ఈ డాము 630 అడుగుల ఎత్తుకు నిర్మించబడుతుంది. ఈ ప్రాజెక్టుల మొత్తంమీద రూ. 25.6 కోట్లు ఖర్చుఅవుతుంది. ఎగువ సీలేరు జలవిద్యుచ్ఛక్తి పథకంక్రింద ఒక్కొక్కటి 60 మి. వా. శక్తిగల రెండు యూనిట్లు 1967–68 లో పనిచేయనారంభించాయి. ఈ పథకం కొరకు రూ. 19 కోట్లు ఖర్చు అయినాయి. దిగువసీలేరు జలవిద్యుచ్ఛక్తి పథకంలో మొదటిదశలో ఒక్కొక్కటి 100 మి. వా. శక్తిగల నాలుగు యూనిట్లను నెలకొల్పడానికి సంకల్పించబడింది.

కర్నూలుజిల్లా శ్రీశైలందగ్గరగల సోమశిలవద్ద అణువిద్యుత్ కేంద్రాన్ని నెలకొల్పవలసిందని రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వాన్ని కోరింది. తమిళనాడులో నెలకొల్పివున్న కేంద్రప్రభుత్వ ప్రాజెక్టులైన నైవెల్లి విద్యుచ్ఛక్తి కేంద్రం, కల్పకం అణువిద్యుత్ కేంద్రంనుంచి కొంతవాటా ఇవ్వవలసిందని కూడా రాష్ట్ర ప్రభుత్వం కేంద్రప్రభుత్వాన్ని అభ్యర్థించింది.



# పరిపాలనా విషయాలు

## సాధారణ అమ్మకం పన్ను సవరణ

1970 సంవత్సర ఆంధ్రప్రదేశ్ సాధారణ అమ్మకం పన్ను సవరణ చట్టానికి రాష్ట్ర గవర్నరు ఆమోదం తెలిపారు. ఇది 1970 ఏప్రిల్ 27 వ తేదీన ఆంధ్రప్రదేశ్ గజెటులో ప్రచురించబడింది. ఈ చట్టంలో 7, 8, 9 సెక్షనులు 35 సెక్షనులో పేర్కొనబడిన 77, 78, 80 అంశాలు 1970 జూన్ 1 నుంచి అమలులోకి వస్తాయి. ఈ సవరణ చట్టం ఫలితంగా, 1970 జూన్ 1 వ తేదీ నుంచి రాష్ట్రంలో బెల్లంపై మొదటి విక్రయంపై రూపాయకు 5 పైసల చొప్పున పన్ను విధించబడుతుంది. ఇదే తేదీనుంచి క్రిమిసంహారక మందులు, మొక్కలరక్షణ పరికరాలపైన వరుసగా, మూడు పైసలు, ఒక పైసా చొప్పున సింగిల్ పాయింటు పన్ను విధించబడుతుంది.

## ఆంధ్రప్రదేశ్ హౌసింగ్ బోర్డు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1970 జూన్ 1వ తేదీ నుంచి ప్రభుత్వ ఆరోగ్యం, గృహవసతి మునిసిపల్ పరిపాలనా శాఖ ప్రత్యేక కార్యదర్శిని ఆంధ్రప్రదేశ్ హౌసింగ్ బోర్డుకు ఎక్స్–అఫిషియో ఛైర్మన్‌గా నియమించింది. ఈ బోర్డులో మునిసిపల్ పరిపాలన శాఖ డైరెక్టరు, టౌను ప్లానింగు డైరెక్టరు, రోడ్లు భవనముల చీఫ్ ఇంజనీరు, హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ కమీషనరు, ప్రజారోగ్యశాఖ చీఫ్ ఇంజనీరు, ఆరోగ్యం, గృహవసతి, పరిపాలనా శాఖల ఉప కార్యదర్శి ఎక్స్–అఫీషియో సభ్యులుగా ఉంటారు.

# మన జాతీయోద్యమ గీతాలు

—పంద్రంగి రాజేశ్వరరావు

వయస్సు మళ్ళి కాలం తీరాక గడచిన అనుభవాలు, జ్ఞాపకాలు తరచు గుర్తుకువస్తాయి. యువతరం ఖాతరు చేయక పోయినా విన్నదీ కన్నదీ వెళ్ళకక్కాలనే ఆవేశం అప్పుడప్పుడు ఆవరిస్తుంది. అరణ్యరోదనమైనా కొద్దిమందిని ఆకట్టకమానదు. పోతే వాసన పూర్తిగాపోలేదు. పైపెచ్చు పాతక్రొత్తల సంధిలో సతమత మవుతున్నాము. నేడు మనం స్వతంత్రం అనుభవిస్తున్నా జాతీయతను విస్మరిస్తున్నాము. మత, ప్రాంత, భాషా, కుల, వర్గ ప్రాతిపదికపై మనుగడ సాగిస్తున్నాము. మన స్వరాజ్యమింకా "సురాజ్యం"గా మారలేదు. ఇందుకెంతో కృషి జరగాలి. భవిష్యత్తు అగమ్యగోచరంగా వుంది. ఈ తరుణమందు జాతీయగీతములను, వాటి కర్తలను స్మరించుట వాంఛనీయము.

జాతీయోద్యమానికి జాతీయ గీతాలు పునాదిరాళ్లు. జాతీయ గీతాలు లేనపుడు జాతీయ జీవితం స్తబ్దంగా వుంటుంది. "జస్టిసు పార్టీకి జాతీయ గీతాలు లేవు, త్వరలోనే హంసపాట (Swan Song) పాడి అంతరిస్తుంది" అని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి చమత్కరించారు. రాజహంస తియ్యగానే చచ్చిపోతుందని నమ్మికవుంది. జస్టిసుపార్టీ ప్రభుత్వాదరణతో పుట్టిపెరిగిన పార్టీ అనే ధ్వని సయితం యీ మాటలో వుంది.

ప్రపంచంలో ఆదినుండి గద్యం కంటే గీతమే ప్రజానీకాన్ని ఆకట్టుతూవచ్చింది. ధారాశుద్ధిగల కవులు తమంతతాము వైతాళికులుగా ముందుకు వస్తారు. చరిత్ర వెలుగులోకి రాకుండానే చరిత్రను సృష్టిస్తారు. దేశశ్రేయమే వారి ధ్యేయం. పరాజయం సిద్ధిస్తుందన్న భయమూ, నిరాశా వారి దరిచేరవు. వారి నీతి నిజాయతీ అగణితము. చిత్తశుద్ధి అమోఘము. రచనలు చరణకోల చురకలు. కొందరు జాతీయ గీతాలు రచించటంతోనే తృప్తిపడితే మరికొందరు జాతీయోద్యమంలో దూకి ఆహుతి అయ్యారు. వారిని ఉద్యమాల నాయకులు వాడుకుని విసర్జించారు. వారి జీవితాలు బాధామయ దర్పణాలు, త్యాగచరిత్ర నిలయాలు, వారిలో కొందరితోను, కొద్దిపాటి రచనలతోను నాకుగల స్మృతులను వివరించటం కనీస ధర్మంగా భావిస్తున్నాను.

> ఏది ఎట్లాగైనా, చారిత్రిక దృష్ట్యా, వివిధ జాతీయగీతాలనూ, వాటి కర్తల జీవిత విశేషాలనూ అధికార, అనధికారుల సహకారంతో సేకరించి ప్రచురించుట న్యాయము. అట్లు చేయనిచో భావితరములకు తీరని నష్టము కలుగును.

"మా కొద్దీ తెల్ల దొరతనము"

నేను కాస్త గడికట్టి 1930 సంవత్సరమందు వుప్పు సత్యాగ్రహంలో ఎంతౌనే సమయానికి "మా కొదీ తెల్ల దొరతనము" అనే గరిమెళ్ళ సత్యనారాయణగారి ప్రముఖ జాతీయ గీతం బాగా వాడుకలో వుంది. వీరు 1920 సంవత్సరపు సహాయ నిరాకరణోద్యమంలోనే జైలుశిక్షను అనుభవించిన ధీరులు. చివరకు దారిద్ర్యంతో బాధపడి గుర్తింపు లేకుండానే మరణించారు. తూర్పు గోదావరిజిల్లా వుప్పు సత్యాగ్రహాన్ని శ్రావ్యమైన పాటగా రచించిన శ్రీ కోడేటి రంగాచారిగారిని మరువజాలము. ఆనాటి వుద్యమానికి నాయకులు మహర్షి బులుసు సాంబమూర్తి. వృత్తితః న్యాయవాదియైనా జన్మతః వేదపండితులు. బాశంపట్టు వేస్కుని కూర్చున్నప్పుడు వీరిముఖం బ్రహ్మవర్చస్సుతో కళకళలాడేది. శ్రీ రంగాచారి, శ్రీ సాంబమూర్తి నాయకత్వమున శాంతి సైన్యము గ్రామాలంట ప్రచారంచేస్తూ చొల్లంగిచేరి వుప్పు వండేవరకు జరిపిన మహాప్రస్థానం కళ్ళకు కట్టినట్టు రచించారు. "ఉప్పు కుండలు వప్పు చేసిరి, రెండు గరిటెలువిరచి వైచిరి" అనే చరణం వింటూంటే ఒడలు గగుర్పొడిచేది. తూర్పు గోదావరి జిల్లాలో ముస్తాఫాలీఖాన్ అజమాయిషీలో దమననీతి విలయ తాండవం చేసింది. డాక్టరు బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం, సాంబమూర్తి లాంటి నాయకులే అందుకు క్రూరంగా గురికాగా రంగాచారి, భయంకరాచారి లాంటియువకుల్ని చితకమోదారు. భయంకరాచారి స్వతంత్ర భారతంలో ప్రభుత్వోద్యోగిఅయినా రంగాచారి మాత్రము గుండె నొప్పితో బాధపడి అజ్ఞాతంగా పరమపదించారు.

ఒక్కొక్క సమయంలో జాతీయ గీతాలు మమ్మ చక్కగా ఆదుకునేవి. నర్సాపురంలో అర్ధరాత్రి వేళ తెల్లవారగట్ల వుప్పు సత్యాగ్రహం చెయ్యటానికి బళ్ళు లేనందున సముద్ర ప్రాంతానికి చీకటిలో ఎనిమిది మైళ్ళు నడువవలసి వచ్చింది. మా దళంలో వయస్సు మళ్ళిన శ్రీయుతులు మాగంటి బాపినీడు, చంగల్వలచిట్టి పంతులు, బసవరాజు శ్రీ రంగశాయి, ఈడూరి సత్యనారాయణ ప్రభృతులు వున్నారు. అప్పుడు అందరం "జగమునందు కలదె నాదు జన్మభూమివంటిది, సకల లోకములకు రాణి నాదు జన్మభూమి" అని కదను త్రొక్కుతూ పదం పాడుతూ కటిక చీకటి వుండగానే సునాయాసంగా గమ్య స్థానం చేరుకున్నాము. ఒకసారి మా దళం ప్రచారానికి, మహమ్మదీయులు అధికంగావున్న గ్రామం వెళ్ళింది. అప్పటికే అలీ సోదరులు తదితర ముస్లిం నాయకులు

జాతీయోద్యమానికి దూరంగా ఉండటంచేత మమ్ము పలుకరించేవారు సయితం లేకపోయారు. బారెడు ప్రొద్దెక్కింది. అందరికీ ఆకలి వెయ్యటం ప్రారంభించింది. మాలో సమయస్ఫూర్తిగల మిత్రుడు కి.శే. కుప్పయాచారి "మొన్నవీరున లక్ష ముప్పది యారువేల జనసాయమిచ్చిన పంజాబీలపాలు హిందూమేలానా, దయ్యారాదమూ ఐట్టికొయ్యాగావలెగాని దయచూడవలెకాదు హిందూ మేలానా" అంటూ"మా దళంచేత నగర సంకీర్తన చేయిస్తూ మళీదు ప్రాంతానికి వచ్చేసరికి ముసల్మానులు కొందరుతు సాసరోట్లెలు, బిస్కట్లు, టీ, కొబ్బరి బొండాంలతో ఎదురువచ్చి సత్కరించారు. ఆ రోజుల్లో క్రైస్తవులు బ్రిటిషు ప్రభుత్వానికి వారసులమనుకునేవారు. ఇంగ్లీషు ముక్కలు వచ్చేసరికి పట్ట పగ్గాలు వుండేవి కావు. జాతీయోద్యమానికి మైళ్ళ దూరంలో వుండేవారు. ఒక క్రైస్తవ పేటలోకి వెళ్ళబోయేసరికి అడ్డగించారు. అంతట "జగద్రక్షకుడు గాంధి మహాత్ముడు జనులందరు మీరెరుగండి" అని గొంతెత్తి క్రైస్తవ బాణిలో ఏక కంఠంతో అందరం పాడటం ప్రారంభించగానే దక్షిణాఫ్రికానుంచి తిరిగి వచ్చిన క్రైస్తవుడొకరు మమ్ము సాదరముగా ఆహ్వానించారు. వైశ్య వాటికలో మేము, "కొల్లాయి గట్టితేనేమి మా గాంధి కోమటై పుట్టితేనేమి, పండంటి మోములో బ్రహ్మ వర్చస్సు" అని పాడుతుంటే ఆబాల గోపాలము బ్రహ్మానంద పడుతూ కావలసిన ఏర్పాట్లన్నీ చేసేవారు. ఇట్టి ఉదాహరణలు చాలా వున్నాయి.

## "దండాలండోయి బాబు"

తర్వాత నన్ను బాగా ఆకట్టిన వ్యక్తి "దండాలండోయి బాబు" అనే గీతాన్ని రచించి జాతీయోద్యమంలో పాల్గొని నిరాధారుడైన శ్రీ వడ్డాది ఆంజనేయ శాస్త్రి. వీరిని విశాఖపట్నంలో డాక్టరు బెండపూడి పేరాజుగారి ఇంట్లో చూచాను. 1921 వ సంవత్సరము ఉద్యమంలో న్యాయవాదులు విరివిగా పాల్గొంటే, 1930 సంవత్సరపు వుప్పు సత్యాగ్రహంలో డాక్టర్లు పోటీ పడ్డారు. వారిలో ముఖ్యులు శ్రీయుతులు ఆమంచర్ల శేషా చలపతి రావు (గుంటూరు), వెలిదండ్ల హనుమంత రావు (విజయవాడ) ముల్పూరి రంగయ్య (ఏలూరు), పాలకోడేటి గురుమూర్తి (రాజమండ్రి), వేదాంతం వేంకట కృష్ణయ్య (కాకినాడ). వీరంతా స్వాతంత్ర్య సమర యోధులకు అండదండలుగావుండి వసతి, వైద్య భోజన, సౌకర్యాలు కలిగించేవారు. అదంతా వారు నిస్వార్థంగా చేసిన నిష్కామ సేవ.

## మంగిపూడి సోదర కవులు

స్త్రీలలో ముఖ్యంగా దేశ బాంధవి దువ్వూరి సుబ్బమ్మగారు, కోటమర్తి కనకమ్మగారు ఆశువుగా జాతీయ గీతాలను ఆలాపన చేసేవారు. దుర్గాబాయమ్మగారు హిందీ ధ్యాసలో ఉండేవారు, జాతీయోద్యమంలో పాల్గొన్న సుప్రసిద్ధ కవులు మంగిపూడి సోదరులను (సర్వశ్రీ వేంకటశర్మ, పురుషోత్తమ శర్మ) విస్మరింపరాదు. అట్లాంటివాడే శ్రీ అడవి బాపిరాజు. వీరంతా పరమ పదించారు.

## "భారతదేశము నాదేరా"

ఆట్టి కోవలో అగ్రశ్రేణికిచెందిన శ్రీ గరికపాటి మల్లావధాని మాత్రము నేడు మన మధ్య నిల్చియున్నారు. 1920 వ సంవత్సరమునుండి పీరిగారు పిరికొనవరు ఇటా వివిధ జాతీయోద్యమాలలో పాల్గొని కారాగారవాసంచేసినారు. వుప్పు సత్యాగ్రహం రోజుల్లో వీరి, "వద్దురా మనకొద్దురా పరపాలనంబికవద్దురా" అనే ప్రతిజ్ఞా గీతం జనసామాన్యాన్ని ఆకర్షించింది. "భారత దేశము నాదేరా భారతీయుడను నేనేరా" అనే ప్రతిజ్ఞా గీతం జాలిని మేల్కొలిపింది. వారి 'ఆంధ్ర మాతస్తవం' మన పూర్వ ప్రశంసకు గీటురాయి. వీరి 'భారతాంబికా శతకం' ఆణిముత్యము. ఇటీవల దీనినొకరు ఆంగ్లంలోనికి అనువదిస్తున్నారు. అమర కావ్యము, పండిత రాయలు అనే కావ్యము ప్రచురింపబడ్డాయి. అముద్రితంగా అరడజను వుద్గ్రంథాలున్నాయి. "ఘోర కలి" లో నేటి పతనావస్థను యథాతథంగా చిత్రించారు. వీరు తు. చ. తప్పని సనాతన ధర్మ తత్పరులైనా అసలైన జాతీయవాది. సిసలైన భారతీయుడు. సంస్కృతాంధ్రములలో పేరెన్నిక గన్న కవి, పండితుడు. కవి శేఖర బిరుదును పొందారు. చివరకు వీరికి మునిసిపల్ హైస్కూలులో తెలుగు పండితుడుగా ఉపాధి కల్పించినది, జస్టిసు పార్టీ నాయకుడైన శ్రీ బడేటి వెంకట్రామయ్య నాయుడు. ఆ నాడు అవిభక్త మదరాసు రాష్ట్రముఖ్యమంత్రిగానున్న శ్రీ బొబ్బిలి రాజా వీరికి రు. 116 లు యిచ్చి సన్మానించారు. స్వాతంత్ర్యమువచ్చాక వీరికి ఆవాహన లేకపోయింది. ఎవరినీ ఆశ్రయింపరు. నేటికి స్థానిక ట్యుటోరియల్ కాలేజీలో తెలుగు పండితులుగా జీవన యాత్ర సాగిస్తున్నారు.

రోజులు మారాయి. మనుష్యులూ మారారు. ఆనాటి సమస్యలిపుడు లేవు. త్యాగం స్థానాన్ని భోగం ఆక్రమించింది. సేవా దృష్టిని అధికారదాహం వెనుకకు నెట్టింది. సినిమా పాటల మోజులోపడ్డ ప్రజానీకానికి జాతీయ గీతాలు రుచి చవు. వాటి కర్తలను కన్నెత్తి చూడరు. గడచిన తరానికి నౌరోజీ మొదలు నెహ్రూ వరకు ఆరాధ్యులైతే నేటి తరానికి సినీ తారలు అభిమాన పాత్రులయ్యారు. ఒక జెకొస్లావేకియా కవి వ్రాసినట్లు "కాలం తెర ఎత్తింది. కనీ వినీ ఎరగని మార్పు గోచరిస్తోంది". కాల ప్రవాహానికి ఎదురీదలేము. అందుకు యుగ పురుషులు బయలుదేరాలి. ఏది ఎట్లాగైనా చారిత్రిక దృష్ట్యా వివిధ జాతీయ గీతాలను వాటికర్తల జీవిత విశేషాలను అధికార, అనధికారులసహకారంతో సేకరించి ప్రచురించుట వాంఛనీయము. అట్లు చేయనిచో భావి తరములకు తీరని నష్టము కల్గును.



# విశ్వకవితో తెలుగువారి పరిచయం

విశ్వకవి రవీంద్రనాథ టాగూరు తనసాహిత్య ప్రతిభకుచిహ్నంగా అనన్యసామాన్యమైన కీర్తినిచ్చు 'నోబిల్ బహుమతి' పొంది, భారత జాతికి నాటి వారిలో కీర్తి ప్రతిష్ఠలు తెచ్చినాడు. అయన ప్రపంచఖ్యాతి గాంచిన కవి పుంగవుడు! కవియే గాయకుడు! మహర్షి వంగ రాష్ట్రమున జన్మించి, భారత దేశములోనేకాక ప్రపంచమునందలి ఎల్ల దేశముల సంస్కృతి సభ్యతలను అనుశీలన చేసుకొని విశ్వప్రేమను చాటి, విశ్వమానవ సౌభాగ్యముకొరకు విశేషమైన కృషిసల్పిన మహనీయమూర్తి. రవీంద్రుని కుటుంబము నకు వంగరాష్ట్రమున మిక్కుటమైన గౌరవముకలదు. ఈయన తండ్రి మహర్షి దేవేంద్రనాథ టాగూరు బ్రహ్మ సమాజికుడు.

వంగ రాష్ట్రమున ఉద్భవించిన ప్రతి సంచలనముతోను తెలుగువారికి సన్నిహిత సంబంధము ఉండుట గమనార్హము. అందుచేతనే రవీంద్ర కవీంద్రునికి, దక్షిణ భారతమున బ్రహ్మ సమాజమత స్థాపనకు అనన్యమైన కృషిసల్పిన, కీ.శే. కందుకూరి వీరేశలింగము పంతులుగారి యెడలను, కీ. శే. రఘుపతి వేంకట రత్నమునాయిడుగారి యెడలను మిక్కుటమైన గౌరవ ప్రపత్తు లుండెడివి.

దాసుగారికి విశ్వకవితో కలకత్తానగరమున పరిచయము ఏర్పడినది. దాసుగారు జరిపించిన హరికథను విశ్వకవి తిలకించి, వారి సంగీత సాహిత్యనృత్యకళాజ్ఞానమునకు అచ్చెరువొందినారు. ఈ సందర్భంలో ఒక విశేషము పేర్కొనవలసి యున్నది. 1931వ సంవత్సరమున విశ్వకవి విజయ నగరము వేంచేసి, మహారాణి లలితకుమారి దేవివారి ఆతిథ్యము స్వీకరించినారు. ఆ సందర్భమున రాజ ప్రసాదమునందు ఏర్పాటు కావింపబడిన సభకు ఆహ్వానితులలో నారాయణదాసుగారును కలరు. దాసుగారిని అల్లంత దూరముననే విశ్వకవిచూచి, ఆహూతుల నందరిని తోసుకొనుచు ముందుకుసాగి దాసుగారిని ఆలింగనము చేసుకొని 'నన్ను మరచిపోయారా' అని చలోక్తి విసరి, దాసుగారి సహజ పాండిత్య ప్రభావమునకు జోహారులర్పించి తమ చిరకాల మిత్రత్వమును వేనోళ్ల వెల్లడించినారు.

తెలుగు జాతిలో నుద్భవించిన అసమాన మహామేధావులలో ప్రసిద్ధులగు తిరుపతి వేంకట కవులకు విశ్వకవితో పరిచయము కలదు. సంస్కృత ఆంధ్ర భాషలలో నిష్ణాతులైన ఈ జంటకవుల ప్రతిభ విశ్వకవిని అచ్చెరువొందించినది. 1919వ సంవత్సరమున

చావలి రామమూర్తి

కీ.శే. గురజాడ అప్పారావు పంతులుగారు విశ్వకవికి సమవయస్కులు. పంతులుగారు విజయనగర సంస్థానమున ఉద్యోగముచేయు కాలమున, తరచుగా తమ సహాధ్యాయులైన కీ.శే. యనమండ్ర నారాయణమూర్తి పంతులుగారితో కలసి కలకత్తా వెళ్ళుచుండెడివారు. ఆ అవకాశమును పురస్కరించుకొని వారు ఉభయులు రవీంద్రుని దర్శించెడివారు. విశ్వకవికి తెలుగు దేశమున జరుగుచున్న సాంఘిక సాహిత్య సంస్కారములను గూర్చి ఎరుక పరచుచుండిరి. రవీంద్ర కవీంద్రునికి మహాకవి గురజాడకు అన్యోన్యమైన మైత్రీభావము ఏర్పడి ఒకరినొకరు పరస్పరము అభినందించుకొనుచుండిరి

## నన్ను మరచి పోయారా ?

కీ.శే. ఆదిభట్ల నారాయణదాసుగారి యెడల విశ్వకవికి చాల గౌరవము. నారాయణదాసుగారు తెలుగు, సంస్కృతము, ఇంగ్లీషు హిందీ పారశీకభాషలయందును, సంగీతనృత్యకళలలోను అసమాన ప్రతిభాసంపన్నులు. 1913వ సంవత్సరమున మొట్టమొదటిసారిగా

విశ్వకవి కాకినాడ వేంచేసినప్పుడు, తిరుపతి వేంకటకవులు విశ్వకవిని దర్శించి, ప్రశంసాపద్యములుకూర్చి అభినందించారు.

సీ. అఖిల దేశ సముచ్చయంబైన బహుమతి
గణియించెనే సూరి కౌశలంబు

రసవత్కథానక ప్రసరణా విఖ్యాతి
కల్పించెనే కవి కల్పనంబు

భరత ఖండము కవి ప్రభుజన్మ ఖనియన్న
ఖ్యాతి స్థాపించెనే ఘనుని పేరు

సర్వ విద్యాగార చత్వరమ్ముల యందు
దాంతు పంచాడెనే ధన్యు కీర్తి

సుకవితాశక్తినట్టి భాసురగుణుండ
పరుగు దెంచితివయ్యా మాపురికిఁ గాకి
నాడనాటికి రవీంద్రనాథ సుకవి
సార్వభౌమ ! యిదే నీకు స్వాగతంబు.

వంగరాష్ట్రము గర్వపడునట్లుగ మహర్షి
దేవేంద్రనాథు పుత్రికరించె
భారతీయులు తుష్టి పడగ "నోబెల్ ప్రైజు"
గైకొనె సరస మాకవన ముందు
సర్వానుభవనీయ సంగతుల్ చొనుపుచు
పరచెం జెక్కుకావ్యములు జగతి
విస్మయానందము ప్రశస్తికావ్యము విపరింప
గీతాంజలి రచించి శ్రీరవీంద్ర

ధ్యానమున యుండి కాదె యైశ్వర్యమును
సతము లభించె భాగ్యసుస్థితి మెఱయ
[illegible] రవీంద్రనాథు శ్రీ [illegible]
[illegible]

## వీరు నాకు గురువులు

1919వ సంవత్సరములో విశ్వకవి ఆంధ్రదేశము వచ్చినప్పుడు పిఠాపురము వచ్చినారు. అప్పటి పీఠికా పురాధీశ్వరులైన సూర్యారావు బహద్దూరువారు విశ్వకవికి శిష్యులు. బ్రహ్మసమాజ మతావలంబకులు. ఆ సంస్థానమున తుమరాడ సంగమేశ్వరశాస్త్రి గారను గొప్ప వైణిక విద్వాంసులుండినారు. విశ్వకవి గౌరవార్థము ఏర్పాటు కావించబడిన సభలో, సంగమేశ్వరశాస్త్రిగారు కచేరి జరిపించినారు. శాస్త్రిగారి ప్రతిభకు, విశ్వకవి జోహారుచేసి "నేను దక్షిణదేశమంతా తిరిగి అనేక విద్వాంసుల సంగీతము విన్నాను. నాకు సంగీతమంటె పెర్రి అన్న సంగతి మీకు తెలుసుకదా! వారందరు మహా విద్వాంసులే, అందుకు సందేహములేదు. ఒక్కొక్కరిలో ఒకొక్క విశేషమైన ప్రతిభ ఉన్నది తప్పకుండా. కాని, వారెవ్వరూ నా హృదయాన్ని కరిగింపలేకపోయారు వీరిలా. వీరి వాయిద్యమును వినుటతోనే వీరిని నా గురువుగా గుర్తించాను" అని శ్లాఘించినారు. విశ్వకవిచేత గురువుగా కొనియాడబడిన గౌరవము మన తెలుగువాడైన తుమరాడ సంగమేశ్వరశాస్త్రిగారికే దక్కింది. ఇది తెలుగుజాతికి గర్వకారణము.

శాస్త్రిగారిని విశ్వకవి శాంతినికేతనమునకు ఆహ్వానించగా, ఆ సంవత్సరముననే, వారు మండపాక రాజశేఖరశాస్త్రిగారిని తోడ్కొని వెళ్ళిరి. ఇవ్విధముగా సంగమేశ్వరశాస్త్రిగారు మూడు పర్యాయములు శాంతినికేతనము దర్శించి కొంత కాలమచ్చట గడిపి వచ్చుచుండిరి. శాంతినికేతనమున ఉండు సమయమున, శాస్త్రిగారు విశ్వకవి సమక్షమున ప్రతిదినము సాయంత్రము 7 గంటల నుండి 9-30 గంటల వరకు కచేరీ జరుపుచుండెడివారు. ఈ వాయిద్యగోష్టిని తిలకించుటకు, రవీంద్రుని ఆహ్వానము నందుకొని అనేక మంది పెద్దలు, విద్వాంసులు కలకత్తా పరిసరముల నుండి వచ్చుచుండిరి.

ఒక పర్యాయము అప్పటి బెంగాలు గవర్నరగు సర్ రొనాల్డుషే శాంతినికేతనము దర్శించగా, విశ్వకవి శాస్త్రిగారిని, గవర్నరుకు పరిచయము కావించుచు వీరు మా గురు ప్రముఖులని పేర్కొన్నారు. శాస్త్రిగారివద్ద వున్న వీణను గవర్నరుకు చూపుతూ యిది మా జాతీయ వాయిద్యమని తెలియపరిగినారు.

విశ్వకవి ఒక నాటకమున ఋషిపాత్ర ధరించగా, సంగమేశ్వరశాస్త్రిగారు వీణ వాయించి, ఆ నాటకమును రసవత్తరము కావించి, సదస్యులకు మహదానందము, తన్మయత్వము కావించినారట.

విశ్వకవి, శాస్త్రిగారిని తమతో అమెరికా రావలసినదిగా ఆహ్వానించినారు. కాని శాస్త్రిగారు ఛాందస బ్రాహ్మణులు. సముద్రయానము పనికిరాదని వెళ్ళలేదు. ఈ విషయమును గూర్చి వ్రాయుచు శ్రీ [illegible] శాస్త్రిగారు తెలుగు[illegible] లకు పెట్టుటకు లభించిన [illegible] దని వ్యాఖ్యానించినారు.

మధుర గాయని యగు శ్రీమతి [illegible] విశ్వకవికి పితృవాత్సల్యము, ఉభయులు [illegible] దేశభక్తులే [illegible] మూర్తులే.

డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణ పండితుడు రవీంద్రునకు సన్నిహితులైన ప్రముఖులలో ముఖ్యులు. రవీంద్రుని వేదాంతసారమును గ్రహించి సూత్రీకరించినవారు. కొంత కాలము కలకత్తా విశ్వవిద్యాలయమున వేదాంత శాస్త్రాచార్యులుగా నుండుటవలన విశ్వకవిని తరచు దర్శించు భాగ్యమును పొందిరి. 1931వ సంవత్సరమున విశ్వకవి జన్మదినమును పురస్కరించుకొని, కలకత్తాలో ఏర్పాటు కావింపబడిన అభినందన సభలో ప్రసంగము చేయుచు "ప్రాపంచిక విషయములను పట్టించుకొనక, భగవంతుని చేరుటకు సన్యాస మొకటే మార్గమని ఆశించువారు పశ్నెములలో చెక్కబడిన పువ్వు వంటి వారే కాని సహజ పరిమళమును వెదజల్లు పుష్పములు మాత్రము కానేరవు. భగవంతుని సాక్షాత్కరింపజేయుటకు అది మార్గముకాదు. ప్రాపంచిక విషయముల యెడల విముఖత చూపక ప్రజాసేవయే పరమార్థమని భావించి మానవాభ్యుదయము కొరకు కృషి సల్పుట వలననే భగవత్ సాక్షాత్కారము పొందుటకు వీలు కలుగును. ఇదే భారతీయ ఋషి సాంప్రదాయము. అదే రవీంద్రుని మార్గము. కావుననే ఆయన ఋషిపుంగవుడు. సహజ పరిమళము గల పుష్పగుచ్ఛము" అని కీర్తించినారు.

## గురుదేవుల జయంతి నాడే లగ్నం

ఉత్తరప్రదేశ రాజ్యపాలకులు, బహుభాషాకోవిదులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ అధ్యక్షులు అయిన డాక్టరుబెజవాడ గోపాలరెడ్డి మహాశయులు, విశ్వభారతిలో, గురుదేవుల పాద మూల చెంత విద్యాభ్యాసముచేయు భాగ్యమును పొందియున్నారు. వీరు గురుదేవులకు సన్నిహితులు, వారియెడల అపారమైన భక్తి ప్రపత్తులు కలిగినవారు. విశ్వకవి శత జయంతిఉత్సవ సమయమున, శ్రద్ధాంజలి ఘటించుచు పలికినపలుకులు అమృతపుచినుకులు. "ప్రతి పుట్టినరోజున మా యింట ప్రతి శుభసమయమున, గీతాంజలి నుండి కొన్ని గీతికలు చదువుతూ, ఆ భావములలో పూర్తిగా నిమగ్నుడనై పోతూ ఉంటాను. 1938లో నా వివాహ సందర్భములో తగిన ముహూర్తవిషయమై పండితులు తర్జనభర్జనలు

జరుపుతూఉండగా ఒక్క త్రుటిలో ఆ వివాదాలను తేల్చివేశాను. మా వివాహము మే 8వ తేదీని జరుగవలెనని నిర్ణయించితిని. గురుదేవుల జన్మదినము కంటే వేరు శుభముహూర్తములేదుకదా. ఈ సందర్భములో విడుదలచేసిన 'రవీంద్ర ప్రతిభ'యనువిశ్వకవి జీవిత చరిత్రలో పరిచయవాక్యములు వ్రాయుచు రవీంద్రనాథఠాకూరు ఒకానొక నవ లోకానికి ప్రతీక. ప్రాచీనవిజ్ఞానము, ఆధునిక భావవాహిని, ఆయనలో మధుర మేళనం పొందినవి. ప్రాచ్యపాశ్చాత్య జగత్తులకు, సాంప్రదాయిక, ఆధునిక భావాలకు ఆయన సేతువు. ప్రధానముగా ఆయన ఆధ్యాత్మిక ప్రాతిపదికగల కవి. కోటి ప్రజల ఆశయాలను చక్కగా అరము చేసుకొనిన కళాకుశలుడు. సుఖాలలోను, కష్టాలలోను కోటి ప్రజలకు అండగా నిలిచి వారి భావోద్వేగాలనే ఆయన గానము చేసాడు. రాజకీయాలలో చొరబడక పోయినా దేశ లోపాలను సరకుచేయకుండా స్వదేశాన్ని విశేషముగా ప్రేమించిన దేశభక్తులాయన. ప్రకృతితో అత్యంత సన్నిహిత వాతావరణములో ఆయన పెరిగారు. ఆయన దృష్టిలో భగవంతుడు, మానవుడు, ప్రకృతి అభిన్నాలు ... ఆయన కళామూర్తి. ఆయన గంభీరమూర్తి...ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయము వారు అన్నట్టు ఆయన శతముఖ ప్రతిభా సంపన్నుడు, గాంధీజీ చెప్పినట్టు 'ఆయన విశ్వకవి' గురుదేవుడు" అని భాషించినారు.

శ్రీ గోపాలరెడ్డిగారు విశ్వకవి రచించిన కాళిదాసు, ఊర్వశి మున్నగు పద్యకావ్యములను ఆంధ్రీకరించినారు. దేవయాని, చిత్రాంగద, విసర్జనమాలిని, ప్రకృతి ప్రతీకారము అను రవీంద్రుని నాటకములను ఆంగ్లపరివర్తనముల నుండి గాక, వంగమాతృకల నుండియే అనువదించినారు.

ఆచార్య డాక్టరు రాయప్రోలు సుబ్బారావుగారు శాంతినికేతనమున విశ్వకవి పాదముల చెంత ఆంగ్ల, వంగ సాహిత్యములను అభ్యసించి, తెలుగు భాషలో కొన్ని ఖండకావ్యములు ప్రచురించి దేశాభిమానమును ప్రబోధించుచు, సుకుమారమును, లాలిత్యమును తమ కవితలో పోషించిరి. రవీంద్రుని వలనే వీరికివి, ఆధ్యాత్మిక ప్రేమ, ఆత్మసౌందర్యము, దేశభక్తి అభిమాన విషయములు.

శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారు వంగదేశమున విద్యాభ్యాసముచేసి, తమ కవితలో రవీంద్ర సాహిత్య సౌరభములు సంతరించి పెట్టిరి.

శ్రీ మల్లవరపు విశ్వేశ్వరరావుగారు విశ్వభారతి యందు విద్యాభ్యాసము చేసి, విశ్వకవి కవితా మాధుర్యమును తెలుగుభాషలో చొప్పించినారు.

రవీంద్ర కవీంద్రుని ప్రతిభను శ్లాఘించుచు వారిపై వ్యాసములు వ్రాసి ప్రకటించినవారిలో ముఖ్యులు మొబ్బూరి కృష్ణారావు, తనికెళ్ళ వీరభద్రుడు మొదలగు తెలుగు ప్రముఖులెందరో కలరు.

రాయప్రోలు, విశ్వనాథ, వేంకట పార్వతీశ్వరులు మొదలగువారు విశ్వకవిపై కావ్యగానముచేసి, శ్రద్ధాంజలి ఘటించిన వారిలో నున్నారు.

చలం, ఉచంట జానకీరామ్ ప్రభృతులు గీతాంజలిని తెలుగు చేసిన మేధావులు.

విశ్వకవి శాంతినికేతనమున చేయుచున్న సాంస్కృతిక యజ్ఞము అవిచ్ఛిన్నముగా సాగుటకు ఆనాటి జయపుర, పిఠాపుర, విజయనగర, యిత్యాది జమీందారులు ధన సహాయము కావించి, వారికి అత్యంత ప్రీతి పాత్రులైనారు.

1938వ సంవత్సరమున డాక్టరు కట్టమంచి రామలింగా రెడ్డిగారి అధ్వర్యమున నడచుచున్న ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు, విశ్వకవికి, గౌరవ డాక్టరేటు బిరుదమునిచ్చి సత్కరించినారు.

రవీంద్రకవీంద్రుని కాంస్యవిగ్రహము ఆంధ్ర విశ్వకళాపరిషత్ ఆర్టు కళాశాలలో ఆవిష్కరింపబడుటయే తెలుగువారికి వారి యెడల గల గౌరవ ప్రపత్తులను సూచించుచున్నది. ✦

---

# రచయితలకు విజ్ఞప్తి

ప్రజలకు ఆసక్తికరమైన వర్తమాన పరిస్థితులను గురించి "ఆంధ్రప్రదేశ్" పత్రిక కోసం ప్రత్యేకంగా రాసిన రచనలు పంపించండి.

సాంఘిక, సాంస్కృతిక విషయాలను గురించిన రచనలూ, ప్రజలకు విజ్ఞాన ప్రదములైన రచనలు కూడా పంపవచ్చు. ప్రకటించిన రచనలకూ, ఫొటోలకూ పారితోషికం చెల్లించబడుతుంది.

పి. వామనరావు

"ఆంధ్రప్రదేశ్" పత్రిక ప్రధాన సంపాదకులు, సమాచార పౌరసంబంధ యాత్రిక శాఖ, హైదరాబాదు.

(గత సంచిక తరువాయి)

# తరాల తారతమ్యాలు

ఎం. వి. రాజగోపాల్

తరాల తారతమ్యం అనేది ప్రపంచమంతా వ్యాపించిన సమస్య అని చెప్పడంలో ఏ మాత్రం సందేహం లేదు. సిరిసంపదలతో తులతూగుతున్న అమెరికా వంటి దేశాలలోనే ఇది తీవ్రంగా కనిపిస్తున్నది. అయితే అమెరికన్ పెద్దలు, పిల్లల ఒడుదుడుకులను అవగాహనతో, సానుభూతితో పరిశీలిస్తున్నారు. శాన్‌ఫ్రాన్సిస్కో సిటీ కాలేజి ప్రొఫెసరు ఒకాయన శాన్‌ఫ్రాన్సిస్కో పర్యటన సందర్భంలో నన్నుకూడా తనవెంట తీసుకొని వెళ్ళుతూ, దారి పొడుగునా ఆ దేశయువకుల సమస్యలను గురించి నాకు చెప్పారు. ఈ సమస్య ఆయన మనస్సులో ఎక్కువగా మెలగుతూవున్నట్లు నాకు తోచింది. అమెరికాలో పెద్దలందరూ ఈ విషయాన్నే ఆలోచిస్తూవుంటారు. సమాజంలో పాతుకొనిపోయివున్న వ్యవస్థ పట్ల అనేక విషయాలపైన తిరుగుబాటు చేయడానికి యువకులకు హక్కు వుందని ఆయన ఉదారంగా అంగీకరించాడు. అయితే వారు దౌర్జన్యానికి ఎందుకు దిగుతున్నారో అర్థంకావడం లేదని చెప్పాడు. ఇది క్షమించరానిదని అన్నాడు. మేము సంభాషణ ధోరణిలో మాట్లాడుతున్నందువల్ల ఆయన చెప్పిన మాటలను యాధాతథంగా ఉటంకించడం కష్టం. అయితే ఆయన చెప్పిన విషయాలు ఇవి. "ఈకాలపు యువకులకు మా కంటే చాలా యెక్కువ విషయాలు తెలుసు. వారికి రాజకీయాలు, విధానాలు, చిన్నతనంలో నాకు తెలిసిన దానికంటే బహుశా బాగా తెలుసు. అయితే వారిలో కొంతమంది వున్నారు. వారు కేవలం అరాచకవాదులు. [గడ్డంపెంచుకొన్న యువకుడు ఒకడు ఆ వైపు వెళ్తున్నప్పుడు అతణ్ణి చూపిస్తూ ఈ మాటలన్నాడు.] వీరు నిస్సందేహంగా అల్పసంఖ్యాకులే. అయితే కేవలం ఒక వ్యవస్థగా రూపొంది, వారు అధిక వర్గాలవారిని విశ్చేష్టులుగా చేస్తున్నారు. విద్యార్థులుకాని యువకులు ఆందోళనను తీవ్రతరం చేస్తున్నారు. వీరిలో చాల మంది స్కూళ్ళకు స్వస్తిచెప్పారు. తమకు ఏమికావాలో వారికి తెలియదు. తమ జీవితకాలాన్ని వృధా చేసుకొంటున్నారు." వాషింగ్టన్‌లోని వాషింగ్టన్ స్మారక చిహ్నం వద్ద పార్కులో నేను మరొక పెద్దమనిషిని కలుసుకోవడం తటస్థించినపుడు మా సంభాషణలో ఆయనకూడా ఇట్టి అభిప్రాయాలనే వెలిబుచ్చాడు. ఒక యువ ఆందోళనకారుని గురించి ప్రస్తావిస్తూ [అతనిపేరు రెప్‌బ్రౌన్ అనుకొంటాను.] అతను విద్యార్థికాదని చెప్పాడు.

## విద్యార్థులు

విశ్వవిద్యాలయాలు, 4 ఏండ్ల కాలేజీల విద్యార్థులతో పోల్చి చూచినట్లయితే, 2-ఏండ్ల జూనియర్ కమ్యూనిటీ కాలేజీల విద్యార్థులు, సాధారణంగా విద్యార్థుల అశాంతికి దూరంగా వున్నట్లు తెలుస్తుంది. 2 ఏండ్ల కాలేజీలకు, విశ్వవిద్యాలయాలకు మధ్య చాల వ్యత్యాసం వుంది. 2 ఏండ్ల కాలేజీలలో విద్యార్థుల విషయంలో వ్యక్తిగత శ్రద్ధ చూపబడుతుంది. వారికి క్లాసులలో మంచి శిక్షణ గరపబడుతుంది. అంతేకాకుండా వారికి మంచి సలహాలు మున్నగునవి ఇవ్వబడుతాయి. వృత్తివిద్యలు అభ్యసించే ఈ విద్యార్థులు చదువు-సంధ్యల విషయంలో చాలా శ్రద్ధ వహిస్తారు. ప్రస్తుత వ్యవస్థలను మార్చివేయాలనే అభిప్రాయాలకు చాలా దూరంగా వుంటారు. అయితే విశ్వవిద్యాలయాలు, 4 ఏండ్ల కాలేజీలలో విద్యాశాఖాధిపతులు విద్యార్థుల విషయంలో వ్యక్తిగత శ్రద్ధ చూపరు. విద్యార్థులపట్ల-ప్రత్యేకంగా కొత్తగా చేరినవారి విషయమై-వ్యక్తిగత శ్రద్ధ వహించేందుకు ఫేకల్టీసభ్యులకు తగిన తీరికలేదు. థీసిస్ ప్రచురించడమో లేక భవిష్యత్తు నాశనం చేసుకోవడమో అనే పరిస్థితిలో వీరు పని చేస్తూవుంటారు.

శ్వేతవర్ణులు, రంగుజాతివారి సమస్య విషయం. ఈ సమస్యను ధైర్యంతోను, దూరదృష్టితోను ఉదారహృదయంతోను పరిష్కరించడం అనేది అమెరికన్ సమాజం యొక్క ఉన్నతాశయం. అయితే ఇది చాల జటిలమైన సమస్య. ఈ సంధికాలంలో ఇరువైపులగల తీవ్రవాదులను అదుపులోపెట్టడం అమెరికా నాయకత్వానికి అతి క్లిష్టమైన సమస్యగావుంది.

## నీగ్రోలు

తాను స్వేచ్ఛగల వ్యక్తిననీ, అయితే తనకు సమానత్వం లేదనీ నీగ్రోవ్యక్తి భావిస్తున్నాడు. అయితే విప్లవాత్మక దృక్పథంగల కొందరు నీగ్రోలు జాతిసమ్మేళనంపట్ల విముఖత చూపుతూ తాము ప్రత్యేక వర్గంగా అభివృద్ధిచెందడానికి కృతనిశ్చయులై వున్నారు. ఉదాహరణకు "బ్లేక్ పేంథర్" అనువారు అతివాదులు. సమ్మేళనానికి అనుకూలురుగాలేరు. నల్లవారు ప్రత్యేకంగా వుండాలనేది ఎంతవరకు పోయిందంటే, 2 ఏండ్లు, 4 ఏండ్లకాలేజీలలో చాలా వాటిలో నీగ్రో చదువులకొరకు ప్రత్యేకశాఖలు ఏర్ప

దీనాయి. సానుభూతి గల కొందరు శ్వేతవర్ణీయులు నిర్ణయించిన పాఠ్యప్రణాళికపట్ల తృప్తి లేకపోవడంవల్ల వాటిని నీగ్రో విద్యావేత్తలు పూర్తిగా మార్చివేశారు. ఈ శాఖలలో ఉద్యోగులుకూడా ఎక్కువమంది నీగ్రోలే వున్నారు. శాఖాధిపతులుకూడా నీగ్రోలే. ఇంచుమించు అన్ని విశ్వవిద్యాలయాలలో నీగ్రో విద్యార్థి సంఘాలు ఏర్పడి తమ ప్రత్యేకతకు పాటుపడుతున్నాయి. అయితే దీన్ని గోరంతలు కొండంతలు చేయనవసరం లేదు. ఎందుకంటే అమెరికా జనాభాలోని ఈ రెండు వర్గాలవారి మధ్య జీవితంలోని అనేక ఇతర రంగాలలో ఎంతో సామరస్యం వున్నట్లు అనేక నిదర్శనాలు కనిపిస్తున్నాయి. అందరి హృదయాలలో అట్టడుగునవున్న ఈ పరస్పర సానుభూతి, సద్భావాలు అతివాదులైన శ్వేతజాతి వర్గీయుల దౌర్జన్యధోరణులను అణగద్రొక్కగలవనీ, ఇరువర్గాల మధ్య సామరస్యం ఏర్పడగలదనీ గట్టి విశ్వాసముంది. "ఎవ్వరికీ పట్టని పతితాపన భావం" నుంచి నీగ్రోలు ఎంతో ముందుకు పురోగమించారు. కీ॥ శే॥ మార్టిన్ లూథర్‌కింగ్ కొన్నేండ్ల క్రిందట అమెరికా దక్షిణరాష్ట్రాలలోని జైలులో మగ్గుతున్నపుడు శ్వేతమత గురువుకు పంపిన లేఖలో ఈ విషయాన్నే పేర్కొన్నారు. అయితే డా. కింగ్ మాటల్లో చెప్పాలంటే "ఇప్పటి ప్రస్తుత పరిస్థితి" పట్ల అమెరికా జాతి తృప్తిపడకూడదు.

## జనాభా పెరుగుదల

తమ జనాభా పెరుగుదలపట్ల అమెరికనులు వ్యాకులపడుతున్నారు. భారతదేశం నుంచి వచ్చిన నావంటి వ్యక్తికి వారి వ్యాకులత కొంత వినోదంగా ఉన్నట్లు కనిపించింది. అయితే విపరీతంగా పెరుగుతున్న జనాభాపట్ల ప్రతి అమెరికన్ పౌరుని మనస్సులో వాస్తవిక ఆందోళన వుంది. విద్యార్థులు నిర్వహించిన ఆన్‌ఆర్బర్ కన్వెన్షన్‌లో "ఇద్దరు పిల్లలు చాలు" అన్న నినాదం వారి ఆందోళనను వ్యక్తపరుస్తుంది. తనకు నాల్గవ సంతానం కలగబోతున్న కాలేజీ యువకుని క్షమాపూర్వకమైన దృక్పథాన్ని గురించి నేను ఇదివరకే చెప్పాను. జనాభా పెరుగుదలను అరికట్టడానికి చేసే ప్రయత్నంవల్ల మరొక వివాదాస్పదమైన సమస్య—అంటే గర్భస్రావాన్ని శాసనబద్ధంచేసే సమస్య ఏర్పడింది. హవాయ్ రాష్ట్రంలో గర్భస్రావం శాసనబద్ధం చేయబడింది. అనేక ఇతర రాష్ట్రాలలో ఇది జరగలేదు. ఈ విషయమై అభిప్రాయభేదాలు తీవ్రంగా వున్నాయి. జనాభాకు స్థిరత్వం చేకూర్చి తగ్గిపోతున్న ప్రపంచ సాముదాయక వస్తుసంపదను పరిరక్షించేందుకు గర్భస్రావాన్ని చట్టబద్ధం చేయడం అవసరమని ఆలోచనా కార్యక్రమంలో పాల్గొన్న మిచిగాన్ యొక్క సహజవనరుల డైరెక్టరు డా. రాల్ఫ్ మ్యాక్‌ములాన్ గట్టిగా వాదించారు. డా. మ్యాక్‌ములాన్ విజ్ఞప్తిని వ్యతిరేకిస్తూ కాథలిక్ సంస్థవారు గర్భస్రావాన్ని శాసనబద్ధం చేయకూడదని చెబుతూ వైట్‌హౌస్ ముందర ప్రదర్శనలు లేవదీశారు. మరొకచోట ఇంకొక రకమైన ప్రదర్శన జరిగింది. దీనిలో ఎనిమిది మంది మహిళలు పాల్గొన్నారు. చట్టబద్ధమైన గర్భస్రావం విషయమై సాక్ష్యాలు సేకరిస్తున్న ఒక కమిటీ నివేదికను ఈ మహిళలు ఒక పాట రూపంలో నినాదాలు చేశారు.

ఈ కమిటీ ముందర, విద్యావేత్త అయిన శ్రీ రాస్ తన సాక్ష్యం ఇస్తూ వున్నపుడు ఈ పాట పాడబడింది. ఈ మహిళలు చెబుతోన్నది సక్రమంగా లేదని శ్రీ రాస్ కమిటీ అధ్యక్షుణ్ణి ప్రశ్నించారు. జనాభాను అదుపులో పెట్టే విషయమై అమెరికనులు తీవ్రంగా ఆలోచిస్తున్నారు. ముఖ్యంగా యువ తరంవారు ఈ సమస్యపట్ల ప్రత్యేక శ్రద్ధవహిస్తున్నారు.

## వాతావరణంలో కాలుష్యం

గాలి నీరు కలుషితం సమస్య విషయంలో, ప్రధానమైన జంతు వృక్షశాస్త్ర సమస్యల నుంచి ప్రబల దృష్టిని మళ్ళించడానికి స్వార్థపరులు చేస్తున్న ఆందోళన అని కొందరు అతివాదులు భావిస్తున్నారు. ఈ సమస్య ఇక తిరుగులేని స్థాయిని అందుకొన్నదని మరికొందరు భావిస్తున్నారు. అసలు విషయం, ఇతర విషయాలలో మాదిరే ఈ రెండు వర్గాల తీవ్రవాదులు చెబుతున్న వాటికి మధ్యలో వుంటుంది. 1965 లోనే, అమెరికాలో నగర కలుషిత వాతావరణాన్ని గురించి చేసిన అంచనాలు, 65 పెద్ద నగరాలలో వాతావరణంలో పేరుకొనిపోయిన ధూళి, బూడిద, పొగ, సల్ఫర్ డై ఆక్సైడు వంటి పదార్థాలు చాల ప్రమాదకర స్థాయిలో వున్నాయని నివేదించబడింది. న్యూయార్కులో ఈ కలుషిత వాతావరణం 457.5 స్థాయిలో వుంది. చికాగో-హాల్యాక్‌లో 241.0 స్థాయిలో వుంది. 1968 లో వాషింగ్టన్‌లో కలుషిత వాతావరణాన్ని పరిశీలిస్తున్న సెనెట్ ఉపసంఘం సమక్షంలో ఆవిరితో నడిచే రెండు కార్ల నమూనాలు ప్రదర్శించబడినాయి. పెట్రోలుతో నడిచే కార్లనుంచి వెలువడే పొగవల్ల గాలి కలుషితమవుతున్నది. దీన్ని నివారించాలంటే ఆవిరితో నడిచే కార్లు శ్రేష్ఠమైనవని ప్రదర్శించబడింది. అయితే ఇందులో అనేక యాంత్రిక లోపాలున్నందువల్ల, ఈ విషయంలో ఏదీ ముందుకు జరగలేదు.

నీటి కలుషితం విషయమై నేను అంకెల వివరాలు ఇవ్వదలచుకోలేదు. అయితే సాన్‌ఫ్రాన్సిస్కోలో నాకు ఆతిథ్యమిచ్చిన సిటీకాలేజి ప్రొఫెసరు జాన్ జాన్సన్ అనుభవాన్ని మాత్రం తెలుపుతాను. కొన్ని వారాలకు ముందు ఆయన చేపల వేటకు వెళ్ళి సమృద్ధిగా చేపలు పట్టుకొని ఇంటికి వచ్చాడు. రాత్రి భోజనానికి కావలసిన చేపలను వాడుకొని మిగతా వాటిని రెఫ్రిజరేటర్‌లో భద్రపరిచాడు. చేపలు వండిన తరువాత తెలిసిందట!— అవి తిన యోగ్యంగా లేవని! ఎందుకంటే వాటిలో అంతా పారిశ్రామిక తైలం నిండివుంది! వెంటనే రెఫ్రిజరేటర్లో భద్రపరచిన చేపలను పారవేయవలసి వచ్చింది. ఈ నిదర్శననే కాక మహా నగర ప్రాంతాలలో గాలి, నీరు విపరీతంగా కలుషితమై వున్నట్లు నిర్వివాదమైన విషయం. కనుక వాతావరణాన్ని కలుషితం చేసినందుకు బాధ్యులైనవారిపైన కోర్టులో ప్రజలతరఫున న్యాయరీత్యా చర్య తీసుకోవాలని ఆన్ ఆర్బర్ సమావేశంలో ప్రసంగించారంటే అందులో ఆశ్చర్యమేమీలేదు. రిపబ్లికన్ మార్విన్ యల్. ఈశ్చ అనే ఆయన ఆన్ ఆర్బర్ ఆలోచనా కార్యక్రమ మహాసభలో ప్రసంగిస్తూ, వాతావరణాన్ని కలుషితం చేయడాన్ని శాసనరీత్యా విరో

ధించి. కలుషిత వాతావరణంవల్ల కలిగే దుష్పరిణామాలనుంచి ప్రజలను కాపాడాలని చెప్పారు. న్యాయ రీత్యా, శాసనరీత్యా గల చర్యలకు తోడుగా, విద్యా సంస్థలు కూడా ఈ విషయమై శ్రద్ధ తీసుకొంటున్నాయి. వాషింగ్టన్ డి. సి. సమీపంలో మేరీల్యాండ్ రాష్ట్రంలోని చార్లెస్ కౌంటీ కమ్యూనిటీ కాలేజీని నేను దర్శించినపుడు, అక్కడ వృత్తి కార్యక్రమాలలో "కలుషిత నివారణ విజ్ఞానశాస్త్రం" అను విషయంలో రెండేండ్ల కోర్సుకూడా ఒకటి వుందని తెలుసుకొని ఆశ్చర్యపడినాను. నేను దర్శించిన సుమారు డజను కాలేజీలలో ఇటి కోర్సును ఆరంభించిన మొదటి కాలేజీ ఇదేనని వాటి ప్రాస్పెక్టస్‌లను చూచిన తరువాత తెలుసుకొన్నాను. ఈ విషయంలో అమెరికా జాతి అంతా ఎంత తీవ్రంగా శ్రద్ధ వహిస్తున్నదో ఈ విద్యా సంస్థ రుజువుచేస్తున్నది. అభివృద్ధి చెందని ఆర్థిక పరిస్థితిలో ఏవిధంగా సర్దుబాటుచేసుకోవాలో, ఆన్ అర్బర్ యువకులు చెప్పినదాన్ని ఇప్పుడు వివరిస్తూ ఈ వ్యాసం ముగించుతాను. అష్టైశ్వర్యములతో తులతూగే అమెరికా సమాజంలో ప్రజలు ఆర్థిక విషయంగా ఆందోళన చెందడం ఆశ్చర్యంగానే వుంది. అయితే 1970 నుంచి ఒక దశాబ్దంవరకు అమెరికాలో ఆర్థిక మాంద్యత తప్పనిసరిగా ఏర్పడుతుందని ఆర్థికవేత్తలు, పారిశ్రామిక వేత్తలు భావిస్తున్నారు. ఈ కాలంలో వ్యాపార వాణిజ్య కార్యకలాపాలు మందకొడిగా కొనసాగుతాయి. అన్ని స్థాయిలలో నిరుద్యోగం ప్రబలిపోతుంది. నేను సీటల్‌లో వున్నప్పుడు చాల పెద్దదైన బోయింగ్ కంపెనీ, ప్రతివారం వేల మంది కార్మికులను పనినుండి తొలగిస్తున్నదని విన్నాను. ఇప్పుడు ఆ కంపెనీలో 25000 మంది పనిచేస్తున్నారు. ఇవి అక్కడక్కడా జరుగుతున్న సంఘటనలే అయినా అమెరికన్ ఆర్థిక మాంద్యత సూచనకు ఇవి చిహ్నాలు. అయితే ఈ ఆర్థిక మాంద్యత నుంచి దేశం త్వరలో కోలుకోగలదని ప్రసిద్ధ ఆర్థికవేత్తలు ఆశాభావం వెల్లడిచేస్తున్నారు. నేను ఈ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను. ఎందుకంటే ఏస్థాయిలో చూచినా అమెరికనులు గొప్ప శక్తి, యుక్తి, ఉత్సాహంగల ప్రజలు కనుక వారు సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక, విద్యా, సమస్యలను ధైర్యంగా ఎదుర్కొని పరిష్కరించుకోగలరు. జె. యఫ్. కెన్నెడీ విమానాశ్రయం నుంచి 747 బోయింగ్ విమానంలో లండన్ వైపు ఖండాంతర ప్రయాణం చేస్తుండగా, కను చూపునుంచి అమెరికా దేశం మరుగు పడుతున్నపుడు ఈ ప్రగాఢ అభిప్రాయమే నాకు కలిగింది.

(సమాప్తం)

# బాలభవన్‌కు శంకుస్థాపన

రాష్ట్ర మహిళా సంక్షేమం, యాత్రిక శాఖల మంత్రి శ్రీమతి రోడామిస్త్రి, మే 27వ తేదీన నల్లగొండలో బాలభవన్ భవన నిర్మాణానికి శంకుస్థాపన చేశారు.

నల్లగొండ జిల్లా కలక్టరు శ్రీ రమేశ్ గోవర్ యీ ఉత్సవానికి అధ్యక్షత వహించారు.

శ్రీమతి రోడామిస్త్రి ప్రసంగిస్తూ యీ పథకం అమలుకు కృషిచేసిన మహిళల క్లబ్‌వారిని అభినందించారు. పిల్లల అభ్యుదయానికి తగిన సౌకర్యాలు కల్పించడానికిగల అవసరాన్ని గూర్చి ఆమె వివరించారు. తెలంగాణా ప్రాంతంలో సాంఘిక సంక్షేమానికి ప్రభుత్వం అమలు జరుపుతున్న వివిధ సంక్షేమ పథకాలను గూర్చి ప్రస్తావిస్తూ వచ్చే సంవత్సరాలలో యిటువంటి అనేక పథకాలను అమలు జరుపుతారనే ఆశాభావాన్ని ఆమె వ్యక్తం చేశారు. అద్యతన భావిలో నల్లగొండలో బాలల గృహాన్ని ఏర్పాటు చేస్తారని ఆమె అన్నారు.

మన జాతీయ జీవనంలో యాత్రల ప్రాముఖ్యాన్ని గూర్చి వివరిస్తూ, యాత్రలు కేవలం విదేశీయులకే పరిమితమైనవనే తప్పుడు భావన ఉన్నదని ఆమె అన్నారు. విశాలమైన మనదేశంలోని యితర ప్రాంతాలలో జరుగుతున్న విషయాలను యిక్కడి ప్రజలు వెళ్ళి చూడాల్సిన అవసరాన్ని గూర్చి ఆమె నొక్కి చెప్పారు. అన్ని సౌకర్యాలుగల టూరిస్టు హోటళ్లను ఏర్పాటు చేయడంలో పెట్టుబడి పెట్టాలని ఆమె వ్యాపార వర్గాలకు విజ్ఞప్తి చేశారు. ప్రభుత్వం కూడా వారికి తోడ్పడుతుందని ఆమె వెల్లడించారు. మన రాష్ట్రంలో అనేక సుందర ప్రదేశాలను అభివృద్ధి పరచడానికి అనేక పథకాలు పరిశీలనలో ఉన్నాయని ఆమె అన్నారు. యాత్రా ప్రదేశాలకు రోడ్లను నిర్మించడంలో ఎక్కువ శ్రద్ధవహించాలని పి. డబ్ల్యు. డి. శాఖకు ఆమె విజ్ఞప్తి చేశారు.

# మన రాజ్యాంగం - శాసన సభలు

జె. వీరాస్వామి

మన రాజ్యాంగం ప్రకారం భారతదేశం సంపూర్ణాధికారాలు గల ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యం. అంతేగాక, పౌరులందరికీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని, భావ ప్రకటన, మత విశ్వాస ఆరాధన స్వాతంత్ర్యాన్ని, సమానప్రతిపత్తి, అవకాశాలను సమకూర్చి పౌరులందరి మధ్య, సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడం మన రాజ్యాంగం లక్ష్యం. ఈ లక్ష్య సాధనకు, మారుతున్న సాంఘిక అవసరాలకు అనుగుణంగా దేశ పరిపాలనా వ్యవస్థను తీర్చిదిద్దేటందుకు తగు శాసనాలను రూపొందించడానికి, అమలులోవున్న శాసనాలకు అవసరమైన సవరణలు చేయడానికి అనుకూలమైన యంత్రాంగం ఎంతో అవశ్యకమైవున్నది. పార్లమెంటూ, ఆయా రాష్ట్రాలలోను, కేంద్రపాలిత ప్రాంతాలలోను గల శాసన మండలులూ, ప్రధానంగా ఇందుకు ఉద్దేశించబడినవి.

## పార్లమెంటు

మొదట పార్లమెంటు స్వరూపం గురించి పరిశీలిద్దాం. పార్లమెంటు రాష్ట్రపతితోను, రాజ్యసభ, లోకసభ అనే రెండు సభలతోను కూడి ఉంటుంది. లోకసభలో 521 మంది ఎన్నికైన సభ్యులు, ఇద్దరు నామనిర్దేశితులైన సభ్యులు ఉన్నారు. రాజ్యసభలో 226 మంది ఎన్నికైన సభ్యులు, 12 మంది నామనిర్దేశితులైన సభ్యులు ఉన్నారు.

## శాసన సభలు

తరువాత రాష్ట్ర శాసనమండలుల గురించి తెలుసుకొందాం. ప్రతి రాష్ట్రానికి గవర్నరుతోను, శాసన సభతోను కూడిన శాసన మండలి ఉంటుంది. కొన్ని రాష్ట్రాలకు శాసన పరిషత్తు కూడా ఉంటుంది. ఆంధ్రప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్, తమిళనాడు, మహారాష్ట్ర, మైసూరు, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో శాసన పరిషత్తులు కూడా ఉన్నాయి. మహారాష్ట్రంలో వివిధ నియోజకవర్గాల నుండి ఎన్నికైన సభ్యులు 287 మంది ఉన్నారు. గవర్నరు ఒక ఆంగ్లో-ఇండియను సభ్యుని నామనిర్దేశం చేశారు. ప్రతి రాష్ట్రంలోను శాసన పరిషత్తు సభ్యుల మొత్తం సంఖ్య ఆ రాష్ట్ర శాసన సభ యొక్క మొత్తం సభ్యుల సంఖ్యలో మూడవవంతుకు మించ కూడదు. కాని శాసన పరిషత్తులో కనీసం 40 మంది సభ్యులు ఉండాలి. మన రాష్ట్ర శాసన పరిషత్తు సభ్యుల సంఖ్య 90. వీరిలో పురపాలక సంఘాలు, జిల్లా పరిషత్తులు, కంటోన్మెంటు బోర్డులు, పంచాయతీ సమితి సభ్యులచే ఎన్నుకోబడినవారు 31మంది, విశ్వవిద్యాలయ పట్టభద్రులచే ఎన్నుకోబడినవారు 8 మంది, ఉపాధ్యాయ నియోజకవర్గం నుండి ఎన్నుకోబడినవారు 8 మంది, శాసన సభ సభ్యులు కానివారిలో నుండి శాసన సభ్యులచే ఎన్నుకోబడినవారు 31 మంది ఉన్నారు. మిగిలిన 12 మంది సాహిత్యం, విజ్ఞానశాస్త్రం, కళలు, సహకారోద్యమం, సాంఘిక సేవలో విశేష అనుభవం, పరిజ్ఞానం కలిగిన వ్యక్తుల్లోనుండి గవర్నరుచే నామ నిర్దేశం చేయబడతారు.

శాసన నిర్మాణాధికారం పార్లమెంటు, శాసన మండలుల మధ్య విభజితమైవున్నది. రాజ్యాంగంలోని 7వ షెడ్యూలులో ఈ అధికారులను తెలిపే 3 జాబితాలున్నాయి. ఇందులో మొదటిది కేంద్ర జాబితా. దీనిలో పేర్కొన్న విషయాలపై శాసనాలను చేయడానికి పార్లమెంటుకు మాత్రమే అధికారం ఉంటుంది. రెండవది రాష్ట్ర జాబితా. దీనిలో ఉదహరించిన విషయాలపై శాసనాలు చేయడానికి రాష్ట్ర శాసన మండలులకు మాత్రమే అధికారం ఉంటుంది. మూడవది ఉమ్మడి జాబితా. ఇందులోని విషయాలపై శాసనాలు చేయడానికి పార్లమెంటుకు, రాష్ట్ర శాసన మండలులకు కూడా అధికారం ఉంటుంది.

లోక సభకు అధ్యక్షత వహించే అధికారిని "స్పీకరు" అంటారు. భారత దేశపు ఉపరాష్ట్రపతి రాజ్యసభకు 'ఛైర్మన్'గా ఉంటారు. అదేవిధంగా శాసన సభకు అధ్యక్షత వహించే వారిని స్పీకరు అని, శాసనపరిషత్తుకు అధ్యక్షత వహించేవారిని 'ఛైర్మన్' అని వ్యవహరిస్తారు. వీరికితోడు శాసన సభలో మరొక సభ్యుని 'డిప్యూటీ స్పీకరు' గాను; శాసన పరిషత్తులో మరొక సభ్యుని 'డిప్యూటీ ఛైర్మన్' గాను ఎన్నుకుంటారు. 'స్పీకరు', 'ఛైర్మన్' తమ సభ్యత్వం ఉన్నంతకాలం పదవిలో ఉంటారు. లోకసభ, రాష్ట్ర శాసన సభ, కేంద్రపాలిత ప్రాంతాల శాసన సభల కాల పరిమితి అయిదు సంవత్సరాలు. వీటి మొట్టమొదటి సమావేశపు తేదీనుండి ఈ కాలాన్ని లెక్కిస్తారు. కాగా రాజ్యసభ, రాష్ట్ర శాసన పరిషత్తులు రద్దుకావు. అయితే ప్రతి రెండు సంవత్సరాలకు మూడింట ఒక వంతు సభ్యులు పదవీవిరమణ చేస్తారు. వారి స్థానంలో క్రొత్త సభ్యులను ఎన్నుకోవడమో, నామ నిర్దేశం చేయడమో జరుగుతుంది.

శాసన మండలి కొన్ని కమిటీలను ఏర్పాటుచేసే హక్కు కలిగి ఉంటుంది. మనరాష్ట్ర శాసనసభ తన సభ్యులలో నుండి పబ్లిక్ ఎకౌంట్సు కమిటీ, హక్కుల కమిటీ మొదలైన ఆరు కమిటీలు ఏర్పాటు చేసింది.

## శాసన సభ్యుల హక్కులు

పార్లమెంటు, శాసన మండలుల సభ్యుల హక్కుల గురించి, అధికారాలు గురించి శాసనం ఏదీలేనంత కాలం, మన పార్లమెంటు శాసన మండలుల సభ్యులకు బ్రిటనులోని 'హౌస్ ఆఫ్ కామన్స్' సభ్యులకుగల హక్కులు, అధికారాలు వర్తిస్తాయి. ఈ విషయమున శాసనం చేసినప్పటికి, అది సమగ్రంగా ఉండ నేరదు. శాసనంలో అన్ని విషయాలు సమగ్రంగా పొందుపరచడానికి వీలు లేనప్పుడు, పార్లమెంటు శాసనసభ సభ్యులకుగల అధికారాలు ఆ శాసనంలోని పరిధికి పరిమితమైపోయే ప్రమాదం ఉన్నందున అట్టి శాసనములు మన దేశంలో ఇంతవరకు చేయబడలేదు.

శాసన మండలి ఒక సమావేశానికి మరొక సమావేశానికి మధ్య వ్యవధి ఆరు మాసములకంటె తక్కువ ఉండవలెను. రాష్ట్ర శాసన సభ సాధారణంగా సంవత్సరానికి మూడుసార్లు సమావేశమౌతుంది. బడ్జెటు సమావేశం ప్రతి సంవత్సరం సాధారణంగా ఫిబ్రవరి నెల రెండవ వారంలో ప్రారంభమై మార్చినెల ఆఖరు వరకు జరుగుతుంది. తరువాత వర్షాకాల సమావేశం సాధారణంగా జూన్ లేక జూలై నెలలో జరుగుతుంది. ఈ సమావేశంలో ఎక్కువగా శాసన నిర్మాణ కార్యక్రమం సాగుతుంది. అక్టోబరు నవంబరు మాసాలలో సీతాకాల సమావేశం జరుగుతుంది. ఇందులో కూడా ఎక్కువగా శాసన నిర్మాణ కార్యకలాపాలే జరుగుతాయి. శాసన సభకు జరిగిన సార్వత్రిక ఎన్నికల తర్వాత మొదటి సమావేశం ప్రారంభంలోనూ ప్రతి సంవత్సరం మొదటి సమావేశం ప్రారంభంలోనూ శాసన సభలో గవర్నరు ప్రసంగిస్తారు. శాసన పరిషత్తు కూడా వుండే రాష్ట్రాలలో గవర్నరు ఉభయసభల సంయుక్తసమావేశంలో ప్రసంగిస్తారు. సమావేశంలో పరిశీలించే అంశాలను గవర్నరు తమ ప్రసంగంలో స్థూలంగా తెలియజేస్తారు.

## కార్యక్రమం

తరువాత, శాసనసభా కార్యక్రమం పరిశీలిద్దాం. రాష్ట్ర శాసన సభలోగాని, పరిషత్తులోగాని అన్ని అంశాలు సభకు అధ్యక్షత వహించే వ్యక్తిగాక సభలో హాజరైవున్న సభ్యుల మెజారిటీ వోట్లద్వారా నిర్ణయింపబడతాయి. అధ్యక్షత వహించే వ్యక్తి వోటు చేయడానికి వీలుండదు. కాని వోట్లు సమానంగా విభజింపబడ్డప్పుడు మాత్రం ఆయనకు నిర్ణాయక వోటు వుంటుంది. రాష్ట్ర శాసన సభలోగాని, పరిషత్తులోగాని సభ్యులస్థానం ఖాళీగా ఉన్నప్పటికి ఆ సభ పనిచేయటానికి ఆటంకములేదు. సభకు హాజరు కావడానికిగాని, వోటుచేయడానికిగాని, కార్యకలాపాలలో పాల్గొనడానికిగాని హక్కులేని వ్యక్తి ఆ విధంగా చేసినట్లు తరువాత కనుగొనబడినప్పటికి, రాష్ట్ర శాసన మండలియొక్క కార్యకలాపాలు చెల్లుబడి కలిగివుంటాయి. శాసనమండలి శాసనం ద్వారా మరొక విధంగా నిబంధన చేసేవరకు శాసన సభలోగాని పరిషత్తులోగాని పదిమంది సభ్యులు, లేక మొత్తము సభ్యులలో పదోవంతు సభ్యులు—ఇందులో ఏ సంఖ్య అధికమో ఆ సంఖ్య—'కోరం'గా ఉంటుంది. ప్రతి రాష్ట్ర శాసన మండలియందు భావ ప్రకటన స్వాతంత్ర్యం వున్నది. శాసన మండలిలో గాని దాని కమిటీలలో గాని సభ్యుడు వ్యక్తం చేసిన విషయమునగాని తానువేసిన వోటు విషయమునగాని, ఆయన న్యాయస్థానంలో ఏచర్యకు పాత్రులుకారు. కార్యవిధాన సంబంధమైన క్రమరాహిత్యం ఉందనే కారణంపై, శాసనమండలి కార్యక్రమమునకు ఏ లోపము ఆపాదింపడు. సుప్రీం కోర్టు, లేక హైకోర్టు న్యాయమూర్తి యొక్క కర్తవ్య నిర్వహణలో, వారి ప్రవర్తనకు సంబంధించిన చర్చ శాసన మండలిలో జరుగ కూడదు.

బిల్లులను శాసన సభలోకాని, శాసనపరిషత్తులోగాని ప్రవేశపెట్టవచ్చును. ఆర్థిక సంబంధమైన బిల్లులు అంటే 'మనీ బిల్లులు' మాత్రం శాసన సభలోనే ప్రవేశపెట్టడానికి వీలున్నది. బిల్లు ఉభయ సభలలోనూ ఆమోదించిన పిమ్మట గవర్నరుకు వారి సమ్మతి కోసం పంపబడుతుంది. కొన్ని విషయాలకు సంబంధించిన బిల్లులను రాష్ట్రపతి ఆమోదం నిమిత్తం, గవర్నరు పంపవలసి ఉంటుంది.

## ప్రశ్నల సమయం

శాసన మండలియొక్క ముఖ్య కర్తవ్యం శాసన నిర్మాణం అయినప్పటికి శాసన సభలోగాని శాసన పరిషత్తులోగాని జరిగే కార్యకలాపాలలో ప్రశ్నలసమయం ముఖ్య పాత్ర వహిస్తుంది. ప్రజానీకానికి సంబంధించిన విషయాలను గురించి సమాచారం తెలుసుకోవడానికి సభ్యులు మంత్రులను ప్రశ్నలు అడుగుతారు. శాసనసభలోను, పరిషత్తులోను సభ్యులు తుఫాను, వరదలు, అల్లరులు తదితర ఆందోళనకర విషయాలను సావధాన తీర్మానాల ద్వారాను, వాయిదా తీర్మానాల ద్వారాను ప్రభుత్వదృష్టికి తీసుకవస్తారు. ఇంతేకాకుండా ఇతరతీర్మానాలను, ప్రయివేటు బిల్లులను ప్రతిపాదించడానికి కూడా సభ్యులకు హక్కువున్నది. పరిపాలనా యంత్రాంగానికి సంబంధించిన అన్ని సమస్యలు, రాష్ట్రపు నలుమూలల్లో ప్రజల యొక్క కష్టనష్టాలు, ఆయాప్రాంతపు ప్రజాప్రతినిధులద్వారా ప్రభుత్వదృష్టికి, చర్చల సందర్భములో తీసికొని రాబడతాయి. ఈవిధముగా ప్రజాస్వామ్య పద్ధతి, శాసన సభలద్వారా రాణిస్తూ ప్రజలయొక్క అభ్యున్నతికి, శ్రేయస్సుకు ఉపకరిస్తుంది. చర్చల సందర్భంలో సభ్యుల వాక్చాతుర్యము, హాస్యోక్తి, సమయస్ఫూర్తి ప్రతిబింబిస్తూ చర్చలు రసవంతంగా ఉంటాయి.

తెలంగాణా ప్రాంతంలోని ప్రాదేశిక నియోజక వర్గాల నుండి ఎన్నికైనట్టి శాసన సభ సభ్యులతో కూడిన ప్రాంతీయ సంఘం ఒకటి మన శాసన సభలో కలదు. ఆ సంఘం రాజ్యాంగంలోని 371వ అనుచ్ఛేదము క్రింద, రాష్ట్రపతి ఉత్తర్వుద్వారా ఏర్పాటైంది. తెలంగాణా ప్రాంతమునకు సంబంధించిన మేరకు స్థానిక స్వయం పరిపాలన, ప్రజారోగ్యం, విద్య, మద్యపాన నిషేధం, వ్యవసాయభూముల విక్రయం, పరిశ్రమలు, మార్కెట్లు, సంతలు, ఆర్థికప్రణాళిక, సబార్డినేటు సర్వీసులలో నియామక పద్ధతి మొదలైన విషయాలు ఈ ప్రాంతీయ సంఘం పరిధిలో ఉన్నాయి. ముఖ్యంగా ఈ విషయాలకు సంబంధించి తెలంగాణా ప్రాంతానికి వర్తించే బిల్లులన్నింటిని, ప్రాంతీయ సంఘం పరిశీ

లించిన తరువాతనే, ఉభయ సభలు ఆమోదిస్తాయి. తెలంగాణా ప్రాంతానికి వర్తించే శాసన, లేక కార్యనిర్వహణ పరమైన చర్య గురించి రాష్ట్ర ప్రభుత్వానికి సిఫారసు చేస్తూ తీర్మానం ఆమోదించే అధికారం కూడా ప్రాంతీయ సంఘం కలిగివున్నది. అట్టితీర్మానాల ద్వారా సిఫారసు చేసే కార్యనిర్వాహక చర్య సాధారణ విధానానికి సంబంధించినదై ఉండాలి. సిఫారసుచేసిన శాసన, లేక కార్యనిర్వాహక చర్య, తెలంగాణా ప్రాంతానికి సంబంధించిన వార్షిక బడ్జెటులో, లేక పంచవర్ష ప్రణాళికలో సంకల్పించిన ఆర్థిక ఏర్పాటుకు అనుగుణంగా ఉండాలి. వార్షిక బడ్జెటులో ఆదాయ వ్యయాలకు సంబంధించిన వివరాలు తెలంగాణా ప్రాంతానికి, రాష్ట్రంలోని మిగతా ప్రాంతానికి విడివిడిగా చూపవలసిందిగా ఇటీవల నిబంధన చేయబడినది. దీనివల్ల ప్రాంతీయ సంఘానికి ఆర్థిక విషయ పరిశీలనా సౌలభ్యం కూడా చేకూరుతుంది.

(ఆకాశవాణి, హైదరాబాదువారి సౌజన్యంతో)

# రాష్ట్రపతి శ్రీ వి.వి. గిరి
# తిరుపతి సందర్శన

భారత రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి మే 26వ తేదీన తిరుపతి దేవస్థానం సందర్శించారు. శ్రీమతి గిరి, ఆంధ్రప్రదేశ్ గవర్నర్ శ్రీ ఖండూభాయ్ దేశాయ్ గార్లు కూడా రాష్ట్రపతి వెంట వున్నారు.



మే 26వ తేదీన రాష్ట్రపతి ప్రయాణంచేసిన ప్రత్యేక రైలు తిరుపతి నుంచి నెల్లూరు వచ్చినప్పుడు నెల్లూరు పౌరులు వారికి ఘనమైనస్వాగతం ఇచ్చారు.





హరిజనోద్ధరణ :

# గాంధీచరిత్ర-తోలుబొమ్మలాట

(గత సంచిక తరువాయి)

—ఆరుద్ర

పాట :

అగవయ్యా మిత్రమా – మాట.
లాడవయ్యా మిత్రమా !
ఆగమంటే ఆగక మాటాడమంటే ఆడక
సాగిపోవుట భావ్యమా ! సంభాషణల్ కడు నేరమా !

సంధి వచనం : ఆ బాలకుల్లట్లు భాషించు చుండగా తల్లి పుత్లీ
బాయి వచ్చి :

ద్విపద :

మొన్నియా ! కుమార ! నా ముద్దుల తండ్రి
పాకి పనులవాని తాకకు మయ్యా !
తాకితే న్నిలువునా తానంబు జేసి
పట్టిన దోషమ్ము బాపుకొనవయ్య !
ననెడు తల్లిని బాలు డడిగినా డిట్లు

గాంధి : తోటి మనుజునంట దోషమా తల్లి
మజ్జనంబేలకో ! మాతరో ! తెలుపు.

ప్రశ్నించు కుమారునితో తల్లి యిట్లనియె.

పాట :

తగదురా తండ్రి ?
నిగమాగమ శాస్త్ర నియతి మీరుట మనకు ॥ త ॥
జగమున చండాల జాతివారిని తాక
మిగుల యఘమని మేటి ఋషులు తెల్పిరి కనుక ॥ త ॥
చెరగుమాసిన స్త్రీని–చెప్పరాని కులజు
ధరణి బహిష్కృత నరుని–తనరు పురుటాలను
మరియును శవమును దాన్ని కరము సోకినవాని
తరసి యంటిన పాపఫలము తానమాడిన తొలగునను
నరయ మనుస్మృతి చెప్పలేదా–సరవి మీరుట
తప్పకదా ॥ త ॥

ఆ తల్లితో బాలుడనెను తానిట్లు

ద్విపద :

యింటి ప్రాంతమ్ముల హీనుల నంట
స్నానమాడగ తల్లి సౌకర్యమౌను
బడిలోన, బాటలో–పంచము నంట
మజ్జనంబాడుట మనకెట్లు పొసగు ?

అప్పుడు పుత్తలీబాయి యిట్లు ప్రత్యుత్తరంబిచ్చె :
అంటరాని వారినంటిన పాపమ్ము
అన్యమతము వారి నంట దొలగు
పంచముల స్పృశించ బట్టిన దోషమ్ము
తురకవాని సోక తొలగునయ్యా ! .

అప్పుడు :

తల్లి చెప్పిన సమాధానమ్ము వినుచు
బాల మహాత్ముండు ఫక్కున నవ్వె
పంచముల స్పృశించ పాతకమ్మనుచు
పరికించి చూడగా భావించ నమ్మ
తురకవారిని తాక దోషమ్ము పోవు
ననెడు మాటయు కూడ హాస్యాస్పదమ్ము

ఆ పలుకులు విని పుత్తలీబాయి యిట్లనియె :

పాట :

ఇవియేమి మాటలయ్యా ! నా తండ్రీ !
భువిలో సదాచారంపుటవధిదాటుట నేర ॥ఇవి॥
అవనిలో పెద్దలు వివరించు కట్టడి
జవదాటకుండుట జనుల కర్తవ్యమ్ము ॥ఇవి॥
తరతరమ్ముల నుండి తాత దండ్రులు చెప్ప
సరవి పాటించుట సర్వుల విధి కాద ॥ఇవి॥

ద్విపద :

అనిన కుమారుండు జనని కిట్లనియె :

తాత తండ్రులత్రోవ తగుదొడ్డదమ్మ
తల్లి వైపున వారి ధార్మికపథము
పిల్లవాండ్రకుమేలు విధియించునమ్మ
సత్ప్రణామి యెనెడు శాఖ భేదమున
వర్తిల్లు మీ వారి వైష్ణవ మమ్మ !

పడవలో నెక్కించ పాదముల్ కడిగి
యాదరించినది నిషాదుండుకాడె ।
ఆర్యుల నార్యుల నంటగా లేదే
రామయ్య చూపిన రాజ మార్గమ్ము
యనుసరించిన మన రఘు రామమ్మ

అని కుమారుడు చెప్పగా నివ్వెర వోయిన తల్లి అవ్వాని కిట్లనియె :

## ద్విపద

పుత్లీబాయి: జనని చెప్పిన మాట జవదాటరాదు
పంచముల్ మన సంఘ బాహ్యులు కనుక
వారి నంటుట దొడ్డ పాతకమనుచు
బావించునది నీవు పాటించవలయు

అని శాసించు తల్లికి బాలుడిట్లనియె :

గాంధీ:_ నేను మా యన్నతో నేర్చుకొన్నట్టి

విష్ణు పూజానామ విమల శ్లోకాళి
యందు జలే విష్ణువని స్థలే విష్ణు
వని చెప్పినారమ్మ వ్యాసులవారు
జలమందు స్థలమందు గల విష్ణుమూర్తి
ఈ మాలవానిలో నిప్పుడు లేడె
విష్ణుదేవుని తాక వ్యజనమ్ముగలదె
ఒకవేళ సోకుట యెప్పుగా దేని
పంచముల స్పృశించ పాప మౌనేని
రామరక్షా మంత్రి రాజమ్ము వలన
పటుతర పాపాల ప్రక్షాళనమ్ము
గావించు కొనవచ్చు కావున తల్లి
అంటంగరాదనె ఉంత్యజు సోక
స్నాన మాడుట శుద్ధ దండుగ కాదె ।
అయినను నీ వాక్య మానతి కనుక
మజ్జనం బాడెద మాతరో నేను

అనిన కుమారుని విజ్ఞానమ్మును, వినయమ్మును పరికించి యుచ్చైతు వొందిన యా తల్లి మెచ్చి యిట్లు ఆశీర్వదించెను:

## దరువు

తల్లి ! ఎన్ని విద్యలు నేర్చినావయ్యా నా కన్నతండ్రి
ఎంత వినయము చూపినావయ్యా !

ఇన్ని యుక్తులు, ఇన్ని సూక్తులు ఇంత ఇంత భక్తులు ఎచట నేర్చితి వెవరు నేర్పిరి. ॥ ఎన్ని ॥

చిన్ననాడే యిన్ని చెప్పిన రానున్ననాడుల యేమి చెయిదువో

కన్నతల్లియె కనులుతెరచే వెన్నులను చూపించినాడవు. చెన్ను మీరగ పెరిగి యెన్నడు చెరిగి పోవని కీర్తి నొంది

ఎన్నతాని విధాల పుతమిని సన్నుతుల నీ వందుమయ్యా ॥ఎన్ని॥

ఆ తల్లి దీవనలు ఫలించబట్టే కుమారుడు మహాత్ముడైనాడు.

| బొమ్మలు తిరుగుతాయి |

కేతిగాడు, పోలిగాడు, బంగారక్క తెరమీదకు వస్తారు.

కేతిగాడు: హే మామా! హాయ్! చూశావా గాంధీగారి గొప్పదనం. చిన్నప్పుడే అర్థంలేని పట్టింపులకు ఎంత ఎదురు తిరిగారో చూశావా ?

పోలిగాడు: చూచానురా అల్లుడా చూచాను. అది సరేగాని_అంత చిన్న వయస్సులోనే ఇది వారి కెలా సాధ్యమైంది.

కేతిగాడు : గొప్పవాళ్ళకు అసాధ్యమేముంది. అదీగాక పువ్వు పుట్టగానే పరిమళించుననే సామెత నీకు తెలియదా? వాళ్ళ వాళ్ళ గుణాలు చిన్నప్పుడే బయట పడతాయి.

బంగారక్క:అవునౌను. నీ సంగతే తీసుకో. నువ్వు పుట్టగానే మంత్రసానికి కన్ను గీటావు కదరా !

కేతిగాడు : ఛ ఛ_ ఏమే అత్తా మనం చెప్పుకుంటున్నది ఎంత పరిశుభ్రమైన, పవిత్రమైన విషయం. అందులోనికి ఈ యొక్క అల్పదోషాల ప్రసక్తి తేవచ్చునటే !

బంగారు : ఆదేమిరా అల్లుడా ! కులము కన్న గుణము ప్రధాన మన్నావు కనుక_నీ గుణము చెప్పేను_తప్పేముందిరా?

పోలిగాడు: అవునౌను. వెనకటికి ఎవరో గుణము మానవే గూటాలపోలీ అంటే నా మనువైనా మానుతాను గాని నా గుణము మాననన్నదట. అలాగే గుణమెక్కడికి పోతుంది. గుణాలను బట్టి ఏర్పడ్డ కుల మెక్కడికి పోతుంది.

కేతిగాడు: ఎక్కడికేనా పోతుంది. కుల పెద్దలంతా చేరి నిర్ణయిస్తే ఎంత గొప్పవాడి కులమైనా ఇట్టే ఎగిరిపోతుంది. మాటవరసకి_అంతటి గాంధీ గారికే కులం పోయింది.

బంగారు : ఆదేమిటిరా. ఆదేమిటిరా అల్లుడా ! ఆ కథ చెప్పు. గాంధిగారిలాంటి వారు కులానికే వన్నె కదా ! ఆ కుల పోళ్లు ఎందుకు వెలివేశారు ! (సశేషం)



# భార్గవకమిటీ నివేదిక ముఖ్యాంశాలు

[గత సంచికలో అమ్మకంపన్ను, రాజ్యాంగపు 275వ సూత్రం ప్రకారం గ్రాంటులు, కేంద్ర ప్రభుత్వ ఇతర గ్రాంటులు, పెట్టుబడుల పైన వడ్డీ, కార్యాలయాలు, రాష్ట్ర కార్మికుల బీమా సంస, రోడ్డు రవాణా సంస ఇందపెన ఆదాయం, విద్యుచ్ఛక్తి సంస అంశాలను గూర్చి భార్గవ కమిటీఇచ్చిన తీర్పును ప్రచురించాము. మిగతా అంశాలపై భార్గవా కమిటీ ఇచ్చిన తీర్పును ఈ వ్యాసంలో పొందు పరుస్తున్నాము.]

## 9. రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ

ఉభయప్రాంతాలకు వేరువేరుగా ఆయవ్యయాలను గురించి లెక్కలు తయారుచేయడం జరుగలేదు; శ్రీ కుమార్ లలిత్ కేటాయించిన పద్ధతి సరియైనదికాదు అని మాకు ఫిర్యాదు చేయబడింది. అయితే రోడ్డు రవాణా సంస్థ రికార్డులను పరిశీలించగా రెండు ప్రాంతాలకు న్యాయమైన మార్గంలో ఆయవ్యయాలను నిర్ణయించడం సాధ్యమని మాకు తోచింది. మూల ధనం ఖర్చు విషయంలో, భవనాల నిర్మాణం, బండ్ల విడిభాగాల కొనుగోలుకు సంబంధించి ఏ ప్రాంతానికి ఎంత ఖర్చు పెట్టిందీ తెలుసుకోవడం సాధ్యం. ఆదాయం విషయంలో, ఏ రూటులో ఎంతవచ్చిందీ తెలుసుకొని, ఆ ఆదాయాన్ని దానికి సంబంధించిన ప్రాంతానికి కేటాయించవచ్చు. అంతర్ ప్రాంతీయ రూట్లలో, ప్రతి ప్రాంతంలో వున్న రూటు పొడవును బట్టి, ఆ దామాషాలో ఆదాయాన్ని పంచిపెట్టడం న్యాయసమ్మతమైన పద్ధతి. ఖర్చు విషయంలో, రోడ్డు రవాణా సంస్థ రాష్ట్రంలోని రోడ్డు పథకాన్ని 6 భాగాలుగా విభజించి ప్రతిభాగానికి ఖర్చులను వేరువేరుగా చూపుతూ వస్తున్నది. ప్రతి ప్రాంతంలో గల రోడ్డుమైలేజినిబట్టి, ఖర్చును ఆ నిష్పత్తిలో నిర్ణయించడం జరిగింది.

## 10. పాల పథకం

హైదరాబాదు, సికిందరాబాదు నగరాలకు సరఫరా అయ్యే పాలను ఆంధ్ర ప్రాంతంలో—ముఖ్యంగా విజయవాడలో—కొనడం జరుగుతున్నట్లు మాకు తెలిసింది. ఆంధ్ర ప్రాంతంలో కొన్నపాల ఖర్చును ఆ ప్రాంతానికి లెక్క కట్టడం జరిగింది. ఆ తరువాత అక్కడ కొన్న పాలను జంటనగరాలలోని ప్రజలకు విక్రయించడం జరుగుతున్నది. కనుక జంటనగరాలలో పాల విక్రయం ద్వారా వచ్చిన ఆదాయాన్ని, తెలంగాణాకు చెందినట్లుగా పరిగణించరాదు. అలా చేయాలంటే, పాలకొనుగోలుకు అయిన ఖర్చును ఆదాయంలో నుంచి తీసివేయవలసి వుంటుంది. పాల సరఫరాను ప్రభుత్వం వ్యాపార సరళిలో కొనసాగిస్తున్నది. ఖర్చులను తీసివేసిన తరువాత లాభనష్టాలను నిర్ణయించాలి. కనుక పాల కొనుగోలును ఆంధ్ర ప్రాంతానికి లెక్కకట్టి, పాల విక్రయ ఆదాయాన్ని తెలంగాణాకు జమకట్టడం సరియైన పద్ధతికాదు. అందుకనే, ఆంధ్రప్రాంతంలో కొన్న పాలను తెలంగాణా ప్రాంతం కొరకు చేసిన ఖర్చుగా నిర్ణయించినాము.

## 11. ఆంధ్రప్రదేశ్ పాఠ్యపుస్తకాల ముద్రణాలయం

రాష్ట్రమంతటా వ్యాపించిన విద్యా సంస్థల ఉపయోగార్థం పాఠ్యపుస్తకాలను అచ్చువేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం హైదరాబాదులో ఒక ముద్రణాలయాన్ని నడిపిస్తున్నది. విద్యార్థుల సౌకర్యార్థమై ఈ చర్య తీసుకోబడింది. రాష్ట్ర మంతటికీ ప్రయోజనకారిగా వున్నట్లు దీన్ని పరిగణించాలి. కనుక రాష్ట్ర మంతటికీ వర్తించే అభివృద్ధి ఖర్చుగా దీన్ని భావించాలి. ఈ ముద్రణాలయం లాభనష్టాలు లేని ప్రాతిపదిక మీద పాఠ్య పుస్తకాల వ్యాపారం కొనసాగిస్తూ ప్రజలకు ఉపయోగకారిగా వుంటూన్నది. కనుక దీని ఆయవ్యయాలను లోగడ పేర్కొన్న పద్ధతిలో ఉభయప్రాంతాలకు 2 : 1 నిష్పత్తిలో కేటాయించినాము.

## 12. రాష్ట్ర వాణిజ్య పథకాలు

మిగులు నిధులు లెక్కక విషయంలోను, అభివృద్ధి కొరకు ఖర్చు చేసిన మొత్తాన్ని నిర్ణయించడంలోను రసాయనిక ఎరువులు, ఆహారపదార్థాల క్రయవిక్రయాలను కొనసాగిస్తున్న రాష్ట్ర వాణిజ్య పథకాలను ఏ విధంగా పరిష్కరించాలనే ప్రశ్న ఉత్పన్నమైంది. రాష్ట్ర ప్రభుత్వం రసాయనిక ఎరువులను, ఆహారపదార్థాలను రాష్ట్రంలోకాని, ఇతర రాష్ట్రాల నుంచికాని లాభనష్టాలు లేని ప్రాతిపదికమీద ఉభయ ప్రాంతాలలోన వ్యాపారం కొనసాగిస్తున్నది. ధరలను అదుపులో పెట్టే ఉద్దేశంతో ప్రభుత్వం చర్యతీసుకొంది. భారత ప్రభుత్వం విదేశాల నుంచి దిగుమతి చేసిన రసాయనిక ఎరువులను కూడా రాష్ట్ర ప్రభుత్వ

ఉభయప్రాంతాలలోను విక్రయిస్తున్నది. ఈ లావాదేవీల వల్ల లాభంకానీ నష్టంకానీ జరగడం లేదు. ప్రభుత్వం చేసిన ఖర్చును సరుకులను విక్రయించడం ద్వారా భర్తీచేస్తున్నది కనుక మిగులు నిధులు నిర్ణయించే విషయంలో ఈ వాణిజ్యపథకాల ప్రభావం ఏ మాత్రమూ లేదు. కనుక వీటి లావాదేవీలను మేము మా లెక్కలలోకి తీసుకోవడం లేదు.

## 13 నాగార్జునసాగర్ డామ్

రాష్ట్రం చేపట్టిన భారీ అభివృద్ధి పథకాలలో నాగార్జున సాగర్ డామ్ ఒకటి. డామ్, కాలువల నిర్మాణం ఖర్చు రూ. 160 కోట్లు మించిపోతుంది. కనుక ఉభయప్రాంతాలకు అభివృద్ధి ఖర్చును కేటాయించే విషయం వివాదాస్పదం కావడం సహజమే.

డాము, వివిధ దశలలో పూర్తి అవుతుందని మాకు పంపిన నివేదికవల్ల తెలుస్తున్నది. ఇంతవరకు అయిన పనినిబట్టి, ఉభయప్రాంతాలకూ ఈ డాము వల్ల ఇప్పుడిప్పుడే కొంత మేలు చేకూరుతున్నది. నీటి పారుదల సేద్యానికి జలాలను విడుదల చేయడం జరిగింది. డాము కుడికాలవ ఆంధ్ర ప్రాంతానికి మాత్రమే ఉద్దేశించబడింది. ఎడమ కాలవవల్ల కొంత ఆంధ్ర ప్రాంతానికి కొంత తెలంగాణా ప్రాంతానికి ఉపకరిస్తుంది. మొదటి దశలో ఈ క్రింద కాలవల ద్వారా ఆంధ్ర ప్రాంతానికి 177 టి. యం. ఘ. అ. ల నీరు, తెలంగాణా ప్రాంతానికి 87 టి. యం. ఘ. అ. ల నీరు సరఫరా అవుతుంది. చీఫ్ ఇంజనీర్లు, ప్రభుత్వం మాకు అందజేసిన సమాచారాన్ని బట్టి ఈ విషయం తెలుస్తున్నది. అంతేకాకుండా కృష్ణాడెల్టాలో శాశ్వతంగా అదనంగా 30.45 టి. యం. ఘ. అ. ల నీరు నాగార్జునసాగర్ డాము నుంచి సరఫరా అవుతుందని మాకు తెలిసింది. అయితే, నాగార్జునసాగర్ డాము నిర్మాణం జరిగిఉండినా లేకపోయినా కూడా, ఇదివరకువున్న సౌకర్యాల ద్వారానే ఎలాగూ కృష్ణా డెల్టాకు 30. టి. యం. ఘ.అ. నీరు సరఫరా జరిగేది కనుక ఈడాము ఖర్చులను లెక్కకట్టేటప్పుడు ఈ విషయాన్ని లెక్కలోకి తీసుకొనరాదని ఆంధ్రప్రాంతం ప్రతినిధులు,పి. డబ్ల్యు. డి. అధికారులు, ప్రభుత్వ ఆర్థిక కార్యదర్శి మాకు నివేదించారు.

పి డబ్ల్యు డి. ప్రభుత్వ కార్యదర్శి ద్వారా సేకరించిన అదనపు సమాచారాన్ని బట్టి మాకు తెలిసిన వివరాలు ఇవి :— కృష్ణా డెల్టాకు విజయవాడ నుంచి 1953_54 నుంచి 1964_65 వరకు ఈ 12 ఏండ్ల కాలంలో సేద్యం కొరకు సగటున 53.07 టి. యం. ఘ. అ. ల నీరు విడుదల అవుతున్నది. ఇందులో నుంచి సగటున 37.41 టి.యం. ఘ. అ. నీరు నది యొక్క సహజ ప్రవాహం ద్వారా కృష్ణా డెల్టాకు జలాలు లభించేవి. తక్కువ పడిన జలాలు అంటే సగటున 16 టి యం ఘ. అ ల జలాలు తుంగభద్ర రిజర్వాయరు నుంచి విడుదల అయ్యేవి. ప్రతి సంవత్సరం జనవరి 1 నుంచి ఏప్రిల్ 30 వరకు జలాలు సరఫరా అవుతూ వుండేవి. ఆ కారణాన నదిలో నీటిమట్టం తక్కువ అయ్యేది. అయినప్పటికీ, రబీ పంటలకు జలాలు అవసరమయ్యేవి. అయితే నాగార్జునసాగర్ డాము ప్రయోజనకారి అయిన కాలం నుంచీ, విజయవాడలో నీటి విడుదల ఎక్కువ అయింది. 1966_67లో, 1967_68లో 1968_69లో క్రమంగా 63.3 టి. యం. ఘ. అ. లు 91.7 టి. యం. ఘ అ.లు; 62.5 టి. యం ఘ అ.ల నీరు అంటే సగటున 62.5 టి యం. ఘ అ. నీరు సరఫరా అయింది. తుంగభద్ర రిజర్వాయరు నుంచి నీరు విడుదల చేయనవసరం లేకుండానే ఇది సాధ్య పడింది. కుడి, ఎడమ కాలవల నుంచి, జలాలు పూర్తిగా భూములకు విడిచిపెట్టినపుడు, విజయవాడలో కృష్ణా డెల్టాకు జలాలు విడుదల చేయడానికి ఇదే ప్రమాణంలో నీరు లభించక పోవచ్చు. ఆర్థికశాఖ కార్యదర్శి చెప్పిన ఈ విషయం వాస్తవమైనదే. ఇదివరకు ఉపయోగించబడని జలాలు నదిలో ప్రవహించేవి. అవి విజయవాడ నుంచి విడుదల అయ్యేవి. అయితే ఒక విషయం మాత్రం స్పష్టంగా తెలుస్తుంది. నాగార్జునసాగర్ డాము నిర్మాణం ఫలితంగా తుంగభద్ర రిజర్వాయరు నుంచి జలాలు ఉపయోగించే అవసరంలేదు. అంతే కాకుండా ఇదివరకు తుంగభద్ర రిజర్వాయరు నుంచి వాడుకొనే జలాలు ఇప్పుడు ఇతర ప్రాంతాలకు ఉపకరిస్తాయి. ఇట్టి ప్రాంతాలన్నీ పూర్తిగా ఆంధ్ర ప్రాంతంలోనే ఉన్నాయి. కనుక నాగార్జునసాగర్ డాము నిర్మాణం ఫలితంగా ఆంధ్ర ప్రాంతానికి అదనంగా 16 టి. యం. ఘ. అ.ల జలాలు లభిస్తున్నాయి. ఇవి విజయవాడ నుంచి కృష్ణా డెల్టాలకు సరఫరా అవుతాయి. కనుక నాగార్జునసాగర్ డాం నుంచి ఆంధ్ర ప్రాంతానికి 177 టి. యం. ఘ. అ.ల జలాలకు తోడుగా మరొక 16 టి.యం. ఘ. అ.ల నీరు కూడా_అంటే మొత్తం 193 టి. యం. ఘ. అ.ల నీరు సరఫరా అవుతున్నదన్నమాట. తెలంగాణా ప్రాంతానికి 87 టి.యం. ఘ. అ.ల మేరకు మాత్రమే లాభం కలుగుతుంది. కనుక 193:87 నిష్పత్తిలో నాగార్జునసాగర్ డాము ఖర్చును ఉభయ ప్రాంతాలకు కేటాయించాలి. కుడి కాలవ నిర్మాణానికి సంబంధించినంతవరకు ఇది కేవలం ఆంధ్ర ప్రాంతానికి మాత్రమే ఉద్దేశించబడింది కనుక దీని ఖర్చుకు ఆంధ్ర ప్రాంతానికి జమ కట్టాలి. ఎడమ కాలవ ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు రెండింటికీ ఉద్దేశించబడింది కనుక జలాల వినియోగాన్ని బట్టి ఈ కాలవ నిర్మాణం ఖర్చును 45:86 నిష్పత్తిలో విభజించినాము.

## 14. రాష్ట్ర హౌసింగ్ బోర్డు

ఈ బోర్డు కార్యకలాపాలను రాష్ట్ర ప్రభుత్వ కార్యకలాపాలుగా పరిగణించాలని మేము లోగడ సూచించినాము. ఒక్క హైదరాబాదు నగరం విషయంలో మినహా, ఏ ప్రాంతంలో జరిగిన ఖర్చును ఆ ప్రాంతానికే జమకట్టాలి. హైదరాబాదు నగరంలో గృహవసతి చాల కొరతగావున్న కారణాన ఈ బోర్డు కార్యకలాపాలు ప్రధానంగా ఇక్కడే కొనసాగినాయి. రాష్ట్రానికి ఇది రాజధానిగా ఏర్పడిన కారణం వల్ల ఇక్కడ అవసరాన్నిబట్టి గృహ నిర్మాణ కార్యక్రమాలు హెచ్చుగా జరిగినాయి, వీటిని ఎవరు ఉపయోగించినా అది ప్రభుత్వ సేవకొరకు ఉద్దేశించబడింది, హైదరాబాదు నగరంలోఉండి పనిచేయవలసిన ఆంధ్ర తెలంగాణా ప్రజల కొరకు ఇవి ఉద్దేశించబడినాయి. కనుక ఈ బోర్డు కార్యకలాపాలవల్ల ఉభయ ప్రాంతాలకు సౌకర్యాలు లభిస్తున్నందువల్ల

ఈ బోర్డు హైదరాబాదులో నిర్మించిన ఇండ్ల విషయమై పెట్టిన ఖర్చును రెండు ప్రాంతాలకు 2:1 నిష్పత్తిలో విభజించాలి.

## 15. హైదరాబాదులో సమిష్టి సంస్థలు

ప్రాంతీయ సంఘం అధ్యక్షులు మాకు సమర్పించిన సప్లిమెంటరీ మెమొరాండంలో 52 సంస్థల జాబితాను అందజేశారు. ఇవి రాష్ట్రానికంతటికీ ఉపయోగకారిగా ఉంటున్నవని ఆయన మాకు చెప్పారు. వీటిపైన జరిగిన ఖర్చును 2:1 నిష్పత్తిలో కేటాయించాలని వాదించారు. హైదరాబాదులో ఉన్న అనేక సంస్థలు రాష్ట్రానికంతటికీ ఉపయోగకారిగా ఉన్నాయనే విషయం వాస్తవమైనదే. ఉదాహరణకు పరిశోధన సంస్థలను తీసుకొందాం. ఇవి హైదరాబాదులోనే నెలకొని వుండినప్పటికీ వీటివల్ల రాష్ట్రానికంతటికీ లాభం చేకూరుతున్నది. ప్రత్యేక శిక్షణా సంస్థల విషయము కూడా ఇంతే. జూలాజికల్ గార్డన్, స్టేడియం సౌకర్యాలు రాష్ట్ర ప్రజలందరికీ ఉద్దేశించబడినాయి. ఉభయ ప్రాంతాలకు చెందిన అసంఖ్యాక ప్రజలు ఇక్కడ నివసిస్తున్నారు కనుక రాజధానిలో వీటిని నెలకొల్పడం వాంఛనీయమని భావించబడింది. ఈ కోవకు చెందిన సంస్థలు మేము "సి" అనుబంధంలో పేర్కొన్నాము. అయితే ప్రాంతీయ సంఘం అధ్యక్షులు పేర్కొన్న కొన్ని సంస్థలు రాష్ట్రానికంతటికీ సంబంధించినట్లు పరిగణించడం సాధ్యం కాదు. మూగి, చెవిటి వారల పాఠశాలలు, అంధుల పాఠశాలలు ముఖ్యంగా తెలంగాణా ప్రజల సౌకర్యార్థం నెలకొల్పబడినట్టివి. ఇలాంటి సంస్థలు ఆంధ్ర ప్రాంతంలో కూడా ఉన్నాయి. ఈ జాబితాలో ప్రభుత్వ సంస్థలేకాక, ప్రభుత్వ గ్రాంటులు పొందుతున్న సంస్థలనుకూడా పేర్కొన్నాము. వీటిలో అనేక సంస్థలపై పెట్టిన ఖర్చును ఉభయప్రాంతాలకు చెందినట్లుగా పరిగణించి దానిని 2:1 నిష్పత్తిలో పంచాలని శ్రీ కుమార్ లలిత్ నిర్ణయించారు. అంకెలను మేము సవరణ చేశాము.

## 16. రాష్ట్ర రాజధాని అభివృద్ధిపైన ఖర్చు

హైదరాబాదులో 1961 వరకు ప్రభుత్వ భవనాలపైన జరిగిన ఖర్చును ఆంధ్రప్రాంతం ఖర్చుకు జమకట్టాలనీ 1961 తరువాత జరిగిన భవనాల ఖర్చును ఉభయప్రాంతాలకు 2:1 నిష్పత్తిలో విభజించాలని రాష్ట్ర ప్రభుత్వం శ్రీ కుమార్ లలిత్‌కు సలహాయిచ్చింది. అయితే 1961 వరకు జరిగిన ఖర్చునంతటినీ ఆంధ్ర ప్రాంతానికి జమచేయడం న్యాయసమ్మతం కాదని ఆ ప్రాంత ప్రతినిధులు వాదించారు. సమైక్య రాష్ట్రానికి హైదరాబాదు రాజధాని అయినప్పుడు, హైదరాబాదులో ఉన్న అనేక భవనాలు ప్రభుత్వానికి లభించాయి. ఇవి తెలంగాణా ప్రాంతానికి చెందినవి. నగరంలో ప్రభుత్వపు ఇతర కార్యాలయాలకు వసతి సౌకర్యం కల్పించినప్పుడు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలి. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల కలయికవలన కొత్తగా అనేక భవనాలు నిర్మించడం అవసరమైంది. ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో తెలంగాణా ప్రాంత భవనాలను దృష్టిలో పెట్టుకొన్నట్లయితే 1961 వరకు నిర్మించిన భవనాలు ఆంధ్ర ప్రాంతం వాటాకు చెందినట్లుగా భావించడం సహజంగా వుంది. ప్రభుత్వం తీసుకొన్న ఈ చర్య అసమంజసమైనదని చెప్పడానికి వీలులేదు. ఈ విధంగా చేయడం వల్ల ఏ ప్రాంతానికీ అన్యాయం జరిగినట్లుగా భావించరాదు. కనుక 1961 తరువాత నిర్మాణం అయిన భవనాల ఖర్చును ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు 2:1 నిష్పత్తిలో విభజించడం న్యాయసమ్మతమైనది.

## 17. రాష్ట్ర ప్రభుత్వ ఇబ్బందులను ఎదుర్కొనడానికి చేసిన అప్పులపైన వడ్డీ

లోటును భర్తీచేయడానికి రాష్ట్ర ప్రభుత్వం రిజర్వుబ్యాంకు ఆఫ్ ఇండియా, లేక కేంద్ర ప్రభుత్వం నుంచి అప్పులు తీసుకొన్నది. ఇంచుమించు అన్ని సంవత్సరాలలోను ఆంధ్ర ప్రాంతం రెవిన్యూ ఆదాయంలో లోటు వున్నది. తెలంగాణా ప్రాంతంలో మిగులు ఆదాయం వున్నది. కనుక ఈ అప్పులపైన చెల్లించవలసిన వడ్డీని ఆంధ్ర ప్రాంతానికి కేటాయించడం న్యాయసమ్మతమైనది. ఈ వడ్డీని తెలంగాణా ప్రాంతానికి కేటాయించరాదు.

## 18. విజయవాడలోని పాలపొడి ఫ్యాక్టరీ

విజయవాడలో పాలపొడి ఫ్యాక్టరీ ఒకటి నెలకొల్పబడింది. ఈ ఫ్యాక్టరీ అధిపతి కార్యాలయం హైదరాబాదులో వుంది. ఈ కారణంవల్ల, ఫ్యాక్టరీ భవనం విజయవాడలో వున్నప్పటికీ, దాని నిర్మాణానికి అయిన ఖర్చును అంతటినీ హైదరాబాదులో డెబిట్ చేయడం జరిగింది. కనుక తెలంగాణా ఖర్చు పద్దునుంచి ఫ్యాక్టరీ నిర్మాణ ఖర్చును తీసివేసి, దానిని ఆంధ్ర ప్రాంతానికి మార్చవలసిన అవసరం ఏర్పడింది.

## 19. వ్యవసాయశాఖచే యంత్రాల కొనుగోలు

నాగార్జునసాగర్ ఆనకట్ట నుంచి త్రవ్విన కొత్త కాలవల సందర్భంలో ఆయకట్టు ప్రాంతాన్ని అభివృద్ధి పరచేందుకు 1965–66, 1966–67, 1967–68 సంవత్సరాలలో వ్యవసాయ శాఖ రూ. 146.65 లక్షలు ఖర్చుచేసి యంత్ర పరికరాలను కొనింది. ఈ యంత్రపరికరాలు, కేవలం ఎడమకాలువ ప్రక్కనగల ఆయకట్టు ప్రాంతాన్ని మాత్రమే అభివృద్ధి పరచడానికి అవసరమైనాయని నాగార్జునసాగరు కాలవల చీఫ్ ఇంజనీరు, వ్యవసాయశాఖ డైరెక్టరు అందజేసిన సమాచారాన్నిబట్టి తెలుస్తున్నది. తెలంగాణా ప్రాంతంలో ఎడమ కాలవవైపు ఆయకట్టు ప్రాంతం 5.2 లక్షలు ఎకరాలు వుంటుందని, ఆంధ్ర ప్రాంతంలో 3.6 లక్షలు వుంటుందని తెలిసింది. అయితే ఎడమ కాలువ క్రింద సాగుఅయ్యే భూమిని అభివృద్ధి పరచడానికి ఈ యంత్ర పరికరాలు ఉద్దేశించబడినాయని మాకు సమాచారం తెలిసింది. ఏ ప్రాంతానికి ఎంత ఉపయోగపడిందీ విస్పష్టంగా తెలియరావటంలేదు. కనుక ఈ యంత్రాల కొనుగోలుపై జరిగిన ఖర్చును ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు 36:52 నిష్పత్తిలో విభజించడం న్యాయసమ్మతంగా వుంటుంది.

## 20. పోలీసుపైన ఖర్చు

ఈ పద్దు క్రింద అయిన ఖర్చు ఆంధ్రలోకంటె తెలంగాణాలో చాల హెచ్చుగావుందని శ్రీ కుమార్ లలిత్ సేకరించిన లెక్కల వల్ల తెలుస్తున్నది. ఈ వివరాలు సరిగా లేవని తెలంగాణా ప్రాంత ప్రతినిధులు వాదించారు. మేము ఈ అంకెలను తనిఖీ చేశాము "పోలీసుల కొరకు వస్త్రములు, పరికరాల" విషయంలో తప్ప మిగతా కేటాయింపులు సరియైన పద్ధతిలోనే జరిగాయని మేము కనుగొన్నాము. 6 బెటాలియనులతో కూడిన ప్రత్యేక సాయుధ పోలీసుదళం వుంది. వీటిలో 4 ఆంధ్రలోను మిగతా 2 తెలంగాణాలోను వున్నాయి. ఇవేకాక ప్రతి జిల్లాలో రిజర్వు ఇన్స్పెక్టర్ క్రింద రిజర్వు పోలీసు దళాలున్నాయి. ఈ పోలీసు దళాలు ఎక్కడ పనిచేస్తాయో, వాటిపైన ఖర్చును ఆ ప్రాంతంలోనికి కేటాయింపబడుతున్నవి. హైదరాబాదులో స్పెషల్ పోలీసు కమాండెంటు వున్నారు. ఈయన అధికారం తెలంగాణా జిల్లాలకు మాత్రమే పరిమితమైవుంది. ఈ ఎస్టాబ్లిష్మెంటు ఖర్చులు తెలంగాణాకు జమకట్టడం జరుగుతున్నది. హైదరాబాదు సికిందరాబాదు జంటనగరాలలో పోలీసుల అవసరం ఎక్కువ వున్న కారణాన తెలంగాణా ప్రాంతంలో పోలీసుల ఖర్చు ఎక్కువగా వున్నట్లు కనిపిస్తున్నది. అందుకనే తెలంగాణాలో పోలీసులపై జరిగిన ఖర్చు ఆంధ్రలో పోలీసుపైన జరిగిన ఖర్చులో సగానికంటే హెచ్చుగా వుంది. పోలీసులకు వస్త్రములు, ఇతర పరికరాల కొనుగోలు విషయంలో ధరలను రాజధానిలో చెల్లించడం జరిగింది కనుక, ఈ ఖర్చు అంతా తెలంగాణాకు జమచేయడం జరిగింది. ఆంధ్ర ప్రాంతాల్లోని పోలీసులకు ఇవి అవసరమైనప్పటికి కూడా ఇలా చేయడం జరిగింది. ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల్లో పోలీసు బలగం 22:19 నిష్పత్తిలో వున్నట్లు సేకరించిన సమాచారం వల్ల తెలిసింది. కనుక ఈ దామాషాలోనే పోలీసులపైన జరిగిన ఖర్చును ఉభయ ప్రాంతాలకు కేటాయించినాము.

పోలీసు దళాలను ఇతర రాష్ట్రాలకు సహాయంగా పంపడం జరుగుతున్నదనీ, అందువల్ల వచ్చిన ఆదాయాన్ని, రాజధానిలో చెల్లించిన కారణాన, తెలంగాణాకు జమకట్టడం జరుగుతున్నదని ఆంధ్ర ప్రాంతం తరపున వాదించబడింది. ఈ విషయాలన్ని పరిశీలించినాము. పోలీసు దళాలు ఇతర రాష్ట్రాలకు పంపబడినపుడు అందువల్ల వచ్చిన ఆదాయాన్ని ఏ ప్రాంతం వేటిపైన ఖర్చు పెట్టిందో, ఆ ప్రాంతానికి మాత్రమే జమకట్టడం జరుగుతున్నట్లు రసీదులను బట్టి తెలుస్తున్నది. అట్లు జరగని సందర్భాలలో ఈ సూత్రాన్ని ఆధారంగా పెట్టుకొని మేము తగినంత సవరణలు చేసినాము.

## 21. జమీందారీ రద్దుకు నష్టపరిహారం

ఆంధ్ర ప్రాంతంలో జమీందారీ రద్దు చేసిన తరువాత జమీందార్లకు చెల్లించే నష్ట పరిహారం విషయాన్ని శ్రీ కుమార్ లలిత్ పరిశీలించారు. ఆంధ్రప్రదేశ్ అవతరణకు పూర్వమే అంటే 1956 కు ముందే ఆంధ్ర ప్రాంతంలో జమీందారీ హక్కులు రద్దు చేయడం జరిగింది కనుక జమీందార్లకు చెల్లించిన నష్ట పరిహారాన్ని అభివృద్ధి ఖర్చుగా పరిగణించరాదని ఆంధ్ర ప్రాంత ప్రతినిధులు వాదించారు. జమీందారీ రద్దువల్ల వ్యవసాయం అభివృద్ధి చెందుతున్నదన్న విషయం నిజమే. ఈ కారణంవల్ల 1956 కు ముందే ఆంధ్ర ప్రాంతం వ్యవసాయకంగా అభివృద్ధి చెందినమాటకూడా వాస్తవమే. అయితే మేము పరిశీలించిన సంవత్సరాల లెక్కలలో ఈ అభివృద్ధి ఖర్చు చేరివుంది. నష్ట పరిహారంక్రింద చేసిన చెల్లింపులు ప్రత్యక్షంగా అభివృద్ధి కార్యకలాపం క్రిందికిరావు. దీన్ని ఇంకో విధంగా పరిగణించడానికి వీలు లేదు.

## 22 ఉభయ ప్రాంతాల అభివృద్ధికి ఖర్చుపెట్టిన మొత్తాల లెక్కలలో చేర్చబడవలసిన అంశాలు

లెక్కలు తేల్చడానికి శ్రీ కుమార్ లలిత్ ఉభయ ప్రాంతాలలో ప్రతి సంవత్సరం జరిగిన మూల ధనం ఖర్చు పట్టీను వేరు వేరుగా తయారు చేశారు. 1956 వ ఒప్పందానికి సంబంధించిన అంకెలు అభివృద్ధి ఖర్చుకు చెందినట్టివిగా వుండాలని మూల ధనం ఖర్చుకు చెందినట్టివిగా వుండరాదని మేము లోగడ సూచించినాము. శ్రీ కుమార్ లలిత్ ఖర్చుల పట్టికలు తయారు చేసినపుడు వాటిలో మూల ధనం ఖర్చులను పేర్కొన్నారు. అవి అభివృద్ధి ఖర్చుల క్రింద జమ కారాదు. ఆయన పేర్కొన్న అంశాలు మేము ఇక్కడ పొందుపరుస్తున్నాము.

రిటైరు అయిన ప్రభుత్వోద్యోగులకు చెల్లించే పింఛనులు ఏ ప్రాంతం అభివృద్ధికికూడా దోహదకారి కావు. పింఛనుదారులు ఏ ప్రాంతములోనైనా నివసించవచ్చు. అయితే వారికి చెల్లించే డబ్బు అభివృద్ధి ఖర్చు క్రిందికి రాదు. రాష్ట్ర వాణిజ్య పథకాల పైన జరిగిన ఖర్చును అభివృద్ధి ఖర్చులో జోడించరాదు. ఈ విషయాన్ని (12) వ అంశంలో కారణాలు చూపుతూ మేము పేర్కొన్నాము అప్పులు, అడ్వాన్సుల చెల్లింపులు ఏ మాత్రం కూడా అభివృద్ధి ఖర్చు క్రిందికి రావు. అంతేకాక కంటింజెన్సీ ఫండునుంచి తీసుకొని వాడిన డబ్బు, ఏ ప్రాంతం అభివృద్ధికికూడా సంబంధం లేదు.

శ్రీ కుమార్ లలిత్ ఈ దశలో కేవలం మూల ధనం ఖర్చులను మాత్రామే పరిశీలించారు. అయితే అభివృద్ధిపైన జరిగిన ఖర్చు ముఖ్యమని ఆయన గ్రహించలేదు. రెవిన్యూ ఖర్చులో ఏ కొంత భాగమైనా అభివృద్ధికి దోహదకారి అవుతుంది. ప్లానింగు కమిషన్ ఆమోదించిన పథకాలు అభివృద్ధికొరకు ఉద్దేశింపబడినట్టివి. ఇతర ఖర్చులను ప్లానింగు కమిషను మంజూరు చేయదు. కనుక ప్రణాళికా పథకాలపైన చేసిన ఖర్చును ఇది మూల ధనం ఖర్చు కాకపోయినప్పటికీ "అభివృద్ధిపైన చేసిన ఖర్చు"గా పరిగణించాలి. తెలంగాణా ప్రాంతం మిగులు నిధులను లెక్క కట్టేప్పుడు అందులో శ్రీ కుమార్ లలిత్ ప్రణాళికా పథకాలపైన జరిగిన ఈ రెవిన్యూ ఖర్చునుకూడా చేర్చారు. ఈ విషయంలో ఆయన తయారుచేసిన పట్టికలను కొంత సవరణ చేయవలసి వుంది. కేంద్ర

(తరువాయి 53 పుటలో)

# మహాభారతము

తెరువెగంటుల లక్ష్మీశాస్త్రి

కాలేయాదిదానవులు జగతును నశింపజేయుటకు పూనుకొనిరి. వారు రాత్రులయందు పుణ్యాశ్రమములలో నున్న మునులను చంపి తినుచువచ్చిరి. వసిష్ఠాశ్రమములో నుండిన నూటయెనుబదియెనిమిది మునులను భక్షించిరి. చ్యవనమహర్షియాశ్రమములోని నూర్గురు మునులను ఆహారముగా గొనిరి. ఈ రీతిగా రాత్రులలో మునులను చంపి తినుచు వారు పగళ్ళలో సముద్రములో దూరి దాగియుండిరి. భరద్వాజాశ్రమమునందలి యిరువదిమంది నియత బ్రహ్మచారులుగా నున్న మునులను భక్షించిరి. ఇట్లు ఆ రాక్షసులు రాత్రులందు మున్యాశ్రమములను బాధించుచుండిరి. మానవులెవరికి గూడ వారి జాడ తెలియకుండెను. తెల్లవారిలేచి చూచుసరికి ప్రజలకు మునుల శవములు కనబడుచుండెను. ఆ శవములలో మాంసముగాని, నెత్తురుగాని, యితర మగు యే పదార్థముగాని కనపడక ఎముకలు మాత్రము శంఖముల రాసులవలె కనబడుచుండెను. ఆశ్రమ ప్రదేశములలో పగిలిన కడవలు, విరిగిన హోమసాధనములు, చెదరిన అగ్నులు మాత్రమే కనబడుచుండెను. కాలేయ రాక్షసుల వలన భయము చేత ధర్మకార్యమునుగాని, వేదాధ్యయనముగాని, యజ్ఞాదులుగాని లేని ప్రపంచమంతయు నుత్సాహరహితముగా నుండెను.

"రాజా! ఈ విధముగా దినదినము తరగుచున్న జన సంఖ్యను చూచి మానవులందరు భయపడి దిక్కులబడి పారిపోవ జొచ్చిరి. కొందరు గుహలలోను, కొందరు సెలయేళ్ళలోను దాగియుండిరి. మరికొందరు ప్రాణభయముచేత గుండె పగిలి చచ్చుచు వచ్చిరి. శూరులు కొందరు ధైర్యముచేత రాక్షసులకై వెదకుచుండిరి. కాని సముద్రమధ్యములో నున్న రాక్షసులను కనుగొనలేక విసిగివేసారుచు శ్రమపడుచుండిరి. ఇట్టి ధర్మధ్వంసము వలన ప్రపంచములో యజ్ఞాది కర్మములు చేయువారు లేక దేవతలు మిక్కిలి ఆర్తిజెందిరి. దేవతలందరు కూడి యింద్రునితోపాటు ఆలోచనలు సలిపి అందరును జగత్కర్తయగు శ్రీమన్నారాయణుని వేడదలచి వైకుంఠమునకు పోయి ఆ దేవదేవునితో నిట్లనిరి:—

'దేవా! నీవే సమస్త స్థావరజంగమాత్మకమగు ప్రపంచమునకు సృష్టి స్థితిలయములు చేయువాడవు, అనేకావతారములను ధరించి దుష్టులను సంహరించి ప్రపంచమునకు శుభము గూర్చితివి. భయ భీతులమగు మాకు నీవే శరణము. కనుక మహానుభావా! లోకములను, దేవతలను, ఇంద్రుని ఈ భయము నుండి రక్షింపుము.

"ప్రభూ! జరాయుజములగు (జరాయువు అనగా గర్భకోశము—దానినుండి పుట్టిన) మానవ—పశు—మృగాదులు, అండజములగు పక్షులు—సర్పములు మొదలగు జంతువులు, స్వేదజములగు (చెమట నుండి పుట్టినవి), నల్లులు దోమలు, పేలు మొదలగు కీటజాతులు ఉద్భిజ్జములగు (భూమిని పెళ్లగించుకొని పుట్టునవి) లతావృక్షాదులు ఈ చతుర్విధ ప్రజాసంతతి, నీ యనుగ్రహము వలననే వృద్ధి జెందుచున్నవి. లోకులందరు పరస్పర సహకారముచేత పెరుగుచున్నారు. అంతయు నీ యనుగ్రహమే. 'రాత్రులయందు బ్రాహ్మణులను ఎవరు చంపుచున్నారని యెరుగజాలకున్నాము. బ్రాహ్మణులు నశించినచో భూమి నశించును. దానిచేత స్వర్గముగూడ నశించును. నీచే రక్షింపబడుచున్న లోకములపై దయయుంచి వినాశము పొందకుండ జూడుము." అను దేవతల మాటలు విని విష్ణుభగవానుడిట్లనెను: దేవతలారా! మీ భయమునకు లోక వినాశమునకు కారణమునేనెరుగుదును. వృత్రాసురుని ఆశ్రయించుకొని లోకములను పీడించుచున్న కాలేయాదిదానవులు, వృత్రుని ఇంద్రుడు సంహరించిన తోడనే భయభ్రాంతులై సముద్రములో దాగియుండి, రాత్రులయందు ఋషీశ్వరులను సంహరించుచున్నారు. సముద్రములో నున్నవారిని చంపుటకు సాధ్యము గాదు. కనుక సముద్రజలము క్షీణించునుపాయమును వెదకుడు. సముద్రమును శోషింపజేయుటకు అగస్త్యుడుచేనా యితరులెవరును సమర్థులు కారు. అది యెండిపోవనిచే, వారిని వధించుట కష్టము."

ఆ మాటలు విని దేవతలందరు అగస్త్యుని యాశ్రమమునకు పోయి యచట ననేక మునిగణముచేత ఉపాసింపబడుచున్న అగస్త్యుని, దేవతలచే నుపాసింపబడుచున్న బ్రహ్మదేవునివంటి వానిని, చూచి సమీపించి నమస్కరించి యిట్లు స్తోత్రముచేసిరి.

"మహాత్మా! పూర్వము లోకకంటకుడగు నహుషుని స్వర్గమునుండి క్రిందపడగొట్టి లోకములకు క్షేమము గూర్చితివి. (నహుషుడు నూరు అశ్వమేధయాగములు చేసి యింద్రపదవినంది గర్వియై సప్త ఋషులచేత తన పల్లకీని మోయించెను. అప్పుడు ఏడుగురు ఋషులలో నగస్త్యుడు పొట్టివాడగుటచేత అతని వైపు పల్లకీ మొగ్గి హెచ్చుతగ్గులుగా నుండుటను చూచి యింద్రుడుగానున్న నహుషుడు కోపించి అగస్త్యుని మాటిమాటికి అదలించుచు 'సర్ప—సర్ప' యనుచుండెను. అనగా, త్వరగా నడవుము—నడవుము' అని యర్థము. అదివిని అగస్త్యునకు క్రోధమువచ్చి నహుషుని 'సర్పోభవ' (సర్పముకమ్ము) అని శపించి, యితనివలన లోకము

నకు కలిగిన బాధలను తొలగించెను. ఈలాగే మహాత్మా ! పూర్వము వింధ్య పర్వతము సూర్యునిపై క్రోధముచేత పెరుగుచూ సూర్యుని మార్గమును అడగించబోవగా నీవు దానికి ఆజ్ఞయిడి పెరుగకుండజేసి లోకమునకు కల్యాణముగూర్చితివి. ఆ పర్వతమిప్పటికిని పెరుగకుండ అక్కడనే ఆగియున్నదిగదా ! లోకములు సూర్య దర్శనము లేక అంధకారములో పడిపోవుచుండగా వింధ్యగర్వ భంగముచేసి లోకములకు వెలుగునిచ్చి కాపాడిన నీవిప్పుడు గూడ లోకరక్షణము చేయవలెను. మాకు వరమిచ్చి మమ్ము కాపాడుము."

## వింధ్య గర్వభంగము

అదివిని ధర్మరాజు లోమశునితో, 'మహాత్మా ! వింధ్య పర్వతమునకు ఏల క్రోధమువచ్చి పెరుగుచుండెను ? ఆ కథను చెప్పుడు.' అనివేడుకొనెను. ఆ మాటకు లోమశుడా కథ యిట్లు చెప్పదొడగెను :—

"రాజా ! పూర్వము గిరిరాజగు మేరుపర్వతమునకు సూర్యుడు ప్రతిదినము ఉదయాస్తమానములందు ప్రదక్షిణము చేయుచుండెను. అదిచూచి వింధ్యపర్వతము సూర్యునితో 'నీవు మేరువునకు ప్రదక్షిణ చేసినట్లు ప్రతిదినము నాకుగూడ చేయుము.' అని యడిగెను. ఆ మాటకు సూర్యుడు, 'శైలరాజా ! నేను నాయిష్టము కొద్ది మేరువు ప్రదక్షిణము చేయుటలేదు. ప్రపంచ సృష్టికర్తయే నాకు ఈ విధముగా మార్గమును నిర్ణయించెను. కనుక నాకు ప్రతిదినము మేరుప్రదక్షిణముతప్పకున్నది.' అని వింధ్యతో పలికెను. ఆ మాటవిన్న వింధ్యపర్వతమునకు క్రోధమువచ్చి సూర్యచంద్రుల మార్గమును అది నిరోధించ దలచెను. అప్పుడు దేవతలందరు వింధ్యమును ఆ కార్యమునుండి నివారింపజూచిరి. కాని అది వారి మాటవినలేదు. అప్పుడు వారు అత్యద్భుత శక్తి సంపన్నుడగు అగస్త్యమహామునిని దర్శించి యా సంగతి నివేదించి, మహాత్మా! వింధ్యమును అరికట్టి సూర్యచంద్ర నక్షత్రాదులగతిని సక్రమముగా జరిపించుటకు నీవుదప్ప త్రిలోకములలో మరియెవ్వరును లేరు. కనుక వింధ్యమును నివారించి లోకరక్షణము చేయుము.' అని వేడుకొన్నిరి. ఆ మాటవిని అగస్త్యుడు వింధ్యముకడకు పోయి, 'పర్వత రాజా ! నాకొకపనియుండి యిప్పుడు దక్షిణ దిక్కునకు పోవుచున్నాను. కనుక నాకు మార్గమిమ్ము. నేను తిరిగివచ్చు వరకు నీవట్లే పెరుగకయుండి నేను ఉత్తరదిక్కునకు పోయిన తరువాత నీ యిష్టమువచ్చినట్లు పెరుగుము. అని అగస్త్యుడు వింధ్యగిరికి కట్టడచేసి దక్షిణ దిక్కునకు పోయి నేటిదాక తిరిగిరాలేదు."

"ధర్మరాజా ! ఈ కథ యంతయునీకు తెలిపితిని. కాలేయ రాక్షసులుగూడ అగస్త్యునిచేత ఎట్లునాశనము నందిరో అదిగూడ చెప్పెదను వినుము." అని లోమశుడు ఇట్లు తరువాతి వృత్తాంతమును చెప్పదొడగెను :—

"దేవతలు అగస్త్యుని ఆ విధముగా వేడుకొనగానే ఆతడు వారు వచ్చిన కారణమును తెలిసికొని వారి కోరికపై సముద్ర స్నానము చేయుటకు సముద్రమునకు పోయెను. ఆయన వెనువెంటనే ఋషులు, దేవతలు, మానవులు పోయిరి. అప్పుడు అలలతో నృత్యముచేయుచున్నట్లును, వాయువుచేత ఎగిరి దుముకు చున్నట్లు నురుగులచేత నవ్వుచున్నట్లును, గిరి కందరములను ఢీకొను చున్నట్లును ఉండి అనేక జలజంతువులచేత నిండియున్న సముద్రమును వారందరు చేరిరి.

అప్పుడు అగస్త్యుడు దేవతలతో "నేను సముద్రము నంతయు పానముచేసెదను. వెంటనే మీరు చేయవలసిన పనిని చేయుడు" అనిచెప్పి మహా క్రోధావిష్టుడై ఆ ముని సముద్రమును నిశ్శేషముగా పానముచేయజొచ్చెను. అప్పుడు దేవతలు, ఋషులు మహామునిని విశేషముగా స్తుతించిరి. సముద్రము వట్టిపోయిన తరువాత దివ్యాయుధములను తీసికొని, విస్మయులైన కాలేయ దానవులను చంపుటకువచ్చిరి. ఆ రాక్షసులు గూడ గొప్పగా సింహనాదముచేసి దేవతలతో యుద్ధముచేసిరి. కాని, వారు దేవతల వాడికి తట్టుకొనలేక నిహతులైరి. వివిధాభరణములతో నేలకూలుచున్న రాక్షసులు పూచిన మోదుగులవలె భూమికి అలంకారమై యుండిరి. హతశేషులు భూమిని చీల్చుకొని పాతాళములోకి దూరిపోయిరి. దానవులందరు చచ్చిన పిదప దేవతలు, మునులు అగస్త్యుని ఇట్లుస్తుతించిరి.

మహాత్మా ! క్రూరపరాక్రమముగల కాలేయాదులు నీచే నిహతులైరి. నీ యనుగ్రహముచేత త్రైలోక్యమునకు సుఖము చేకూరెను. ఇప్పుడు తిరిగి యీ సముద్రమును నీటితో నింపుము" ఆమాట విని భగవంతుడైన అగస్త్యుడు వారితో, 'నేను సముద్రమును ఇంకించితిని. ఇప్పుడు మీరు దీనిని నింపుటకు అందరును యోచించి ప్రయత్నింపుడు.' అని యనెను. ఆ మాట విని వారు ఆశ్చర్యమును, దుఃఖమును పొందిరి. ప్రజలు ఒండొరులు కూడ బలుకుకొని ఆ మునికి నమస్కరించి తమతమ యిండ్లకు పోయిరి. దేవతలు విష్ణువుతోబాటు బ్రహ్మదేవుని వద్దకుపోయి ఆయనతో సముద్రపూరణారము ఆలోచనలు సలిపిరి. అప్పుడు బ్రహ్మదేవుడు దేవతలతో, 'మీరుఇప్పుడు స్వేచ్ఛగా వెడలిపొండు. చాలా కాలము తరువాత తిరిగి సముద్రము జలపూర్ణమగును. భగీరథ మహారాజు తన వంశీయుల పుణ్యలోక ప్రాప్తికై సముద్రమును నీటితో నింపగలడు.' అనిచెప్పెను. బ్రహ్మదేవుని మాటలు విని దేవతలు అట్టి యవసరమునకై ప్రతీక్షించుచుండిరి" అను లోమశుని మాటలు విని యుధిష్ఠిరుడు మహాత్మా ! భగీరథుని వంశీయులు సముద్రపూరణమునకు ఎట్లుకారణమైరి? సముద్రమును భగీరథుడు ఎట్లు నింపెను ? ఆ కథను సవిస్తరముగా వినగోరెదను. దయయుంచి చెప్పుడు.' అని లోమశుని అడిగెను. అప్పుడాముని సగర చక్రవర్తి కథ యిట్లు చెప్పదొడగెను :—

## సగర చక్రవర్తి కథ

"ఇక్ష్వాకు వంశములో 'సగరుడు' అను చక్రవర్తి యుదయించెను. అతనికి పుత్రులు లేకుండిరి. రూప-సౌందర్య-పరాక్రమ శోభితుడగు సగరుడు హైహయులను 'తాలజంఘ' నామకులను వధించి రాజులందరిని తన వశవర్తులను జేసికొని స్వరాజ్యమును ఏలెను. అతనికి రూపయౌవనసంపన్నలగు 'వైదర్భి' 'శైబ్య

అను ఇరువురు భార్యలుండిరి. అతను పుత్రులనుకోరి గొప్ప తపస్సుచేయుటకు భార్యలతో కైలాస పర్వతమునకు పోయెను. తపస్సుచేయుచు యోగమహిమచేత త్రిపుర సంహారుడైన త్రిలోచనుని కడకుపోయెను. శంకరుని దర్శించి సపత్నీకుడై నమస్కరించి పుత్రులను యాచించెను. దానికి ఆ దేవుడు, 'రాజా! నీవు ఏ ముహూర్తములో ఇక్కడ వరమును వేడితివో దాని పరిణామముగా, నీకు శూరులు, పరాక్రమ దర్పితులునగు అరువదివేల పుత్రులు ఒక భార్యయందు జనించెదరు. వారందరు గూడ ఒక్కసారిగా నశించెదరు. మరియొక భార్యయందు వంశోద్ధారకుడగు ఒక కొడుకు పుట్టును.' అని చెప్పి మహాదేవుడు అక్కడనే అంతర్ధానము చెందెను.

"ఆ తరువాత సగర చక్రవర్తి సంతసించి భార్యలతో స్వనగరమునకు పోయెను. అతని భార్యలగు 'వైదర్భి-శైబ్య' అనువారు గర్భమును ధరించిరి. కొన్నాళ్ళకు వైదర్భి ఒక సొరకాయను గనెను. శైబ్య దేవస్వరూపుడగు నొక కొడుకుని గనెను. సగరుడు ఆ సొరకాయను పారవేయదలచెను. అప్పుడు అంతరిక్షవాణి, 'రాజా! సాహసము చేయకుము. పుత్రులను విసర్జించకుము. ఈ సొరకాయనుండి ఒక్కొక్క విత్తనమును జాగ్రతగా తీసి ఒక్కొక్క వేడి నేతి కడువలో ఉంచి కాపాడుము. ఆ కడవలనుండి అరువదివేల పుత్రులను బడసెదవు. మహాదేవుడు నీకు ఈ విధముగానే పుత్రజన్మను నిర్దేశించెను. కనుక నీవు అన్యథా విచారించగూడదు'. అని పలికెను.

అంతరిక్షవాణి పలికిన మాటలను విని ఆ రాజు ఆ విధముగానే ఆ బీజములను ఉష్ణఘృత ఘటములలో కాపాడుచుండెను. ఆ కడవలను రక్షించుటకు అంతమంది దాదులను వేర్వేరుగా నియమించెను. కొంతకాలమునకు ఆ బీజములన్నిటినుండి ఒక్కసారిగా మహాదేవుడు చెప్పినట్లు అరువదివేల పుత్రులు కలిగిరి. వారందరున్ను అతిఘోర స్వరూపులై క్రూరకర్మములాచరించుచు ఆకాశమునకుగూడ ఎగురగలుగుచుండిరి. వారు బహుసంఖ్యాకులై యుండుటచేత సంఘబలము గలవారై సర్వలోకములను దర్పముచేత పరిహసించుచుండిరి. యుద్ధ విశారదులగు సాగరులు దేవ-దానవ-యక్ష-గంధర్వాదులగు సమస్త భూతములను పీడించుచుండిరి.

"ఈ విధముగా సగరపుత్రులచేత పీడింపబడుచున్న లోకులందరు దేవతలతోగూడ బ్రహ్మదేవుని శరణు జొచ్చిరి. వారిని చూచి బ్రహ్మ, 'దేవతలారా! మీరందరు తిరిగిపొండు, త్వరలోనే సగరపుత్రులు తమ దుష్కర్మల పరిపాకముచేత వినాశమును పొందెదరు' అని చెప్పెను. ఆ మాట విని వారందరు తమతమ స్థానములకు పోయిరి.

"ఆ తరువాత చాల కాలమునకు సగర చక్రవర్తి అశ్వమేధ యాగము చేయబూని దీక్ష వహించి యుండెను. అతడు విడిచిన యజ్ఞాశ్వము సగర పుత్రులచే రక్షింపబడుచు దేశమంతట తిరుగజొచ్చెను. అది స్వేచ్ఛగా పోవుచు అప్పుడు నీరులేని సముద్రములోకి పోయి, వారు ఎంతగా దానిని రక్షింప జూచినను సాధ్యపడక, అది సముద్ర మధ్యములో నంతర్ధానము చెందెను. అప్పుడు వారు, ఆ యశ్వము అపహరింపబడెనని తలచి తిరిగి తండ్రివద్దకు పోయి నివేదించిరి. అదివిని సగరుడు 'సమస్త దిక్కులందున్ను హయమును వెదకుడని వారికి ఆజ్ఞాపించెను.

"సగర పుత్రులు తండ్రి యాజ్ఞపై సమస్త దిక్కులను గాలించి హయము కొరకు భూమండలమంతయు వెదకిరి. కాని అదికాని, దానిని అపహరించినవారుకాని దొరకలేదు. తిరిగి తండ్రి కడకు పోయి వారు ఆ సంగతి తెలిపిరి. అదివిని సగర చక్రవర్తి వారితో, 'మీరు అశ్వమును సంప్రాప్తించుకొనక తిరిగి నావద్దకు రాకుడు. పొండు గుఱ్ఱమును వెదకుడు' అని చెప్పెను. ఆ మాట విని సగరపుత్రులు తిరిగి సమస్త భూమండలములలో అశ్వమును వెదకుచుండగా వారికి ఒకచోట భూమి చీలినట్లుగా కనపడెను. ఆ సముద్ర బిలమువద్దకు పోయి వారు దానిని ఇంకను లోతుగా త్రవ్విరి. అట్లు త్రవ్వబడుచున్న శుష్క సముద్రములోని వివిధ జంతువులు వారి గడ్డపారల తాకిడికి బాధపడుచు నశించుచు ఆర్తనాదము చేయుచుండెను. ఇట్లు నూర్లు, వేలు జంతువుల అవయవములు భిన్నములై పడిపోయెను. ఈ విధముగా వారు చాల కాలము సముద్రమును త్రవ్వినప్పటికిని అశ్వముమాత్రము కనపడలేదు.

"అప్పుడు వారు అతి క్రోధముతో సముద్రమునందు ఈశాన్య దిక్కును ఛేదించి పాతాళములోకి దూరి అచట సంచరించుచున్న గుఱ్ఱమును, దాని సమీపముననే యున్న కపిల మహామునిని చూచిరి. ఆ ముని మహాతేజస్సుగలవాడై జ్వాలలతో మండుచున్న అగ్నివలె నుండెను. సగర పుత్రులు ఆ యశ్వమును చూచి మిక్కిలి సంతసించి, కపిల మహామునిని నిర్లక్ష్యముచేసి దర్పముతో ఆ యశ్వమును పట్టుకొనుటకు పరుగెత్తిరి. అప్పుడు సాక్షాత్తు భగవదవతారుడైన కపిల మహాముని క్రోధ రితుడై భయంకరమైన అతని నేత్రమునుండి ఘోరమగు తేజస్సును వారిపై విడిచెను. ఆ తేజస్సు ఆ మూర్ఖులను దహించివేసెను.

"అట్లు దహింపబడి భస్మమై పడియున్నవారిని నారదుడు చూచి సగర చక్రవర్తి వద్దకుపోయి అతనికి ఆ ఘోర వృత్తాంతమును తెలిపెను. ఆ మాటవిని సగరుడు ఒక్క క్షణకాలము పుత్రశోకముచేత నిర్విణ్ణుడై తిరిగి పరమేశ్వరుడు చెప్పినమాటను జ్ఞప్తికి తెచ్చుకొనెను. పిదప సగరుడు తన పుత్రుడగు అసమంజసుని కొడుకగు అంశుమంతుడు అనుపేరుగల తన మనుమని పిలిచి, 'నాయనా! నా అరువదివేల పుత్రులు కపిలముని క్రోధాగ్నికి ఆహుతియై మరణించిరి. నీ తండ్రియగు అసమంజసుని గూడ, పౌరుల హితమునుగోరి, ధర్మసంరక్షణార్థమై విడిచితిని. దాని చేతను, ఇతర పుత్రుల మరణముచేతను, అశ్వమేధాశ్వము దొరకకపోవుట చేతను చాల పరితాపము పొందియున్నాను. ఇట్లు పుత్రశోకము చేతను, యజ్ఞ విఘ్నము చేతను మోహితుడనై యున్న నన్ను పౌత్రా! ఉద్ధరించుటకుగాను అశ్వమును సంపాదించుకొని వచ్చి నేను నరకకూపములో పడకుండ జూడుము" అని ఆదేశించెను.

అంశుమంతుడు తాతగారి యాజ్ఞపై అశ్వమును వెదకుటకు, తన తండ్రులు త్రవ్విన బిలముద్వారా సముద్రములోనికి దూరెను. అచట మహాత్ముఁడగు కపిలుని చూచెను. ఆ ముని సన్నిధిచేరి అంశుమంతుడు అతనికి ప్రణామముచేసి తాను వచ్చిన కార్యమును నివేదించెను. అతని వినయవిధేయతలకు, భక్తికి సంతుష్టుడై కపిలుడు 'నీకు వరమిచ్చెదను. కోరుము' అని అంశుమంతునితో ననెను. మొదటివరము అశ్వమును, రెండవ వరము తన తండ్రులను పావనులను చేయుట ఈ రెండు వరములను కోరెను.

"అదివిని కపిలుడు, 'అనఘా! నీయందు క్షమ, ధర్మము, సత్యము ప్రతిష్ఠితములై యున్నవి. కనుక నీవు కోరిన వరములను ఇచ్చితిని. నీచేత సగరుడు కృతార్థుడై పుత్రవంతుడయ్యెను. నీ మహిమచేతనే సగర పుత్రులు స్వర్గమునకు పోయెదరు. నీ మనుమడు తపస్సుచేసి పరమేశ్వరానుగ్రహముచేత స్వర్గము నుండి గంగానదిని భూమికి తెచ్చి సగరపుత్రులకు సద్గతిని కల్పించగలడు. గుఱ్ఱమును తీసికొనిపొమ్ము. దీనిచేత సగరుని యజ్ఞము నిర్విఘ్నముగా సమాప్తి జెందునుగాక" అని చెప్పెను.

"అంశుమంతుడు తరువాత కపిలుని యాజ్ఞగొని అశ్వమును వెంటబెట్టుకొని తిరిగి తన నగరమునకు వచ్చి తాతగారికి యజ్ఞాశ్వమును సమర్పించి నమస్కరించి జరిగిన సంగతి యంతయు నివేదించెను. తాను చూచిన సగర పుత్రుల వినాశమును వినిన వారి దుష్కృత్యమును అంతయు సగరునకు తెలిపెను. సగరుడు ఆ యశ్వమును చూచినతోడనే పుత్రశోకమునువీడి సంతసించెను. అంశుమంతుని వాత్సల్యముతో ఆదరించి యజ్ఞ సమాప్తి చేసెను. దేవతలందరు అతనిని గౌరవించిరి. అతడు సముద్రమునే తన పుత్రునిగా చేసికొనెను. చాల కాలము రాజ్యమును పాలించి, చివరకు రాజ్యభారమును పౌత్రుడగు అంశుమంతునిపై మోపి సగరుడు స్వర్గమునకు పోయెను."

సగర చక్రవర్తి కథను విని యుధిష్ఠిరుడు లోమశునితో, 'మహాత్మా! సగరచక్రవర్తి తన పుత్రుడగు అంశుమంతుని ఏల విడిచెను? చెప్పుము' అని యడుగగా లోమశుడిట్లు చెప్ప దొడగెను :—

"రాజా! సగరచక్రవర్తి రెండవభార్యయగు శైబ్యకు పరమేశ్వరుడు చెప్పిన ప్రకారము 'అసమంజసుడు' అను నొక కొడుకు మాత్రమే కలిగెను. అతడు బాల్యములో ఆడుకొనుచు దుర్బలులను చూడగనే వారినిలాగి మెడపట్టుకొని బలాత్కారముగా నదిలో త్రోయుచుండెను. ఆ విషయమును పౌరులు వచ్చి సగరునకు తెలిపి, 'రాజా! అసమంజసుని వలన భయపడిన మమ్ము కాపాడుము' అని చెప్పిరి. ఆ మాట విని సగరుడు క్షణకాలము మనస్సు నొచ్చుకొని మంత్రులను పిలిచి వారితో, 'అసమంజసుని మీరు పట్టణము నుండి వెడలగొట్టుడు. మీరు నా హితమును కోరువారైనచో ఈ కార్యమును శీఘ్రముగా చేయుడు.' అని యనెను. మంత్రులు రాజాజ్ఞను నెరవేర్చిరి. అప్పటి నుండి అసమంజసుడు బహిష్కృతుడై పోయెను. తిరిగి రాలేదు. అతని కొడుకే అంశుమంతుడు." అని చెప్పి లోమశుడు తరువాతి కథను ఇట్లు చెప్పదొడగెను :—

"సగర చక్రవర్తి స్వర్గమునకు పోయిన తరువాత అంశుమంతుడు రాజ్యమును తన తాతవలెనే ధర్మముతో పరిపాలించెను. అతని పుత్రుడు దిలీపుడు. అతడు తన తాతగారికి కలిగిన దుర్మరణమును విని మిక్కిలి దుఃఖించి వాడై వారిసద్గతికి ఉపాయములను యోచించుచుండెను. గంగను భూలోకమునకు తెచ్చుటకు గూడ మిక్కిలి ప్రయత్నించెను. తన శక్తి కొలది ప్రయత్నించి కృషి చేసినను దిలీపుడు గంగావతరణమును చేయ జాలకపోయెను. అతనికి శ్రీమంతుడు, ధర్మవంతుడునగు 'భగీరథుడు' పుత్రుడుగా జన్మించెను. అతడు 'సత్యసంధుడు, అసూయలేనివాడు' అని ప్రఖ్యాతిగడించెను. అట్టి పుత్రునకు రాజ్య పట్టాభిషేకము చేసి దిలీపుడు వాన ప్రస్థాశ్రమమును స్వీకరించి అడవికి పోయెను. అతడు అరణ్యములలో మహా తపస్సుచేసి కొంతకాలమునకు స్వర్గమునకు పోయెను" అని చెప్పి లోమశుడు భగీరథుని వృత్తాంతమును ధర్మజునకు ఇట్లు చెప్ప దొడగెను :—

"రాజా! భగీరథ మహారాజు గొప్పశూరుడై జనరంజకముగా రాజ్యపాలనము చేయుచు ప్రజల మనస్సునకు, నేత్రములకు ఆహ్లాదకరుడుగా నుండెను. అతడు, తన పితరులు కపిలకోపాగ్నిచే దుర్మరణముపాలై స్వర్గమునకు దూరులైరనివిని వారిని ఉద్ధరించ దలచి రాజ్యభారమును మంత్రులపైన ఉంచి, మనస్సులో బాధపడుచు, తపస్సు చేయుటకు హిమాలయమునకు పోయెను. హిమాలయము అనేక గైరికాది ధాతువులచే అలంకృతములైన శిఖరములతో విరాజిల్లుచుండెను. నలువైపుల మేఘములు ఆ పర్వతమును అభిషేకించుచుండెను. నదులచేతను, పొదల చేతను, లతా మందిరములచేతను శోభిల్లుచుండెను. దాని గుహలలో సింహవ్యాఘ్రాదులు వసించుచుండెను. అనేక పక్షిగణము కలకలారావములు చేయుచుండెను. దేవతలు, కిన్నరులు సేవించుచుండిరి. విషములు గ్రక్కుచు సర్పములు పాకాడుచుండెను. ఆ పర్వతము ఒకచోట బంగారురంగు, మరియొక చోట రజతవర్ణము, వేరొకచోట కాటుక వన్నెయు గలిగి ప్రకాశించుచుండెను.

"భగీరథుకా హిమాలయమునందు కందమూల ఫలములను దినుచు వేయియేండ్లు తపస్సు చేసెను. తరువాత, అతని ఘోర తపస్సునకు మెచ్చి గంగ మానవ శరీరమును ధరించి భగీరథునకు దర్శనమిచ్చెను. ఆ దేవి, 'మహారాజా! నీ వేమి కోరి తపస్సు చేయుచున్నావు? నీకేమియిత్తును? నీవు కోరిన వరమిచ్చెదను. అడుగుము.' అని యనెను. అదివిని భగీరథుడు, 'దేవీ! నా పితామహులు కపిల కోపాగ్నిచేత దగ్ధులై దుర్మరణముపాలైరి. అందుచేత వారు స్వర్గమునకు పోవజాలక పోయిరి. అట్టివారి శరీరములను నీ పవిత్రజలముచేత పాప దూరములను చేసి వారికి స్వర్గ ప్రాప్తికలిగించుము. మహానదీ! వారి సద్గతి కొరకై నిన్ను యాచించుచున్నాను.' అని వేడుకొనెను.

(సశేషము)

## అనంతపురం జిల్లాలో

# అడవుల పెంపకం

—జి. రామకృష్ణ

అనంతపురం జిల్లా, దక్కను పీఠభూమి మధ్యన వున్నది. తూర్పు ఋతు పవనాలు గాని పశ్చిమ ఋతు పవనాలుగాని తగులవు. అందువల్ల వర్షపాతం తక్కువ. వర్షాన్ని ఆకర్షించే అడవులు కూడా నశించి పోతున్నందువల్ల రానురాను వర్షపాతం తగ్గుముఖం చూపుతున్నది. ఇప్పుడు వర్షపాతం 18 అంగుళాల నుంచి 22 అంగుళాల మేరకు పడుతున్నది. ఇంత తక్కువ వర్షపాతం గల జిల్లా మొత్తం భారత దేశంలోనే లేదు (ఒక్క రాజస్థాన్ ఎడారి తప్ప).

ఏ ప్రదేశంలోనైనా అడవి మూడవ వంతు ఆక్రమించి వుంటే ఆ ప్రదేశం సుభిక్షంగా వుంటుందని పెద్దలు చెప్తారు. మూడోవంతు అడవివుండాలని శాస్త్రవేత్తల సమ్మతం. కాని అనంతపురం జిల్లాలో అడవి ప్రస్తుతం పదిశాతం మాత్రమేవుంది. ఆంధ్రప్రదేశ్‌లో ఇంత తక్కువ అడవి ప్రదేశం గల జిల్లా మరొకటి లేనేలేదు.

జిల్లాలో అడవి క్షీణించేకొద్దీ వర్షపాతం కూడా తగ్గుముఖం పడుతున్నది. పూర్వానికి, ఇప్పటికి చాలా అంగుళాలు తగ్గిపోయింది. ఈ తగ్గడానికి ప్రధానకారణం అడవులు నాశనం కావడమే! ఈ జిల్లాలోనే కాదు—రాష్ట్రంలో—దేశంలో పట్టణాలు అభివృద్ధి అగుతున్నందు వల్ల వంట చెరకు సమస్య ప్రబలమగుతున్నది. అందు వల్ల వంట చెరకు ఎగుమతికి అడవులను నాశనం చేయడం జరుగుతున్నది. బొగ్గుల ఎగుమతికి అడవులను నాశనంచేయడం జరుగుతున్నది. వంటచెరకునకు గాను చింత, తుమ్మతోపులు కూడ నాశనం చేయబడినాయి. కట్టెసామానుల కోసరం మామిడితోపులు నాశనం చేయబడినాయి. వాటిస్థానములో మరల అడివిని పెంచడం, తోపులను పెంచడం జరగడం లేదు. చెదురు మదురుగా నారింజ తోటలు పెంచ బడినా నష్టాన్ని భరించ గలిగినంత వ్యాపకం కాలేదు.

స్వభావసిద్ధంగా అడవులు పెరగడానికి వర్షపాతం తగినంత లేదు. వర్షం ఆకర్షించడానికి తగినంతగా అడవులు పెరగడం లేదు. అడవులు పెరిగితే గాని వర్షం పడదు. వర్షం పడితేగాని అడవులు పెరగవు. పెండ్లి చేస్తేగాని పిచ్చికుదురదు. పిచ్చికుదిరితేనేగాని పెండ్లి కాదు. పరస్పర విరుద్ధ శక్తులతో ఈ నాడు అనంతపురం జిల్లా సతమతమవుతున్నది.

## కొత్తరకం తుమ్మ చెట్లు

ఈ పరిస్థితిలో ఒక వర ప్రసాదంగా, ఎక్కడినుంచి వచ్చిందో యేమో! ఎవరు తెచ్చారో యేమో—కొత్తరకం తుమ్మ చెట్లు ఎక్కడ పడితే అక్కడ పెరుగుతున్నాయి. దీనినే ఇంగ్లీషులో ప్రెసొపాలిస్ అంటారు. మొదట ఈ సీమ తుమ్మను, కంచెగా ఉపయోగించడానికి ప్రయోగించారు. ఇప్పుడు అడవులుగా పెరిగి పోతున్నాయి. కట్టెల కరువును ఈ తుమ్మ చెట్లు నివారించగలుగుతున్నవి. ముఖ్యంగా బీద బిక్కి ఈ తుమ్మ కంపలతోనే జీవనం చేసుకుంటున్నారు.

ఈ తుమ్మ చెట్లు పెరగడం—మనిషి తల పోతగా పెరగడం లేదు. గొర్రెలు, మేకలు వీటి కాయలు తిని, పెంటికలు వేయడం వల్ల, విత్తనాలు పడి, మొలచి, అడవులుగా, మనిషి ప్రయత్నం లేకనే పెరుగుతున్నవి. ఈ తుమ్మ చెట్లు పెరగడానికి నేలదుక్కిని కోరడంలేదు. సుక్షేత్ర మాసించడం లేదు. నీటి సమృద్ధిని కోరడంలేదు. ఎప్పుడో ఒకసారి విత్తనం మొలవడానికి వర్షం పడితే చాలు. ఏరుదిగబడి పోతుంది, లోతుగా పోతుంది. ఎవరి ప్రయత్నం లేకనే పెరిగి పోతుంది. అయాచితంగా సంభవించిన ఈ సీమ తుమ్మ అడవులను మానవ ప్రయత్నంతో పెంచ గలిగితే దేశం సుభిక్షంగా తయారగుటకు వీలున్నది.

అనంతపురం జిల్లా అంతా కలసి 47.28 లక్షల ఎకరాల విస్తీర్ణమున్నది. అందులో అడవి ప్రాంతం 4.76 లక్షల ఎకరాలు మాత్రమే వున్నది. సాగులేని భూమి 4.13 లక్షల ఎకరాలున్నది. వ్యవసాయేతరముగా వుపయోగించబడుతున్న భూమి 3.11 లక్షల ఎకరాలున్నది. వ్యవసాయానికి యోగ్యత గలిగి బంజరుగా 3.75 లక్షల ఎకరాలున్నది. వ్యవసాయ అనుకూలమైన భూమిని విడిచి తక్కువ భూమిపై ఈ ప్రెసొపాలిస్ సీమ తుమ్మ అడవులను పెంచవచ్చును. అన్ని రకాలైన నేలలలోను ఈ తుమ్మచెట్లు పెరుగుతున్నవి. అనంతపురం జిల్లాలో బోడి కొండలు మెండుగా వున్నాయి. ఇదివరకు ఈ కొండలు దట్టమైన అడవులచే నిండివుండేటివి ఇప్పుడు నాశనమైనాయి. వాటి స్థానములో ఈ తుమ్మచెట్లను మానవ ప్రయత్నంతో పెంచ వచ్చును.

కేంద్రంలో శ్రీ కె.యం. మున్షీ మంత్రిగా వున్నప్పటినుంచీ, సప్త సంతానాలలో వృక్షములను పెంచడం కూడా ఒకటి అని ప్రబోధించి చెట్లు నాటుటకు లక్షలకు, కోట్లకు ఖర్చు పెట్టి నది ప్రభుత్వం. కాని ఫలితం శూన్యం. నాటిన చెట్లకు నీరు పోయరు. పెరిగిన చెట్లకు రక్షణలేక మేకలు, గొర్రెలు పశువుల మేతకు ఉపయోగపడి నాశనమైనాయి. వృక్ష సంతానాభివృద్ధి కాలేదు.

ఇప్పుడు ఈ సీమతుమ్మకు పశువుల భయంలేదు. మేకలు

గొర్రెలు ఈ తుమ్మ ఆకులను తాకనైనా తాకవు. పెరిగిన తర్వాత వీటి కాయలను మేకలు గొర్రెలు ఆప్యాయంగా తింటున్నాయి. ఆహారంగా ఉపయోగ పడుతున్నాయి. కాబట్టి ఇన్ని సదుపాయాలున్న ఈ తుమ్మ చెట్లను సులభతరంగానే, పనికి రాని భూములలోను బోడికొండ గుట్టలనిండాను నింపవచ్చును.

## పాఠశాలలలో

జూన్, జూలై, ఆగస్టు నెలలో ఎప్పుడో ఒకప్పుడు విత్తనం వేయవలసి వుంటుంది. అనంతపురం జిల్లాలో అనేక ప్రాథమిక పాఠశాలలు. మాధ్యమిక. ఉన్నత పాఠశాలలు ఉన్నాయి. పాఠశాలలలో వేలమంది విద్యార్థులు చదువుతున్నారు. ఉపాధ్యాయులందరు విద్యార్థులను వెంటబెట్టుకొని, విత్తనాలను తీసుకొని తమ చుట్టువున్న పనికిరాని నేలలపైన, కొండగుట్టలపైన దాడి చేయవలసి వుంటుంది. మొదటి దుక్కి వర్షం పడిన వెంటనే ప్రతి విద్యార్థి, ఉపాధ్యాయుడు చేతిలో ఒక కట్టెను తీసుకొని, వరుస క్రమంలో నిలబడి నేలను కట్టెతో పొడిచి తీసి అందులో ఒక్కొక్క విత్తనము విడిచి పూడ్చుకుంటూ ముందుకు పోవలసి వుంటుంది. విద్యార్థులకు, స్కూళ్ళకు తగిన విత్తనాలను వ్యవసాయ శాఖవారు సప్లై చేయాలి. జిల్లా కలెక్టరు, జిల్లాపరిషత్ చైర్మెన్ ఈ ఉద్యమానికి దీక్షతో నాయకత్వం వహించి తాకీదులు పంపి, జిల్లాలోని అందరి విద్యార్థులను దీక్షతో కదలించి, విత్తనాలను నాటుటకు ప్రోత్సహించాలి. వారినందరిని ఈ ఎక్స్‌కరవ్ పోవునట్లు ప్రోత్సహించాలి. వారికి తగిన ఏర్పాటులు తిండిపెట్టాలి. వ్యవసాయశాఖ, అటవీశాఖ ఇతర శాఖలతోడ్పాటుతో ఈ బోడి కొండలను, గుట్టలను, పనికిమాలిన నేలలను ఈ తుమ్మ చెట్లతో నింపివేయాలి. వర్షాకాలంలో ఒక్కసారి విత్తనం వడిన తర్వాత మరి యేవిధ తోడ్పాటు లేకుండానే ఈ తుమ్మ చెట్లు అడవులుగా పెరిగిపోగలవు. వ్యవసాయ శాఖవారు, అటవీ శాఖవారు ఎంతెంత దూరములో ఈ విత్తనాలు నాటవలెనో ప్రాక్టికల్‌గా చూపించవలెను. అన్ని విధాలుగాను అనుకూలంగా వున్న ఈ ప్రెస్సోలిస్ తుమ్మ వనాలను పెంచడానికి ప్రభుత్వం వెంటనే తాకీదులు పంపడం అవసరం.



---

## కడపలో ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమాలకు కోటి రూపాయలు

ఇటీవల జరిగిన జిల్లా అభివృద్ధిబోర్డు సమావేశానికి అధ్యక్షత వహించిన కడపజిల్లాకలెక్టరు, శ్రీ ఎస్.వి. గిరి సమావేశంలో ప్రసంగిస్తూ రాయలసీమ జిల్లాలో ప్రత్యేకాభివృద్ధి కార్యక్రమాల క్రింద ప్రతి సంవత్సరం జిల్లాకు కోటి రూపాయల చొప్పున రు. 4 కోట్ల రూపాయలను కేటాయించాలని ప్రభుత్వం ప్రతిపాదించిందని అన్నారు.

బోర్డు రూపొందించిన పథకాలను ఎటువంటి లోపాలు లేకుండా అమలు జరుపుతూ 1971 మార్చి ఆఖరునాటికి కేటాయించిన మొత్తాలన్నింటినీ ఖర్చుచేయాలని జిల్లా అధికారులకు, యితర అధికారులకు కలెక్టరు విజ్ఞప్తిచేశారు.

గ్రామీణ విద్యుద్దీకరణకు రు. 55 లక్షలు, ఖారీ, చిన్నతరహా నీటిపారుదలకు రూ. 5 లక్షలు, ఆయకట్టురోడ్లకు రూ. 5 లక్షలు, వ్యవసాయానికి రూ. 2.5 లక్షలు, పశుపోషణకు రు. 3 లక్షలు జిల్లాలో ప్రత్యేక పథకాలకు రు. 10 లక్షలు కేటాయించాలని బోర్డు ప్రతిపాదించింది.

రాయలసీమలోని ప్రతి జిల్లాలో సంవత్సరానికి రు. 60 లక్షల ఖర్చుతో గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించాలని ప్రభుత్వం ప్రతిపాదించిందని కలక్టరు అన్నారు. ఉపాధి కల్పన, శాశ్వత ప్రాతిపదికపై చిన్నతరహా నీటి వనరుల కల్పనల నిమిత్తం కేంద్రప్రభుత్వ ఆహారమంత్రిత్వశాఖ వాటి నిమిత్తం నిధులు మంజూరు చేస్తున్నది.

---

# ఎక్కువ దిగుబడినిచ్చే పంట రకాలు

స్వాతంత్ర్యానంతరం, పంచవర్ష ప్రణాళికల ఫలితంగా వ్యవసాయరంగంలో విశేషమైన అభివృద్ధి జరిగింది. వ్యవసాయంలో శాస్త్రీయమైన నూతన విధానాలను ప్రవేశ పెట్టడానికీ, ఆధునిక పరికరాలను వినియోగించడానికీ తద్వారా వ్యవసాయరంగంలో విప్లవాత్మకమైన మార్పులను తేవడానికీ తీవ్రంగా కృషి జరిగింది. కొత్త విధానాలను అనుసరించి అభివృద్ధి సాధించి, జీవితస్థాయిలో మన రాష్ట్రానికి కీర్తి ప్రతిష్ఠలను ఆర్జించిన అనేక మంది అభ్యుదయ కర్షకులు అభినందనీయులు.

ఇటీవల వ్యవసాయ రంగంలో సాధించిన అభివృద్ధికి ప్రధాన కారణం ఎక్కువ దిగుబడిని యిచ్చే రకాల పంటలను ప్రవేశ పెట్టడమే. నీటి వసతి పుష్కలంగా వున్నచోట యీ రకాలను బాగా పండిస్తున్నారు. ఒక సారి వీటిని ప్రారంభించిన కర్షకులు మరి వెనుకాడ వలసిన అవసరం లేకుండా పోయింది.

టి.ఎన్ 1, ఐ.ఆర్. 8; ఎ.డి.టి. 27; జయ. పద్మ హంస. మొదలైన వరి వంగడాలు. సి.యస్ హెచ్ 1, స్వర్ణ మొదలగు జొన్న వంగడాలు, హెచ్.బి 1, హెచ్.బి 4 వంటి సజ్జరకాలు. దక్కన్ హైబ్రిడ్ మక్కా, గంగా_3, గంగా_5 వంటి మొక్కజొన్న రకాలు, కల్యాణ సోన, సఫేద్ లార్మా, యస్308 వంటి గోధుమ రకాలు కొత్తగా ప్రవేశ పెట్టడం జరిగింది.

1968_69 సంవత్సరంలో యీ రకాల పంటలు 6.74 లక్షల యకరాల్లో వేశారు. 1969_70లో 16.51 లక్షల యకరాల్లో వేయాలని సంకల్పించబడింది.

పొట్టి రకం మెక్సికో గోధుమలు బాగా వాడుకలోకివచ్చాయి. త్వరలోనే ఒక లక్ష యకరాలో యీ పంట వేయబడుతుంది. ఆంధ్రప్రదేశ్ అచిరకాలంలోనే దక్షిణాది రాష్ట్రాలన్నింటికీ గోధుమలు సరఫరా చేయగలుగుతుంది.

ఈ రకాల పంటలు త్వరలో కోతకు వస్తాయి. గనుక, ఎక్కువ పంట ఇవ్వడమే కాక ఎక్కువ పంటలు కూడా పండించవచ్చును.

అనంతపురం జిల్లాలో

# అడవుల పెంపకం

—జి. రామకృష్ణ

అనంతపురం జిల్లా, దక్కను పీఠభూమి మధ్యన వున్నది. తూర్పు ఋతు పవనాలు గానీ పశ్చిమ ఋతు పవనాలుగానీ తగులవు. అందువల్ల వర్షపాతం తక్కువ. వర్షాన్ని ఆకర్షించే అడవులు కూడా నశించి పోతున్నందువల్ల రానురాను వర్షపాతం తగుముఖం చూపుతున్నది. ఇప్పుడు వర్షపాతం 18 అంగుళాల నుంచి 22 అంగుళాల మేరకు పడుతున్నది. ఇంత తక్కువ వర్షపాతం గల జిల్లా మొత్తం భారత దేశంలోనే లేదు (ఒక్క రాజస్థాన్ ఎడారి తప్ప).

ఏ ప్రదేశంలోనైనా అడవి మూడవ వంతు ఆక్రమించి వుంటే ఆ ప్రదేశం సుభిక్షంగా వుంటుందని పెద్దలు చెప్పతారు. మూడోవంతు అడవివుండాలని శాస్త్రవేత్తల సమ్మతం. కాని అనంతపురం జిల్లాలో అడవి ప్రస్తుతం పదిశాతం మాత్రమేవుంది. ఆంధ్రప్రదేశ్‌లో ఇంత తక్కువ అడవి ప్రదేశం గల జిల్లా మరొకటి లేనేలేదు.

జిల్లాలో అడవి క్షీణించేకొద్దీ వర్షపాతం కూడా తగ్గుముఖం పడుతున్నది. పూర్వానికి, ఇప్పటికి చాలా అంగుళాలు తగ్గిపోయింది. ఈ తగ్గడానికి ప్రధానకారణం అడవుల నాశనం కొండమే! ఈ జిల్లాలోనే కాదు–రాష్ట్రంలో–దేశంలో పట్టణాలు అభివృద్ధి అగుతున్నందువల్ల వంట చెరకు సమస్య ప్రబలమగుతున్నది. అందువల్ల వంట చెరకు ఎగుమతికి అడవులను నాశనం చేయడం జరుగుతున్నది. బొగ్గుల ఎగుమతికి అడవులను నాశనంచేయడం జరుగుతున్నది. వంటచెరకునకు గాను చింత, తుమ్మతోపులు కూడ నాశనం చేయబడినాయి. కట్టెసామానుల కోసరం మామిడితోపులు నాశనం చేయబడినాయి. వాటిస్థానములో మరల అడివిని పెంచడం, తోపులను పెంచడం జరగడం లేదు. చెదురు మదురుగా నారింజ తోటలు పెంచ బడినా నష్టాన్ని భరించ గలిగినంత వ్యాపకం కాలేదు.

స్వభావసిద్ధంగా అడవులు పెరగడానికి వర్షపాతం తగినంత లేదు. వర్షం ఆకర్షించడానికి తగినంతగా అడవులు పెరగడం లేదు. అడవులు పెరిగితే గాని వర్షం పడదు. వర్షం పడితేగాని అడవులు పెరగవు. పెండ్లి చేస్తేగాని పిచ్చికుదురదు. పిచ్చికుదిరితేనేగాని పెండ్లి కాదు. పరస్పర విరుద్ధ శక్తులతో ఈ నాడు అనంతపురం జిల్లా సతమతమవుతున్నది.

## కొత్తరకం తుమ్మ చెట్లు

ఈ పరిస్థితిలో ఒక వర ప్రసాదంగా, ఎక్కడినుంచి వచ్చిందో యేమో! ఎవరు తెచ్చారో యేమో–కొత్తరకం తుమ్మ చెట్లు ఎక్కడ పడితే అక్కడ పెరుగుతున్నాయి. దీనినే ఇంగ్లీషులో ప్రెసాఫిస్ అంటారు. మొదట ఈ సీమ తుమ్మను, కంచెగా ఉపయోగించడానికి ప్రయోగించారు. ఇప్పుడు అడవులుగా పెరిగి పోతున్నాయి. కట్టెల కరువును ఈ తుమ్మ చెట్లు నివారించగలుగుతున్నవి. ముఖ్యంగా బీద దిక్కు లేని ఈ తుమ్మ కంపలతోనే జీవనం చేసుకుంటున్నారు.

ఈ తుమ్మ చెట్లు పెరగడం మనిషి తలపోతగా పెంగడం లేదు. గొర్రెలు, మేకలు వీటి కాయలు తిని, పెంటికలు వేయడం వల్ల, విత్తనాలు పడి; మొలచి, అడవులుగా, మనిషి ప్రయత్నం లేకనే పెరుగుతున్నవి. ఈ తుమ్మ చెట్లు పెరగడానికి నేలదుక్కిని కోరడంలేదు. సుక్షేత్ర మాసించడం లేదు. నీటి సమృద్ధిని కోరడంలేదు. ఎప్పుడో ఒకసారి విత్తనం మొలవడానికి వర్షం పడితే చాలు. ఏరుదిగబడి పోతుంది, లోతుగా పోతుంది. ఎవరి ప్రయత్నం లేకనే పెరిగి పోతుంది. అయాచితంగా సంభవించిన ఈ సీమ తుమ్మ అడవులను మానవ ప్రయత్నంతో పెంచ గలిగితే దేశం సుభిక్షంగా తయారగుటకు వీలున్నది.

అనంతపురం జిల్లా అంతా కలసి 47.28 లక్షల ఎకరాల విస్తీర్ణమున్నది. అందులో అడవి ప్రాంతం 4.76 లక్షల ఎకరాలు మాత్రమే వున్నది. సాగులేని భూమి 4.13 లక్షల ఎకరాలున్నది. వ్యవసాయే తరముగా వుపయోగించబడుతున్న భూమి 3.11 లక్షల ఎకరాలున్నది. వ్యవసాయానికి యోగ్యత గలిగి బంజరుగా 3.75 లక్షల ఎకరాలున్నది. వ్యవసాయ అనుకూలమైన భూమిని విడిచి తక్కువ భూమిపై ఈ ప్రెసాఫిస్ సీమ తుమ్మ అడవులను పెంచవచ్చును. అన్ని రకాలైన నేలలలోను ఈ తుమ్మచెట్లు పెరుగుతున్నవి. అనంతపురం జిల్లాలో బోడి కొండలు మెండుగా వున్నాయి. ఇదివరకు ఈ కొండలు దట్టమైన అడవులచే నిండివుండేటివి ఇప్పుడు నాశనమైనాయి. వాటి స్థానములో ఈ తుమ్మచెట్లను మానవ ప్రయత్నంతో పెంచవచ్చును.

కేంద్రంలో శ్రీ కె.యం. మున్షీ మంత్రిగా వున్నప్పటినుంచీ, సప్త సంతానాలలో వృక్షములను పెంచడం కూడా ఒకటి అని ప్రబోధించి చెట్లు నాటుటకు లక్షలకు, కోట్లకు ఖర్చు పెట్టి నది ప్రభుత్వం. కాని ఫలితం శూన్యం. నాటిన చెట్లకు నీరు పోయరు. పెరిగిన చెట్లకు రక్షణలేక మేకలు, గొర్రెలు పశువుల మేతకు ఉపయోగపడి నాశనమైనాయి. వృక్ష సంతానాభివృద్ధి కాలేదు.

ఇప్పుడు ఈ సీమతుమ్మకు పశువుల భయంలేదు. మేకలు

గొర్రెలు ఈ తుమ్మ ఆకులను తాకనైనా తాకవు. పెరిగిన తర్వాత వీటి కాయలను మేకలు గొర్రెలు ఆప్యాయంగా తింటున్నాయి. ఆహారంగా ఉపయోగ పడుతున్నాయి. కాబట్టి ఇన్ని సదుపాయాలున్న ఈ తుమ్మ చెట్లను సులభతరంగానే, పనికి రాని భూములలోను బోడికొండ గుట్టలనిండాను నింపవచ్చును.

## పాఠశాలలలో

జూన్, జూలై, ఆగస్టు నెలలలో ఎప్పుడో ఒకప్పుడు విత్తనం వేయవలసి వుంటుంది. అనంతపురం జిల్లాలో అనేక ప్రాథమిక పాఠశాలలు, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు ఉన్నాయి. పాఠశాలలలో వేలమంది విద్యార్థులు చదువుతున్నారు. ఉపాధ్యాయులందరు విద్యార్థులను వెంటబెట్టుకొని, విత్తనాలను తీసుకొని తమ చుట్టువున్న పనికిరాని నేలలపైన, కొండగుట్టలపైన దాడి చేయవలసి వుంటుంది. మొదటి దుక్కి వర్షం పడిన వెంటనే ప్రతి విద్యార్థి, ఉపాధ్యాయుడు చేతిలో ఒక కట్టెను తీసుకొని, వరుస క్రమంలో నిలబడి నేలను కట్టెతో పొడిచి తీసి అందులో ఒక్కొక్క విత్తనము విడిచి పూడ్చుకుంటూ ముందుకు పోవలసి వుంటుంది. విద్యార్థులకు, స్కూళ్ళకు తగిన విత్తనాలను వ్యవసాయ శాఖవారు సప్లై చేయాలి. జిల్లా కలెక్టరు, జిల్లాపరిషత్ చైర్మెన్ ఈ ఉద్యమానికి దీక్షతో నాయకత్వం వహించి తాకీదులు పంపి, జిల్లాలోని అందరి విద్యార్థులను దీక్షతో కదలించి, విత్తనాలను నాటుటకు ప్రోత్సహించాలి. వారినందరిని ఈ ఎక్స్‌కర్షన్ పోవునట్లు ప్రోత్సహించాలి. వారికి తగిన పప్పుబెల్లాలు తిండిపెట్టాలి. వ్యవసాయశాఖ, అటవిశాఖ ఇతర శాఖలతోపాటుగా ఈ బోడి కొండలను, గుట్టలను, పనికిమాలిన నేలలను ఈ తుమ్మ చెట్లతో నింపివేయాలి. వర్షాకాలంలో ఒక్కసారి విత్తనం పడిన తర్వాత మరి యెవరి తోడ్పాటు లేకుండానే ఈ తుమ్మ చెట్లు అడవులుగా పెరిగిపోగలవు. వ్యవసాయి శాఖవారు, అటవీ శాఖవారు ఎంతెంత దూరములో ఈ విత్తనాలు నాటవలెనో ప్రాక్టికల్‌గా చూపించవలెను, అన్ని విధాలుగాను అనుకూలంగా వున్న ఈ ప్రెస్సాలిస్ తుమ్మ వనాలను పెంచడానికి ప్రభుత్వం వెంటనే తాకీదులు పంపడం అవసరం. 

# కడపలో ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమాలకు కోటి రూపాయలు

ఇటీవల జరిగిన జిల్లా అభివృద్ధిబోర్డు సమావేశానికి అధ్యక్షత వహించిన కడపజిల్లాకలెక్టరు, శ్రీ ఎస్.వి. గిరి సమావేశంలో ప్రసంగిస్తూ రాయలసీమ జిల్లాలో ప్రత్యేకాభివృద్ధి కార్యక్రమాల క్రింద ప్రతి సంవత్సరం జిల్లాకు కోటి రూపాయల చొప్పున రు. 4 కోట్ల రూపాయలను కేటాయించాలని ప్రభుత్వం ప్రతిపాదించిందని అన్నారు.

బోర్డు రూపొందించిన పథకాలను ఎటువంటి లోపాలు లేకుండా అమలు జరుపుతూ 1971 మార్చి ఆఖరునాటికి కేటాయించిన మొత్తాలన్నింటినీ ఖర్చుచేయాలని జిల్లా అధికారులకు, యితర అధికారులకు కలెక్టరు విజ్ఞప్తిచేశారు.

గ్రామీణ విద్యుద్దీకరణకు రు. 55 లక్షలు, భారీ, చిన్నతరహా నీటిపారుదలకు రూ. 5 లక్షలు, ఆయకట్టురోడ్లకు రూ. 5 లక్షలు, వ్యవసాయానికి రూ. 2.5 లక్షలు, పశుపోషణకు రు. 3 లక్షలు జిల్లాలో ప్రత్యేక పథకాలకు రు. 10 లక్షలు కేటాయించాలని బోర్డు ప్రతిపాదించింది.

రాయలసీమలోని ప్రతి జిల్లాలో సంవత్సరానికి రు. 60 లక్షల ఖర్చుతో గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించాలని ప్రభుత్వం ప్రతిపాదించిందని కలక్టరు అన్నారు. ఉపాధి కల్పన, శాశ్వత ప్రాతిపదికపై చిన్నతరహా నీటి వనరుల కల్పనల నిమిత్తం కేంద్రప్రభుత్వ ఆహారమంత్రిత్వశాఖ వాటి నిమిత్తం నిధులు మంజూరు చేస్తున్నది.

## పండుతుంది భుక్తికి కొదువేమి లేదు

### ఆధునిక పరికరాల సహాయంతో పదింతల ఫలితం

వరిపొలంలో నాట్లు. మధ్య : దుక్కి దున్నడం. క్రింద : రసాయనిక ఎరువులు చల్లడం.
కలుపు తీత. మధ్య : పెరిగిన పంట. క్రింద : విమానంద్వారా మందు చల్లడానికి సన్నాహాలు.







# ఆంధ్రప్రదేశ్‌లో విద్యుచ్ఛక్తి అభివృద్ధి

విద్యుచ్ఛక్తి అభివృద్ధికై ముఖ్యంగా కావలసిన బొగ్గు, జలాధారాలు మన రాష్ట్రానికి ప్రకృతి సిద్ధంగాను, పుష్కలంగాను వున్నాయి. రాష్ట్ర ఆర్థికాభ్యున్నతి నిమిత్తం ఈ ఆధారాలను వినియోగించి విద్యుచ్ఛక్తిని శీఘ్రగతితో అభివృద్ధి పరచాలని ఆకాంక్షించినప్పటికీ ఆర్థిక వనరులు పరిమితం కావడం మూలంగా అది సాధ్యం కావడంలేదు. అయినప్పటికీ ఈ పరిమితమైన వనరులలోనే ప్రభుత్వం విద్యుచ్ఛక్తి ఉత్పత్తి సరఫరాలకు ప్రాధాన్యం ఇచ్చింది.

ప్రస్తుత స్థాపిత ఉత్పత్తి శక్తి 600.4 మెగావాట్లు. అవసరార్థం ఉంచబడిన 20 మెగావాట్ల గ్యాస్ టర్బో సెట్లు ఇందులో చేరివున్నాయి. కాబట్టి ఇప్పుడు లభ్యమౌతున్న ఉత్పత్తి శక్తి 580.4 మెగావాట్లు. ఇందుమూలంగా 450 మెగావాట్ల విద్యుచ్ఛక్తి అవసరాన్ని తీర్చడానికి సాధ్యం కాగలదు. ఇప్పటి వరకు 494.3 మెగావాట్ల గరిష్ఠ పరిమితి మేరకు విద్యుచ్ఛక్తి అవసరంకాగా 1970 మార్చినాటికి 530 మెగావాట్ల గరిష్ఠ పరిమితి మేరకు విద్యుచ్ఛక్తి అవసరంకాగలదని ఆశించబడుతున్నది. విద్యుచ్ఛక్తి అవసరాలు ఇతోధికం కావడంవల్ల 1970 మధ్యకాలంనుండి విద్యుచ్ఛక్తి విషయంగా ఏర్పడగల తరుగు నాలుగవ ప్రణాళికా కాలంలో క్రమేణా పెరగగలదు.

నిర్మాణంలోవున్న శ్రీశైలం జల విద్యుత్ పథకం ప్రయోజనాలు కొంతవరకు 1976లో అంటే 5 వ ప్రణాళికలో మాత్రమే చేకూరగలవు. తక్కువ కాగల విద్యుచ్ఛక్తిని కొంతవరకు సమకూర్చే నిమిత్తం ఈ క్రింది పథకాలు తలపెట్టబడినాయి:

(1) నాగార్జునసాగరు పంపు స్టోరేజి పథకం ... 100 మెగావాట్లు

(2) రామగుండం 'సి' కేంద్రం ... 440 మెగావాట్లు

(3) కొత్తగూడెం 4 వ దశ ... 220 మెగావాట్లు

(4) బలిమెల డామువద్ద ఆంధ్ర పవర్ హౌస్ ... 30 మెగావాట్లు

(5) సోమశిలవద్ద అణు విద్యుత్కేంద్రం (శ్రీశైలం సమీపంలో) .... 400 మెగావాట్లు

ఈ క్రింది పథకాల మూలంగా లభ్యంకాగల అదనపు ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని, విద్యుచ్ఛక్తి స్థాపిత శక్తిని 1969-70 లో 580.4 మెగావాట్లనుండి 1973-74 లో 1062.9 మెగావాట్లకు పెంచాలని ఉద్దేశిస్తూ ఈ రాష్ట్రం ప్రతిపాదించిన 4వ ప్రణాళికలో విద్యుచ్ఛక్తి రంగానికి రూ. 225.00 కోట్ల మొత్తాన్ని కేటాయించాలని సూచించబడింది:

1970-71 రామగుండం 'బి' కేంద్రం ... 62.5 మెగావాట్లు

1972-73 కొత్తగూడెం మూడవదశ మొదటి సెట్టు ... 110.0 మెగావాట్లు

1973-74 కొత్తగూడెం మూడవ దశ, రెండవ సెట్టు ... 110.0 మెగావాట్లు

1973-74 దిగువ సీలేరు జల విద్యుత్ పథకం: 1 వ సెట్టు 2 వ సెట్టు ... 200.0 మెగావాట్లు

482.5 మెగావాట్లు

అయితే కేంద్ర ప్రభుత్వం రూపొందించిన 4 వ పంచవర్ష ప్రణాళికలో విద్యుచ్ఛక్తి రంగానికి రూ. 165.55 కోట్లు మాత్రమే కేటాయించబడింది. ఇందు మూలంగా 172.5 మెగావాట్ల శక్తి మాత్రమే అదనంగా ఉత్పత్తి కాగలదు. తద్వారా స్థాపితశక్తి 1969-70 లో 580.4 మెగావాట్ల నుండి 1973-74 లో 752.9 మెగావాట్లకు పెరగగలదు. అందులో ఈ క్రింది పథకాల ప్రయోజనాలుకూడా చేరివున్నాయి:

1970-71 రామగుండం 'బి' కేంద్రం ... 62.5 మెగావాట్లు

1972-73 కొత్తగూడెం 3 వ దశ 1 వ సెట్టు ... 110.0 మెగావాట్లు

172.5 మెగావాట్లు

ఇప్పటి లోడు అంచనానుబట్టి విద్యుచ్ఛక్తి అవసరాలు 1970-71 లో 688 మెగావాట్ల నుండి 1973-74 లో 1,160 మెగావాట్లకు పెరగవచ్చునని ఆశించబడుతున్నది. 1973-74 లో అవసరంగాగల 1160 మెగావాట్ల శక్తిని సమకూర్చేందుకు 1,510

మెగావాట్ల ఉత్పత్తి శక్తి అవసరం కాగలదు. అంటే 4 వ ప్రణాళికా కాలంలో 930 మెగావాట్ల స్థాపిత శక్తిని అదనంగా సమకూర్చవలసి వుంటుంది.

మన రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని అధికం చేసేందుకు 3వ ప్రణాళికలో మాత్రమే ప్రణాళికాబద్ధమైన గట్టి కృషి ప్రారంభమైంది. విద్యుచ్ఛక్తి అభివృద్ధి విషయంలో గణనీయమైన ప్రగతి సాధించినప్పటికి, విద్యుచ్ఛక్తి అవసరాలు ఉత్పత్తి శక్తిని మించుతూనే ఉన్నాయి. విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో ఏర్పడగల తరుగును తీర్చడానికి వీలైనన్ని పథకాలను చేపట్టేందుకు ఆంధ్ర ప్రదేశ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు ఎంతో ఆసక్తి కనపరుస్తున్నది. అయితే నిధుల కొరత కారణంగాను, 4 వ ప్రణాళికలో ప్రణాళికా వినియోగంపై కేంద్ర ప్రభుత్వం విధిస్తున్న నిర్బంధాల మూలంగాను అది సాధ్యం కావడంలేదు. మన రాష్ట్రంలో ఏర్పడే విద్యుచ్ఛక్తి తరుగును తీర్చడానికి పొరుగు రాష్ట్రాలైన మైసూరు, తమిళనాడులనుండి విద్యుచ్ఛక్తి తీసుకునేందుకు లోగడ తలపెట్టిన ఏర్పాట్లు ఇంకా పూర్తికాలేదు. విద్యుచ్ఛక్తి సరఫరా రేటు, సరఫరా కాలం గురించి ఇంకా తుది నిర్ణయం గైకొనలేదు. వాటిని అనతికాలంలోనే నిర్ణయించడం జరగగలదని ఆశించబడుతున్నది. ఈ ఏర్పాట్లకు తోడు, శ్రీశైలం సమీపంలో సోమశిలవద్ద అణు విద్యుచ్ఛక్తి కేంద్రాన్ని నెలకొల్పే ఆవశ్యకతను గురించి, తమిళనాడులోని కేంద్ర ప్రభుత్వ విద్యుదుత్పాదక కేంద్రాలైన నైవేలి విద్యుచ్ఛక్తి కేంద్రం, కల్పక్కం అణు విద్యుచ్ఛక్తి కేంద్రం నుండి విద్యుచ్ఛక్తిలో నుంచి మన రాష్ట్రానికి వాటా ఇవ్వవలసిన అవసరం గురించి మన ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి నొక్కిచెప్పింది. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వం నుండి సమాధానం రావలసి వున్నది. ఈ విషయంలో మనం కేంద్ర ప్రభుత్వానికి చేసిన అభ్యర్థన సబబైనది, కేంద్ర ప్రభుత్వం మన అభ్యర్థనను ఆమోదించగలదని ఆశిస్తున్నాము. పైన తెలిపిన చర్యలను పురస్కరించుకొని, 4 వ పంచవర్ష ప్రణాళికా కాలంలో విద్యుచ్ఛక్తి విషయంగా ఏర్పడగల తరుగును ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు తీర్చగలదని, ఈ విషయంలో వ్యాకులత చెంతనవసరం లేదని భావించబడుతున్నది.

1969_70 లో రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు వినియోగానికి సంబంధించి అసలు ప్రణాళికా కేటాయింపు రూ. 3,23 కోట్లు కాగా అది రూ. 40.66 కోట్లు చేరవచ్చునని ఆశించబడుతున్నది. 1970_71 లో పెట్టుబడి వినియోగం రూ. 3,457.00 లక్షలు. ఈ రూ. 3,457.00 లక్షల మొత్తంలో రూ. 470.00 లక్షలు ప్రభుత్వ పథకాలపైనా, మిగతా మొత్తం బోర్డు పథకాలపైనా ఖర్చుచేయడం జరుగుతుంది.

## ప్రభుత్వ పథకాలు, కొనసాగుతున్న పథకాలు.

ఎగువ సీలేరు జల విద్యుత్ పథకం:— ఒక్కొక్కటి 60 మెగావాట్ల శక్తిగల రెండు యూనిట్లలో మొదటి యూనిటు 1967 అక్టోబరులోను, రెండవ యూనిటు 1968 మార్చిలోను పని ప్రారంభించాయి. సవరించిన అంచనా రూ. 1,850.00 లక్షలు కాగా, 1969_70 అంతానికి వ్యయం రూ. 1,829.00 లక్షలు. 1969_70 లో గుంటవాడ వియరుకు క్రెస్టు గేట్ల నిర్మాణం పూర్తయింది. 1970_71కి ఎట్టి కేటాయింపు చేయబడలేదు. 23_8_1968 తేదీ గల పి. డబ్ల్యు శాఖ మిస్ నెం. 1331 జి ఓ లో, బోర్డు యీ పథకం అమలు నిర్వహణలకు అజమాయిషీ వహించాలని ప్రభుత్వం ఉత్తరువు చేసింది.

బలిమెల డాము:— ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా ప్రభుత్వాల మధ్య కుదిరిన ఒప్పందపు షరతుల ప్రకారం మన ప్రభుత్వం వాటా రూ. 12,00 కోట్లకు మించకూడదనే షరతుకు లోబడి, బలిమెల డాము కయ్యే వ్యయాన్ని యీ రెండు రాష్ట్ర ప్రభుత్వాలు సమాన వాటాలలో భరిస్తాయి. మన రాష్ట్రం బలిమెల డాము నుండి నిరంతరాయమైన 2,100 క్యూసెక్కుల నీటి సరఫరాను పొందుతుంది. పైన పేర్కొన్న రూ 12,00 కోట్లు కాకుండా, బలిమెల డాము వద్ద ఆంధ్రప్రదేశ్ పవర్ హౌసుకూ, అందుకు సంబంధించిన పనులకూ అయ్యే ఖర్చును మన ప్రభుత్వమే భరించవలసి వుంటుంది. ఈ ప్రాజెక్టుపై పనులకు ఆంధ్రప్రదేశ్ వాటా నిమిత్తం 1970_71 లో రూ 107 71 లక్షల కేటాయింపు చేయబడింది.

శ్రీశైలం జల విద్యుత్ పథకం:— శ్రీశైలంలో మొదటి దశలో ఒక్కొక్కటి 110 మెగావాట్ల శక్తిగల నాలుగు యూనిట్లను స్థాపించడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ ప్రాజెక్టు అంచనా ఖర్చు రూ. 45.75 కోట్లు. కాఫర్ డాములు నిర్మించబడాయి. 7 నుండి 10 వరకుగల బ్లాకులలో, నదిలోని లోతు కాలవ భాగంలో డాము పునాదుల త్రవ్వకం పని పూర్తయింది. డాముకు రాతి/కాంక్రీటు కట్టడపు పని చేపట్టబడింది. సాధ్యమైనంత త్వరలో డామును సురక్షితమైన మట్టానికి పెంచాలనే ఉద్దేశంతో లోతునదీ భాగంలోని డాము పునాదుల దట్టింపు పనిపై ప్రత్యేకశ్రద్ధ వహించబడుతున్నది. ఇంతవరకు 10.11 లక్షల ఘనపుటడుగుల మేర రాయి/ కాంక్రీటు వేయబడింది. సగటు నది గర్భపు మట్టము 'హీల్' వద్ద 430 అడుగులు. 'టో' వద్ద 475 అడుగులు కాగా 'హీల్'వద్ద 480 అడుగులు, 'టో'వద్ద 505 అడుగుల ఎత్తు వరకు డాము నిర్మించబడింది. 1969 డిశంబరు నుండి ప్రారంభమయ్యే 1969_70 పని కాలములో డాము నిర్మాణపు పని తిరిగి చేపట్టబడింది. ఆ పని కాలములో (1969 డిశంబరు నుండి 1970 మే వరకు) 25 లక్షల ఘనపుటడుగుల రాతి/కాంక్రీటు పనిచేయాలని సంకల్పించబడింది. దీనితో డాము సగటు మట్టము 520 అడుగులకు పెరుగుతుంది. నాలుగవ పంచవర్ష ప్రణాళిక ఆఖరుకు, అంటే, 1973_74 నాటికి ఈ డాము సగటు ఎత్తును 680 అడుగులకు పెంచడానికి వీలవుతుంది. ఈ పనికిగాను నాలుగవ ప్రణాళికకాలానికి రూ. 17 కోట్లు కేటాయించబడతాయని ఆశించడంజరిగింది. కృష్ణానదిపై గల వంతెనకు 1 నుంచి 4, 6 నుండి 11 వరకు గల పియర్లు పెంచబడుతున్నాయి. అవి వివిధ స్థాయిలలోను వున్నాయి. 5 నెంబరు పియరులో కాంక్రీటు పని చేపట్టబడుతున్నది. వంతెన పని 1970 చివరిభాగంలో పూర్తి

గలదెదని ఆశించబడుతున్నది. 1969_70 సం.లో శ్రీశైలం ప్రాజెక్టు సివిలు పనులకుగాను రూ. 350 లక్షల కేటాయింపు జరిగింది ఈ మొత్తంలో నుండి రూ. 212.17 లక్షల మొత్తం 1969 డిశంబరు ఆఖరు నాటికి ఖర్చు పెట్టబడింది. ఈ ప్రాజెక్టు ప్రారంభమైనప్పటి నుండి. సివిలు పనులపై రూ. 2,421.14 లక్షలు ఖర్చయ్యాయి. 1970_71 బడ్జెటు అంచనాలో రూ. 350.00 లక్షల కేటాయింపు చేయబడింది.

## క్రొత్త ప్రాజెక్టుల పరిశీలన

ఈ క్రింది జలవిద్యుత్ పథకాలు ప్రభుత్వ పరిశీలనలో ఉన్నాయి.

పరిశీలనము పూర్తి అయిన పథకాలు:

(i) ఇచ్చంపల్లి జలవిద్యుత్ పథకం
(ii) పోచంపాడు జలవిద్యుత్ పథకం
(iii) కుంతల జలవిద్యుత్ పథకం
(iv) ఎగువ కృష్ణా జలవిద్యుత్ పథకం
(v) నాగార్జునసాగర్ కుడి కాలువ జలవిద్యుత్ పథకం
(vi) తుంగభద్ర ఎగువ కాలువ జలవిద్యుత్ పథకం

పరిశీలన క్రింద ఉన్న పథకాలు:

(i) పులిచింతల జలవిద్యుత్ పథకం
(ii) పర్ణశాల, దుమ్ముగూడెం జలవిద్యుత్ పథకం
(iii) ప్రాణహిత జలవిద్యుత్ పథకం

పరిశీలించవలసిన పథకాలు:

(i) సింగూరు జలవిద్యుత్ పథకం
(ii) కె. సి. కాలువ జలవిద్యుత్ పథకం
(iii) దిగువ మాచ్‌ఖండ్ జలవిద్యుత్ పథకం

1970 71 బడ్జెటు అంచనాలలో రూ. 13.38 లక్షల మొత్తం యిందుకు కేటాయించబడింది.

## రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డు కొనసాగుతున్న పథకాలు

కొత్తగూడెం థర్మల్ పథకం మొదటి దశ:_అంతర్జాతీయ అభివృద్ధి మండలి నుండి 20 మిలియను డాలర్ల ఋణం ద్వారా చేపట్టిన ఈ పథకం చాలావరకు పూర్తి అయింది. ఒక్కొక్కటి 60 మెగావాట్ల శక్తిగల రెండు యూనిట్లు పనిచేస్తున్నాయి. సవరించిన అంచనా రూ. 2,896 లక్షలు కాగా 1969_70 ఆఖరు నాటికి రూ. 2789 లక్షలు ఖర్చు కాగలదని ఆశించబడుచున్నది. కిన్నెరసానిడాము వద్ద పనులను పూర్తి చేయడానికి, ఈ పథకం క్రింద ట్రాన్సుమిషను లైన్లను పూర్తి చేయడానికి 1970_71 బోర్డు బడ్జెటు అంచనాలో రూ. 58 లక్షలు కేటాయించబడింది.

రామగుండం థర్మల్ పథకం 'బి' స్టేషను (ఎ. ఒ. డి. యూనిటు):_ రామగుండం వద్ద 62.5 మెగావాట్ల శక్తిగల థర్మల్ యూనిటును స్థాపించడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 84 మిలియను డాలర్ల యు. యస్. ఎ. ఐ. డి. ఋణం నుండి ఈ పథకానికి ద్రవ్యం సమకూర్చబడుతున్నది. ఈ యూనిటు 1970 డిసెంబరులో పని చేయడం ప్రారంభిస్తుంది. ఈ పథకానికి తుదిసారిగా సవరించిన అంచనా రూ. 1226 లక్షలు. 1969_70 ఆఖరు నాటికి రూ.1090 లక్షలు ఖర్చు కాగలదని భావించబడుచున్నది. 1670_71 సంవత్సరానికి బోర్డు బడ్జెటు అంచనాలో రూ. 150 లక్షల కేటాయింపు చేయబడింది.

కొత్తగూడెం థర్మల్ పథకం రెండవ దశ:_14 మిలియను డాలర్ల ఐ. బి. ఆర్. డి ఋణంద్వారా చేపట్టబడిన ఈ పథకం కూడా చాలా వరకు పూర్తి అయింది. ఒక్కొక్కటి 60 మెగావాట్ల శక్తిగల రెండు యూనిట్లు పనిచేస్తున్నాయి సవరించిన అంచనా రూ. 1,333.33 లక్షలుగా 1969_70 ఆఖరు నాటికి ఆశించిన వ్యయం రూ. 1,216 లక్షలు వుంటుంది. మిగతా చెల్లింపును భరించేనిమిత్తం 1970_71 బోర్డు బడ్జెటు అంచనాలో రూ.36 లక్షల కేటాయింపు చేయబడింది.

కొత్తగూడెం థర్మల్ పథకం మూడవ దశ:_ మొదటి రెండవ దశ పథకాలకు తరువాయిగా కొత్తగూడెంలో ఒక్కొక్కటి 110 మెగావాట్ల శక్తిగల రెండు థర్మల్ సెట్లను నెలకొల్పడానికి ఈ పథకం ఉద్దేశిస్తుంది. ఈ పథకపు అంచనాల వ్యయం రూ. 4,280 లక్షలు. భారత్ హెవీఎలక్ట్రికల్స్ లిమిటెడువారు యంత్ర సామాగ్రిని_రామచంద్రాపురం ఫ్యాక్టరీ నుండి టర్బైనులను, తిరుచ్చి ఫ్యాక్టరీ నుండి బాయిలర్లను సరఫరా చేయుచున్నారు. మొదటి యూనిట్ 1972 మార్చిలోను, రెండవ యూనిటు 1972 జూలైలోను, పనిచేయడం ప్రారంభిస్తాయని ఆశించబడుచున్నది. 1968_69 ఆఖరు నాటికి అయిన రూ. ఖర్చు 45.12 లక్షలు. ఈ పథకంకోసం, 1669_70 సవరించిన అంచనాలలో రూ. 780 లక్షల కేటాయింపు, 1970_71బోర్డు బడ్జెటు అంచనాలలో రూ 1000 లక్షల కేటాయింపు చేయబడింది. ఇందులో అధిక మొత్తం భారత హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడుకు చెల్లింపుల నిమిత్తం వినియోగించబడుచున్నది.

దిగువ సీలేరు జలవిద్యుత్ పథకం:_మొదటిదశలో ఒక్కొక్కటి 100 మెగావాట్ల శక్తిగల నాలుగు సెట్లను నెలకొల్పడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. నిర్మాణంలో వున్న రెండు విద్యుదుత్పాదక పథకాలలో ఇది ఒకటి. రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి కొరతను కొంతవరకు తీర్చడానికి వీటిని సాధ్యమైనంత త్వరలో పూర్తి చేయవలసి వుంది. కాని ఆర్థిక వనరుల కొరతవల్ల ఎక్కువ ప్రగతిని సాధించడానికి వీలులేకపోయింది. మొదటి రెండవ యూనిట్లను రష్యా సరఫరా చేస్తుంది. 1971 మొదటి మూడు నెలలలో సరఫరాలు ఆరంభమవుతాయని ఆశించబడుతున్నది. డాము టనెల్ మొదలైనటువంటి సివిలు పనులు చురుకుగా సాగుతున్నాయి ఈ పథకపు సవరించిన అంచనా రూ. 4,990 లక్షలు వుంటుందని ఆశించబడుతున్నది.

1969_70 ఆఖరునాటికి రూ. 345 లక్షలు ఖర్చు అవుతుంది. ఈ పథకం కోసం 1970_71 బోర్డు బడ్జెటు అంచనాలో రూ. 542 లక్షలు మాత్రమే కేటాయింపు చేయడానికి వీలంటుంది.

(ఎ) ట్రాన్సుమిషను లైన్ల పథకం:_ విద్యుచ్ఛక్తిని పంపడం లైను నష్టాలను తగ్గించడం, గ్రిడ్‌లోని ఏదైనా భాగంలో ఆటంకం వున్నప్పుడు సయితం నమ్మకంగా విద్యుచ్ఛక్తి సరఫరా చేయడానికి ఏ సమయంలోనైనా గిట్టుబాటు అయ్యే విద్యుచ్ఛక్తి కేంద్రనుండి విద్యుత్ సరఫరా సౌకర్యాన్ని ఏర్పాటుచేయడం_ ఈ నాలుగు ఇ. హెచ్ టి ట్రాన్సుమిషనులైన్ల నిర్మాణంలోని లక్ష్యాలు. ఈ లక్ష్యాలను దృష్టియందుంచుకుని గిట్టుబాటుగా వుండేటట్లు రాష్ట్రి అవసరాలను గురించి పరిశీలనలు జరిపి. ట్రాన్సుమిషను లైన్ల పథకాలు రూపొందించబడ్డాయి.

(ఎ) మూడవ ప్రణాళికయొక్క ట్రాన్సుమిషను మరియు పంపిణీ పథకంలో ప్రధానమైన ఈ క్రింది 220 కె.వి. ట్రాన్సుమిషను లైన్లు చేరివున్నాయి

(i) ఎగువ సీలేరు_గాజువాక

(ii) ఎగువ సీలేరు_కొత్తగూడెం.

(iii) కొత్తగూడెం_నాగార్జునసాగర్

(iv) కడప_చిత్తూరు_మద్రాసు రాష్ట్రి సరిహద్దు.

పైలైన్లు అన్నీ పూర్తిచేయబడ్డాయి

(బి) శ్రీశైలం ట్రాన్సుమిషను పథకంలో నాగార్జునసాగరు నుండి శ్రీశైలంకు, శ్రీశైలం నుండి కడపకు 220 కె.వి. ట్రాన్సుమిషను లైన్లు వున్నాయి. ఈ రెండులైన్లు తమిళనాడుతో అంతర రాష్ట్రి సంబంధంతో బాటుగా రాష్ట్రిగ్రిడ్‌లో ఒకభాగంగా వున్నాయి ఇవికూడా పూర్తిచేయబడ్డాయి

(సి) నాల్గవ ప్రణాళిక ట్రాన్సుమిషను పథకంలో చేరిన కొత్తగూడెం_గుణదల 220 కె.వి. లైను ఏర్పాటవుతున్నది.

(డి) ఈ క్రింది 132 కె వి ట్రాన్సుమిషను లైన్లుకూడా పూర్తిచేయబడ్డాయి:

(i) హైదరాబాదు_మహబూబ్‌నగరు 132 కె.వి లైను.

(ii) కర్నూలు_శ్రీశైలం 13 కె.వి.లైను

(iii) కర్నూలు_ గుత్తి 132 కె.వి లైను.

(ఇ) ఈక్రింది ట్రాన్సుమిషనులైనుల, సబ్‌స్టేషనులపై పనులు కొనసాగుతున్నాయి. ఇవి 1969_70లో గానీ లేదా ఆటు పిమ్మట స్వల్ప వ్యవధిలోగానీ పూర్తిచేయబడతాయి:

(i) కొత్తగూడెం_గుణదల 220 కె.వి. లైను.

(ii) జంటనగరాల చుట్టూ 132 కె.వి. రింగు మెయిన్ లైన్లు.

(iii) రామగుండం_పోచంపాడు 132 కె.వి.లైను.

(iv) గుత్తి_ధర్మవరం 132 కె.వి. లైను.

(v) చిత్తూరు_రేణిగుంట 132 కె.వి. లైను.

(vi) చిత్తూరు, కడప, హంపిలలో 220/132 కె.వి. సబ్‌స్టేషనులు.

(ఎఫ్) 1970_71 బడ్జెటు అంచనాలలో ఈ క్రింది ట్రాన్సుమిషను లైనులకు సబ్‌స్టేషనులకు కేటాయింపు చేయబడింది:

(i) కొత్తగూడెం_హైదరాబాదు 220 కె.వి.లైను.

(ii) దిగువసీలేరు_బొమ్మూరు 220 కె.వి. లైను.

(iii) నాగార్జునసాగరు_ నల్గొండ 132 కె.వి. లైను.

(iv) శ్రీశైలం_కంభం 132 కె.వి. లైను.

(v) గారివీడు_టెక్కలి 132కె.వి.లైను.

(vi) గుణదల, షాపూర్‌నగర్, బొమ్మూరులలో 220 కె. వి సబ్‌స్టేషన్లు

(vii) పోచంపాడు, కలికిరి నల్గొండ, ఒంగోలు కంభంలలో 132 కె.వి సబ్‌స్టేషన్లు

ట్రాన్సుమిషను లైన్లు సబ్‌స్టేషనుల కోసం 1969_70 కి బోర్డుయొక్క సవరించిన అంచనాలలో రూ. 571 లక్షల మొత్తం, 1970_71 కి బోర్డుయొక్క బడ్జెటు అంచనాలో రూ. 568.00 లక్షలు కేటాయించబడ్డాయి.

పంపిణీ పథకం:_ ఈ పథకం క్రింద కేటాయింపు ముఖ్యంగా వ్యవసాయేతర సర్వీసు కన్నెషన్ల కోసం సహేతుకమైన సంతృప్తికర విద్యుచ్ఛక్తి సరఫరా నిర్వహణకు తప్పనిసరిగా అవసరమయ్యే అభివృద్ధి పనుల కోసం ఉద్దేశించబడింది. 1968_69 లో వ్యవసాయేతర సర్వీసులకు ఇచ్చిన కనెక్షన్ల సంఖ్య 1,10,161. దీనితో 1968_69 ఆఖరు నాటికి ఈ కనెక్షన్ల సంఖ్య 7,02,373 అయింది. 1969_70 లక్ష్యం 1,47,000. 1970_71 కి లక్ష్యం 1,50,000 గా నిర్ణయించబడింది. గిరాకీకి అనుగుణంగా సర్వీసులు ఇవ్వబడేట్లు విద్యుచ్ఛక్తి ఇవ్వబడిన ప్రాంతాలు దానిని పూర్తిగా వినియోగించుకునేటట్లు చూడబడుతుంది.

## గ్రామీణ విద్యుదీకరణ

ఆంధ్రప్రదేశ్‌లో 27,307 గ్రామాలు వున్నాయి. వీటిలో తెలంగాణా ప్రాంతంలో 10,376 గ్రామాలు, ఆంధ్ర ప్రాంతంలో 16,931 గ్రామాలు వున్నాయి 1_4_1969 నాటికి తెలంగాణాలో 1,792 గ్రామాలు, ఆంధ్రలో 3,965 గ్రామాలు విద్యుదీకరించబడ్డాయి. కనుక తెలంగాణాలో 8,584 గ్రామాలు, ఆంధ్రలో 12,966 గ్రామాలు విద్యుదీకరించబడవలసి వున్నాయి. రాష్ట్రంలోని ప్రతి మూలకు విద్యుచ్ఛక్తిని విస్తరింప చేయడంపైనే గ్రామీణ ఆర్థికాభివృద్ధి చాలావరకు ఆధారపడి వున్నది. పారిశ్రామికీకరణకు మాత్రమే కాదు, రాష్ట్రంతో పాటు దేశ పురోభివృద్ధికి అత్యంత ప్రధానమైన వ్యవసాయాభివృద్ధికి, ఆధునికీకరణకు కూడావిద్యుచ్ఛక్తి ఎంతైనా అవసరం. విద్యుత్తు పంపుసెట్ల వల్ల

నమ్మకమైన నీటిపారుదల లభించడం, సేద్యార్హమైన ప్రాంతం అధికం కావడం, పారుదల వ్యయం తగ్గిపోవడం, ఎకరా దిగుబడి పెరగడం, ఆర్థిక రాబడి సులభంగాను, మేలురకంగాను అధిక మవడం వంటి బహుముఖ ప్రయోజనాలు చేకూరగలవని వ్యవసాయదారులు గుర్తించారు.

విద్యుదుత్పాదన, ట్రాన్స్మిషను, పంపిణీ, రెవిన్యూ సేకరణ మున్నగునవి విద్యుచ్ఛక్తి బోర్డుయొక్క ప్రధాన కార్యకలాపాలు. ఉత్పాదనా, ట్రాన్స్మిషను అన్నవి అధికంగా సాంకేతిక స్వభావం గలవైనందున వాటిలో ప్రజలు పాల్గొనేందుకు పెద్దగా అవకాశం లేదు. పంపిణీ, ముఖ్యంగా గ్రామీణ విద్యుదీకరణ రంగంలో ప్రజలు ఎక్కువగా పాల్గొనడానికి బాగా అవకాశం వుంది. గత రెండు మూడు సంవత్సరాలుగా 'శ్రమదానం' ద్వారా ప్రజలు ఇందులో పాల్గొనేటట్లు చేయడానికి బోర్డు తన శక్తి కొలదీ ప్రయత్నిస్తున్నది. ఖర్చుతగ్గింపు చర్యగాను తాము పాల్గొంటున్నామనే ఉద్దేశాన్ని ప్రజలకు కల్గించడానికి గాను 1967_68 లో తొలిసారిగా శ్రమదానం ప్రవేశపెట్టబడింది. శ్రమదానం చేయడమనేది స్వచ్ఛంద ప్రాతిపదికపై వుంటుంది. అది ఈ క్రింది రూపాలలో వుంటుంది.

(ఎ) స్థలం వద్దకు మెటలు, కంకర, ఇసుక, మట్టి ఉచితంగా సరఫరా చేయడం ;

(బి) స్థంభాలు, కండక్టరు మున్నగు సామగ్రిని ఉచితంగా బండ్లపై చేరవేయడం ;

(సి) గోతులు త్రవ్వడం, స్థంభాలు పాతడం, ఇతర పనులకు కూలీలను లభింపచేయడం ;

గ్రామీణ విద్యుదీకరణ కార్యక్రమంకోసం గ్రామస్థుల తీరిక సమయాన్ని వినియోగించుకోవడమే యీ పథకం వెనుక వున్న ఉద్దేశ్యం.

గ్రామీణ విద్యుదీకరణ కార్యక్రమంలో నిపుణతలేని శ్రామిక భాగం 17% వుండగలదని బోర్డు అంచనా వేసింది. సాధారణంగా ఈ మేరకు శ్రమదానం పొందవలసి వుంటుంది. కాని, కొన్ని సందర్భాలలో అది కొంత తక్కువ మేరకు వుండవచ్చును. పథకాల నిర్వహణలో ఈ విషయాన్ని గుర్తుంచుకోవాలని ఫీల్డు ఇంజనీర్లకు సూచనలివ్వడం జరిగింది. ఇది ముఖ్యంగా ప్రజల కార్యక్రమం. ఈ విషయంలో కఠిన వైఖరివల్ల ఫలితాలు చేకూరవు. ఈ అంశాలన్నిటి దృష్ట్యా బోర్డు కొన్ని సూచనలు జారీ చేసింది. వాటి సంగ్రహం ఈ దిగువ యివ్వబడింది.

(ఎ) గ్రామంలో గౌరవపాత్రులూ, స్థితిమంతులూ అయిన ముగ్గురు వ్యక్తుల్ని ఫీల్డు అధికార్లు కలుసుకోవాలి. గ్రామస్థుల ద్వారా శ్రమదానం చేకూర్చగలమని, ఆ విధంగా చేకూర్చలేనప్పుడు అందుకు తగిన నగదును చెల్లించగలమని వారివద్ద హామీ తీసుకోవాలి. శ్రమదానం పరిమితిని డివిజనల్ ఇంజనీర్ నిర్ణయిస్తారు.

(బి) ఆదివాసి ప్రాంతాలలో శ్రమదానం నిర్ణీత శాతం మేరకు లభించాలని పట్టుపట్టకూడదు. శ్రమదానం లభించిన మేరకు ఉపయోగించుకోవాలి. శ్రమదానం లభించక పోయినప్పటికీ పనులు పూర్తి చేయాలి.

(సి) కొన్నిగ్రామాలలో శ్రమదానానికి ప్రజలు అంగీకరించక పోవచ్చును. అయితే శ్రమదానానికి సరిపడిన నగదు చెల్లించడానికి వారు అంగీకరించవచ్చును. అట్టి సందర్భాల్లో నగదు చెల్లింపును అంగీకరించాలి. సాధారణంగా శ్రమదానాన్ని శ్రమ సామగ్రి రూపంలోనో; కొంతభాగం శ్రమ, సామగ్రి కొంతభాగం నగదు రూపంలోనో, పూర్తిగా నగదు రూపంలోనో పొందవచ్చును. ఇది ప్రజల ఇష్టంమీద ఆధారపడి ఉంది.

(డి) ఆర్. సి. సి. స్థంభాలు తయారుచేయడానికి కంకర, ఇసుకను బండ్లపై చేరవేయడం శ్రమదానం క్రిందికి రాదు.

(ఇ) దూర ప్రాంతాలకు సామగ్రిని చేరవేయవలసిందిగా ప్రజలను కోరకూడదు. అదేవిధంగా చాలాదూరంవరకు 11 కె.వి. లైనులు వేయడానికి శ్రమదానాన్ని ఉపయోగించాలనే ఉద్దేశం కూడదు. శ్రమదానంద్వారా 5 మైళ్ళకన్న ఎక్కువ దూరానికి సామగ్రిని రవాణా చేయించకూడదు. చాలా దూరానికి సామగ్రిని రవాణా చేయదలచివస్తే ఆ సామగ్రిని ఒక వీలైన ప్రదేశానికి చేర్చాలి. ఇది గ్రామంనుండి 5 మైళ్ళ లోపుగా ఉండాలి. అక్కడి నుండి అవసరమైన స్థలానికి వాటిని చేరవేయవలసిందిగా గ్రామీణులను కోరవచ్చును. అదేవిధంగా గ్రామంనుండి 5 మైళ్ళ కన్న ఎక్కువ దూరం వరకు లైనులు వేయడానికి శ్రమదానాన్ని ఉపయోగించరాదు.

(ఎఫ్) విద్యుదీకరణ జరిగిన గ్రామాలలో కొద్దిపాటి విస్తరణ పనులకు తప్ప, కార్యక్రమం రూపొందించినా లేకున్నా అన్ని గ్రామాలనుండి శ్రమదానం పొందాలి. డిపాజిటు, లేక అప్పు విరాళం పథకం క్రింద చేపట్టిన కొత్త గ్రామాలలో గోతులు త్రవ్వడం, సామగ్రి చేరవేయడం వరకే శ్రమదానం పరిమితం కావాలి.

(జి) సాధారణంగా పథకాల గిట్టుబాటును లెక్కించేటప్పుడు ఈ శ్రమదానం విలువ చేరదు. శ్రమదానానికి నగదు రూపంలో చెల్లింపు జరిగి, పథకం పెట్టుబడి ఖర్చులో నుంచి ఆ మొత్తాన్ని తగ్గించినప్పుడు ఆ పథకం లాభదాయకమైనది అయినట్లయితే, ఆ పథకపు పెట్టుబడి ఖర్చులోనుంచి శ్రమదాన భాగాన్ని మినహాయించవచ్చును.

ఇటీవల సంభవించిన తుఫాను వల్ల, ఆ ప్రాంతాలలోని చాలామంది రైతుల పంపుసెట్లు కొట్టుకొనిపోయాయి. బోర్డుకు రాబడి తగ్గిపోయినప్పటికీ తుఫానువల్ల నష్టపోయిన ప్రాంతాలలోని వ్యవసాయదారులకు తోడ్పడే వుద్దేశంతో పంపుసెట్లు కొట్టుకొనిపోయిన తేదీనుండి తిరిగి కనెక్షను ఇచ్చేవరకూ వారు కనీస ఛార్జీలను చెల్లించనవసరంలేకుండా మినహాయింపునిస్తూ బోర్డు ఉత్తరువు జారీ చేసింది.

ఢిల్లీ కేంద్రపాలిత ప్రాంతంలో వుంది. ఈ కంపెనీ ప్రధానాశయాలు :

(i) దేశంలోని గ్రామీణ విద్యుదీకరణ పథకాలకు ఆర్థిక సహాయం అందిజేయడం.

(ii) రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డులు జారీచేసే ప్రత్యేక గ్రామీణ విద్యుదీకరణ బాండ్లను నిర్ణీత షరతులపై తీసుకోవడం.

(iii) దేశంలోని గ్రామీణ విద్యుచ్ఛక్తి సహకార సంఘాలను పెంపొందించడం, వాటికి ఆర్థిక సహాయం చేయడం.

(iv) దేశంలో గ్రామీణ విద్యుదీకరణకోసం గ్రాంట్ల రూపంలోనో ఇతర విధంగానో కేంద్ర ప్రభుత్వం నుంచీ ఇతర వనరుల నుంచీ అందిన పైకాన్ని నిర్వహించడం.

దేశంలోని గ్రామీణ విద్యుదీకరణ పథకాలకు ఆర్థిక సహాయం చేయడం కోసం — పి. ఎల్. 480 నిధుల నుండి 105 కోట్లు, కేంద్ర బడ్జెటు నుండి 45 కోట్లు మొత్తం 150 కోట్లు గ్రామీణ విద్యుదీకరణ కార్పొరేషను (ప్రయివేటు, లిమిటెడుకు సమకూర్చబడతాయి. ఆంధ్రప్రదేశ విద్యుచ్ఛక్తి బోర్డు ఇదివరకే 20 పథకాలను రూపొందించింది. గ్రామీణ విద్యుదీకరణ కార్పొరేషను ప్రయివేటు లిమిటెడు వారు బోర్డు కోరిన సహాయాన్ని మంజూరు చేసే యెడల రాష్ట్రంలో అనుకున్న ఇరవై పథకాలు చేపట్టబడతాయి.

గ్రామీణ విద్యుదీకరణ పథకాలకు ముఖ్యంగా పంపు సెట్ల విద్యుదీకరణకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వబడుతున్నది. గ్రామీణ విద్యుదీకరణ పథకం మూలంగా విద్యుచ్ఛక్తి బోర్డుకు నష్టం కలుగుతున్నప్పటికీ, అందుబాటులో వున్న నిధులతోటే గ్రామీణ విద్యుదీకరణను త్వరితం చేయడం జరుగుతున్నది. ప్రతి సంవత్సరం విద్యుదీకరణ చేయబడే పంపుసెట్ల సంఖ్య ఏటేటా ఎక్కువ అవుతున్నదని తెల్పటానికి సంతసిస్తున్నాము. 1969_70 లో విద్యుదీకరణ చేయబోయే పంపు సెట్ల సంఖ్య బహుశా 40,600 దాకా వుండగలదు. 1969_70లో విద్యుదీకరణ పథకానికి సంబంధించి తెలంగాణ ప్రత్యేక అభివృద్ధి పథకంక్రింద తెలంగాణాలో కొత్తగా విద్యుదీకరణ కానున్న 360 గ్రామాలు కాకుండా మామూలు ప్రణాళిక క్రింద పని మిగిలివున్న 837 గ్రామాలు, కొత్తగా 857 గ్రామాలు విద్యుదీకరణ చేయటానికి ఉద్దేశించబడింది. లోగడ పని ప్రారంభించబడిన గ్రామాలను 1970_71 లో విద్యుదీకరించబడతాయి. నాలవ ప్రణాళికలో పంపిణీ పథకం గ్రామీణ విద్యుదీకరణ కోసం 1970_71 లో బోర్డు బడ్జెటులో రూ. 700.00 లక్షలు కేటాయించబడింది.

## కొత్త పథకాలు

నాగార్జునసాగర్ పంపు స్టోరేజి, జల విద్యుచ్ఛక్తి పథకం: — స్థాపిత శక్తిని అధికం చేయడం కోసం ముసాయదా ప్రణాళికలో ప్రతిపాదించిన పథకాలలో ఇది ఒకటి. రివర్సబుల్ లక్షణాలు కలిగి తగు పంపు స్టోరేజి నిర్వహణ శక్తిగల టర్బయిన్‌తో 50 మెగావాట్ల హైడల్ జనరేటింగు యూనిట్లు రెండింటి స్థాపనకు ఈ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకానికి రూ. 676 లక్షలు అవుతుందని నికరంగా అంచనా వేయబడింది. ఈ పథకానికి కేంద్రంనుండి ఆమోదం రావలసి వున్నది. ఆమోదం వచ్చేలోగా 1970_71 బోర్డు బడ్జెటు అంచనాలో ఈ పథకంకోసం లాంఛనంగా ఒక లక్ష కేటాయించబడింది.

## విద్యుచ్ఛక్తి బోర్డుకు రుణాలు

1970_71 లో రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్ర విద్యుచ్ఛక్తి బోర్డుకు రూ. 9.80 కోట్ల మేరకు ఋణం యివ్వడానికీ, బోర్డు మార్కెటులో రుణం సేకరించేందుకు అనుమతి యివ్వటానికీ ఉద్దేశిస్తున్నది.

1969_70 లో సరిపడినంతగా విద్యుచ్ఛక్తి లభ్యమైనందున ఈ ఏడాది పరిస్థితి తృప్తికరంగా వున్నది. లోడును నానాటికి అధికం చేయడం జరుగుతున్నది. కొత్త సర్వీసులకు కనెక్షను ఇచ్చేపని ముమ్మరంగా కొనసాగటానికీ జనరేటింగు స్టేషనుల నుంచి వినియోగ కేంద్రాలకు చాలినంత విద్యుచ్ఛక్తి సరఫరా చేసేందుకూ, ఆ తర్వాత సదరు కేంద్రాలనుంచి ముఖ్యంగా గ్రామాలలోని అధిక సంఖ్యాకులైన వినియోగదార్లకు విద్యుచ్ఛక్తి అందడం కోసం నిర్మాణంలోవున్న ట్రాన్స్మిషన్ లైన్లపనిని పూర్తి చేయటానికీ బోర్డు తన కృషిని కేంద్రీకరించింది. వ్యవసాయదార్లనుండి ధనం, సామగ్రి, శ్రమదానం రూపంలో తగినంత సహాయం లభిస్తేనే తప్ప ఈ పథకాన్ని ద్విగుణీకృతం చేయటానికి వీలులేదు. బోర్డు చేపట్టిన పథకాలు సాధ్యమైనంత ఎక్కువ ఫలితాన్ని ఇచ్చేటందుకు ఆర్థికంగా బోర్డు స్వయంపోషకం అయ్యేవిధంగా తృప్తికరమైన ప్రగతి సాధించేందుకు అవసరమైనంత శ్రద్ధ తీసుకోబడింది.






## సాహిత్యం

### మకరంద మాధుర్యాలు

తెలుగు సీమను తమ పావన సలిల ధారలతో పవిత్రం చేస్తున్న గోదావరి, కృష్ణ, తుంగభద్ర, మంజీర వంటి నదీ తరంగాల మంజుల సంగీత రవాల్లో మహోజ్జ్వలమైన మన ప్రాచీన చరిత్ర ప్రతిధ్వనిస్తున్నది. వేదాల్లో, రామాయణ, భారతాల్లో మన ప్రసక్తి విన్పిస్తున్నది. రెండువేల సంవత్సరాల క్రిందటి ఆంధ్రుల బలపరాక్రమాలు. సంపర గ్రీకు చరిత్రకారుడు మెగస్తనీసు వ్రాతల్లో యీ నాటికీ మనకు ఉత్తేజాన్ని కల్గిస్తున్నవి. కాకతీయ రుద్రమదేవి కాలంలో తెలుగు దేశాన్ని దర్శించి ముగ్ధుడైపోయిన వెనిసు యాత్రికుడు మార్కోపోలో వ్రాసిన వ్రాతల్ని మనం మరచిపోలేం. మందార మకరంద మాధుర్యం కంటే తియ్యనైన మన మాతృభాష తెలుగును తలచుకుంటే మనకు తన్మయత్వం కలుగుతుంది. ఈ తన్మయత్వం మనకే గాదు; డాక్టర్ కారే, డాక్టర్ కాంప్‌బెల్, డాక్టర్ కాల్‌వెల్, హెన్రీ మారిస్ వంటి ప్రపంచప్రసిద్ధ పండితులు, భాషాశాస్త్రవేత్తలు ఆధునిక కాలపు మహామేధావీ శాస్త్రజ్ఞుడూ అయిన జె. బి. ఎస్. హాల్డేన్ వంటివారు గూడా మన తెలుగు భాష అందాలను చూసి ముగ్ధులైపోయారు. ప్రతి భాష ఒక దేవాలయమనీ, అందులో ఆ భాష మాట్లాడేవారి ఆత్మ సాక్షాత్కరిస్తుందనీ ఇంగ్లీషులో ఆణిముత్యం వంటి ఒక సూక్తి ఉన్నది. మన తెలుగు భాషకు ఇది అక్షరాలా వర్తిస్తుంది. నన్నయ నుండి నేటివరకు సుందర స్వరూపంతో పెంపొందిన మన సాహిత్యమే యిందుకు తగిన సాక్ష్యం.

నన్నయ ఆంధ్రీకరించిన రెండున్నర పర్వాల భారతమే మనకు గ్రంథరూపంలో దొరికిన మొట్టమొదటి తెలుగు రచన. అంతకు అనేక సంవత్సరాల ముందటి శాసనాల్లో తెలుగు పద్యాలు కన్పిస్తున్నవి. అయితే నన్నయతోనే తెలుగులో గ్రంథరూపంలో అందమైన రచనకు ఆవిష్కరణ జరిగింది. అందువల్లనే నన్నయ మన ఆదికవి. నన్నయ తరువాత 12వ శతాబ్ది ఆరంభంలో మనకు మరొక చక్కని రచన లభ్యమైంది; ఇది నన్నెచోడుడు రచించిన కుమార సంభవం. కుమార సంభవాన్ని మన మొట్టమొదటి ప్రబంధంగా పేర్కొనవచ్చు. ఇందులో తెలుగు పలుకుబళ్ళు చాలా ఎక్కువ. నన్నెచోడుని తరువాత వచ్చినవాడు మల్లికార్జున పండితారాధ్యుడు; శివభక్తి పూరితాలైన పండితారాధ్యుని రచనలు తరువాతి కాలపు శివకవులకు ఆవేశాన్ని కల్గించినవి. నన్నయ ప్రారంభించిన భారతాంధ్రీకరణాన్ని చేపట్టి 13వ శతాబ్దంలో తిక్కన మహాకవి పదిహేను పర్వాలు పూరించాడు. నన్నయ పూర్తిచేయకుండా వదలిన అరణ్యపర్వంలోని కొంతభాగాన్ని పద్నాలుగో శతాబ్దంలో ఎఱ్ఱాప్రగడ పూర్తిచేశాడు. ఆంధ్ర భాషలో, సాహిత్యంలో ఈ కవిత్రయంవారి స్థానాన్ని గూర్చి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు. మన భాషలోని మహానిధి ఈ ఆంధ్రమహాభారతం. పద్నాలుగో శతాబ్దం నాటిదే మరొక మంచి కావ్యం—నాచన సోముని ఉత్తర హరివంశం.

### సాలంకృత సాహిత్య సుందరి

శ్రీనాథ కవి సార్వభౌమునితో తెలుగు సాహిత్యరంగంలో కావ్యయుగం మొదలైంది. మన సాహిత్యరంగంలోని మొట్టమొదటి జంటకవులు నంది మల్లయ, ఘంట సింగన. ఈ కవులు పదిహేనవ శతాబ్దంవారు. పదహారవ శతాబ్ది ప్రారంభంతో, ఆంధ్రభోజుడు శ్రీకృష్ణదేవరాయల ప్రవేశంతో తెలుగు సాహిత్య సీమలో ప్రబంధాల మందమారుతాలు వీచసాగినవి; ఈ ప్రబంధ యుగంలో తెలుగుభాషా వధూటి సాలంకృత సాహిత్య సుందరిగా శోభించింది. అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన, పింగళి సూరన, తెనాలి రామకృష్ణుని వంటి అష్టదిగ్గజాలు అడ్డు లేకుండా సంచరించిన కాలం ఇది. ఈ ఉద్ధతుల కాలంలోనే రామాయణాన్ని రచించి రాజిల్లినది కవయిత్రి ఆతుకూరి మొల్ల; భక్తిగేయాలను వ్రాసి పదకవితకు పితామహుడుగా పేరొందినవాడు తాళ్ళపాక అన్నమాచార్యుడు. తరువాత పదిహేడవ శతాబ్దంలో తంజావూరి రఘునాథ



కల్లూరి సుబ్బారావు

రాయల కాలంలోగూడా తెలుగు క్రొత్తసొగసుల్ని విరజిమ్మింది. రఘునాథుడు స్వయంగా కవి; ఆయన ఆస్థానంలోని చేమకూర వెంకట కవి, ముద్దుపళని. రంగాజమ్మ ప్రత్యేకంగా గణించ వలసినవారు; వీరు తెలుగు సాహిత్య పిపాసువులందరికి చవులూరించేవారు. ఇటు తరువాత వచ్చినవారే మన క్షేత్రయ్య త్యాగయ్య. సంగీత సాహిత్యాలను సమానంగా పంచిపెట్టిన వీరికృషి తెలుగువారికి గర్వకారణం. చక్కని తెలుగు నుడికారం ఆటతో వెలదుల్ని అలంకరించి మనను ముగ్ధుల్ని చేస్తున్న మహాకవి వేమన పద్నెనిమిదవ శతాబ్దంవాడు. ఉద్దండులు వైతాళికులు అయిన కందుకూరి, గురజాడ, గిడుగువంటి వారల రాకతో పందొమ్మిదవ శతాబ్దంలో మన సాహిత్యరంగాన పునరుజ్జీవనం కలిగింది; అపూర్వమైన చైతన్యం వెల్లివిరిసింది: ఆధునికత్వం అంకురించింది. ఇదే నూతన వికాసం మన సాంస్కృతిక. సామాజిక రంగాల్లో సైతం ప్రస్ఫుటంగా ప్రతిబింబించింది. దామెర్ల రామారావు, అడవి బాపిరాజుల వంటి చిత్రకారులూ బళ్ళారి రాఘవ, హరిప్రసాదరావు వంటి నటులూ, ఆదిభట్ల నారాయణదాసువంటి కవి. రచయిత. హరికథా కథనంలో అపార ప్రతిభ చూపిన కళోపాసకుడూ; ద్వారం వెంకటస్వామి నాయుడు, హరినాగభూషణం వంటి సంగీత కళాకోవిదులూ; కాశీనాథుని నాగేశ్వరరావు, కల్లూరి సుబ్బారావు వంటి కళాప్రియులూ, రాజకీయవేత్తలూ, డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ కట్టమంచి రామలింగారెడ్డి వంటి సాహితీతత్వవేత్తలూ రాజా బహదూర్ వెంకట రామారెడ్డి వంటి విద్యాప్రియులూ, తెలుగు దేశంలో సాంస్కృతిక వికాసానికి ఎనలేని సేవచేశారు.

## వేనేలాఠికే తెలంగాణం

ఆంధ్ర భాషామతల్లికి తెలంగాణం యెన్నో సాహిత్య ప్రసూనాలను సమర్పించింది. తెలుగు సాహిత్యంలో ఉత్తమోత్తమమయిన గ్రంథాలు మూడు; యివి భారతము భాగవతము, రామాయణము. ఈ "బహుళాంధ్రోక్తిమయ ప్రపంచ మహనీయ స్థితికిమూలమై నిలచిన" తిక్కనామాత్యుడు ఓరుగల్లు నగరంలో, గణపతిదేవ చక్రవర్తి ఆస్థానంలో తన మహాభారతాన్ని ఆవిష్కరింప చేశాడు. భాస్కర రామాయణకర్తలయిన భాస్కరుడు, మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుడు, అయ్యలార్యుడు తెలంగాణం వారు. తెలుగుతల్లి నోముల పంటగా తెలంగాణంలో జన్మించిన పోతన భాగవతామృతాన్ని పంచాడు. మార్కండేయ పురాణాన్ని వ్రాసిన మారన, ఓరుగల్లును ఆంధ్రనగరం అని మొట్టమొదట సంబోధించిన విద్యానాథ మహాకవి తెలంగాణా తేనె మాగాణంలో పుట్టినవారు. కదన రంగంలోను కళారంగంలోను సమానప్రతిభ గలిగిన జాయపసేనాని కాకతీయుల కొలువులో నృత్తరత్నాకరం రచించాడు. సర్వజ్ఞసింగభూపాలుడు సంగీత శాస్త్ర గ్రంథాలనేగాక రత్నపాంచాలిక అనే నాటకాన్ని గూడా తెలుగు సరస్వతికి అందించాడు. సుమతి శతకాన్నీ, నీతిశాస్త్రముక్తావళినీ రచించిన భద్ర భూపాలుడు తెలంగాణంలోని మరొక సేనానాయకుడు. కాకతీయ ప్రభువు రుద్రదేవుడు నీతిసారం అనే గ్రంథాన్ని వ్రాసినట్లు చరిత్ర వెల్లడి చేస్తున్నది. "ఉరుతర గద్య పద్యోక్తుల కంటె సరసమై పరగిన జాను తెనుంగు చర్చింపగా సర్వసామాన్య మగుట, గూర్చెద ద్విపదలు గోర్కిదైవార;" అని ప్రకటించి



సురవరం ప్రతాపరెడ్డి

బసవ పురాణం వ్రాసిన పాల్కురికి సోమనాథుడు ఓరుగల్లు మండలంవాడు. సామాన్య ప్రజలకు అందుబాటులో ఉండే ఛందస్సులో, జానుతెనుగు భాషలో గ్రంథరచన కావించి, సాహిత్యం సామాన్య ప్రజానీకానికి అందుబాటులో ఉండవలెనన్న విశిష్టమైన సిద్ధాంతాన్ని పాల్కురికి ప్రతిపాదించాడు. నిజానికి పాల్కురికి సోమనాథుడే మన మొట్టమొదటి ప్రజాకవి ఈ ప్రాంతంలో పాల్కురికి సోమనాథుని తరువాత చెప్పవలసిన శివకవులు యింకా యెందరో ఉన్నారు. ముముక్షుజనకల్పకము, యతిరాజ వింశతి, తత్వార్థ దర్పణము మొదలైన వైష్ణవ మత ప్రతిపాదక గ్రంథాలుగూడా తెలంగాణంలో విరచితమైనవి. మేలుకొలుపులు, మంగళహారతులు అసంఖ్యాకంగా వ్రాసిన వైష్ణవకవులు ఎందరో యిక్కడివారు. సుమారుగా క్రీ. శ. 600 ప్రాంతాన ఏకామ్రనాథుని లేఖిని నుండి 'ప్రతాపచరిత్రము' అనే వచనగ్రంథం వెలువడింది. కేసన, మల్లన కవులు గూడా వచన గ్రంథాలను వ్రాశారు.

## ఆరిపోని తెలుగు దీపం

తెలుగు వచనవాఙ్మయ నిర్మాణానికి ప్రథమ ప్రయత్నం తెలంగాణంలో జరిగింది. మొట్టమొదటి అచ్చతెలుగు కావ్యం



బళ్లారి రాఘవాచార్యులు



దాశరథి రామారావు

యయాతిచరిత్ర ; ఈ కావ్యం రచించిన పొన్నికంటి తెలగన్న తెలంగాణంవాడు ; గోలకొండరాజుల కాలంలో మెప్పులు పొందినవాడు కందుకూరి రుద్రకవి గూడా కుతుబ్షాహీల కాలంవాడే. రామదాసు (కంచర్లగోపన్న) రామకీర్తనలు తెలుగు వారికి సుపరిచితం. తెలంగాణంలోని వేములవాడకు చెందిన భీమకవిని గురించి తెలియని వారుండరు. తెలుగులో అత్యుత్తమమైన వేదాంతకావ్యం 'సీతారామాంజనేయము' తెలుగు వాఙ్మయానికి ఈ గ్రంథం తలమానికం అని చెప్పవచ్చు. ఈ గ్రంథకర్త పరశువమపంతుల లింగమూర్తి తెలంగాణం వాడు. తెలుగు సాహిత్యానికి పోషణ దొరకని గడురోజులలో గూడా తెలంగాణాలో సాహిత్యదీపం ఆరిపోలేదు. తెలుగు సాహిత్యదీపాన్ని ఆరిపోకుండా కాపాడిన గౌరవం వివిధ గ్రామాలలో నివసించి అజ్ఞాత సేవ చేసిన అనేక కవి పండితులకు చెందుతున్నది. తెలంగాణంలోని యే గ్రామానికి వెళ్లినా, తెలుగు సాహిత్యానికి ప్రతిబింబాలయిన తాళపత్ర గ్రంథాలు మనకు పుష్కలంగా దొరుకగలవని స్వర్గీయ దూపాటి వెంకట రమణాచార్యులవారు అనేకసభలలో ఉదాటించారు. తెలంగాణంలో అడుగడుగున, అణువణువున మహోఖ్యాతమైన తెలుగు చరిత్ర, తెలుగు సంస్కృతి ప్రతిధ్వనులు వినిపించగల వంటే ఎంత మాత్రం అతిశయోక్తి కాదు.

(సశేషం).



# వరంగల్లు జిల్లాలో కొత్త పరిశ్రమలు స్థాపించడానికిగల అవకాశాలు

## I. సైకిలు విడిభాగాలు, తదితర సహాయక పరికరాలు :

1. సైకిలు సీట్లతోసహా సైకిలు విడిభాగాలు, తదితర సహాయక పరికరాలు వరంగల్లు జిల్లాలో ఏటా 5 లక్షల రూపాయల విలువ మేరకు అవసరమౌతాయి. 1956_58 మధ్యకాలంలో 10 నుంచి 15 శాతం వరకు వీటి అమ్మకాలు పెరిగాయి.

2. ప్రస్తుతం యీ వస్తువులను తయారుచేసే యూనిటు ఏదీ వరంగల్లు జిల్లాలో లేదు. అన్ని సైకిల్ విడిభాగాల్నీ, పరికరాల్నీ బయటినించే తెప్పించుకోవడం జరుగుతోంది

3 ఇక్కడ నిపుణులైన పనివారు ఎక్కువగానే లభిస్తారు. కొత్తగా ఒక యూనిటును నెలకొల్పితే మార్కెటులో వున్న గిరాకీదృష్ట్యా లాభసాటిగా వుంటుంది.

4. పరిశ్రమల శాఖ సిఫార్సుల మేరకు ఇనుము, ఉక్కు కంట్రోలర్ యిచ్చే పర్మిట్లకోటా ద్వారా ఇనుము, ఉక్కు, టిన్ను ప్లేట్లు మొదలైనవి పొందవచ్చు. సైకిలు సీట్లకు కావలసిన క్రోము, తోలు మద్రాసునుంచిగాని, కలకత్తా నుంచిగాని తెప్పించుకోవచ్చు.

5. ఈ పరిశ్రమ స్థాపనకు పారిశ్రామిక వాడలో తగు వసతి కూడా వుంది.

6. అద్దె_కొనుగోలు పద్ధతిన మీకు కావలసిన యంత్రాలను జాతీయ లఘు పరిశ్రమలసంస్థ అందజేస్తుంది. హైదరాబాదులోని లఘు పరిశ్రమల సేవాసంస్థ మీకు కావలసిన సాంకేతిక సహాయాన్ని అందజేస్తుంది.

## II. కలప కోత–పదును యూనిటు, వడ్రంగం యూనిటు :

1. వరంగల్లు జిల్లాలో 3,26,387 ఎకరాలమేరకు అడవులున్నాయి. ఇంత విస్తారంగావున్న యిక్కడి అడవుల్లో ప్రధానంగా టేకు, ఇప్ప, నల్లమద్ది, వెదురు, బిల్లుమాను, సండ్ర చెట్లుపెరుగుతాయి.

2. ఈ రకాలన్నిటిపీ కలుపుకుని 1957_58లో 1,50,000 చ. అడుగుల కలప, 3,30,000 వెదురుగడలు దిగుబడి అయ్యాయి.

3. ప్రస్తుతం యిక్కడ లభిస్తున్న కలపలో 10 శాతం మాత్రమే యీ జిల్లాలో వుపయోగించ బడుతోంది. 50 శాతం వెదురు, కలప బయటికి ఎగుమతి చేయబడుతోంది.

4. తిరుమాను, కుషరకాలను విద్యుచ్ఛక్తిని తీసుకుపోయే స్తంభాలుగా వాడవచ్చు.

5. ఈ జిల్లాలో విస్తారంగా కలప లభిస్తున్న దృష్ట్యా దీనిని పారిశ్రామిక అవసరాలకు వినియోగించుకోడానికి అవకాశాలు విస్తారంగావున్నాయి.

6. ఇటీవలి కాలంలో యిళ్ళ నిర్మాణం బాగా ఎక్కువ అయినందు వల్ల తలుపులు, కిటికీలు తయారు చేసే వడ్రంగం విభాగాలను, కలపకోత_పదును యూనిట్లను ఏర్పాటు చేసుకోవచ్చు. మనిషి జీవన స్థితిగతులు మెరుగు పడిన దృష్ట్యా అతనికి అవసరమయ్యే గృహపరికరాలు, ఫర్నీచరు మొదలైన వాటి గిరాకీ కూడా పెరిగింది. అందువల్ల ఇటువంటి ఫర్నీచర్‌ను తయారుచేసే యూనిట్లు అధిక సంఖ్యలో నెలకొల్పుకోడానికి మంచి అవకాశాలు వున్నాయి.

## III. వ్యవసాయ పనిముట్లు గృహనిర్మాణంలో వాడే ఇనుప పరికరాలు :

1 వరంగల్లు జిల్లాలో యీ పనిముట్లకు, పరికరాలకు గిరాకీ బాగావుంది.

2 వ్యవసాయ పనిముట్లకు ఏటా 15 శాతం చొప్పునా, గృహనిర్మాణంలో వుపయోగించే ఇనుప పరికరాలకు ఏటా 10 శాతం చొప్పునా గిరాకీ పెరగొచ్చునని భావిస్తున్నారు.

3. ఈ జిల్లాకు కావలసిన వ్యవసాయ పనిముట్లలో 20 శాతం పైగానూ, భవన నిర్మాణంలో వుపయోగించే యినుప పరికరాలలో 67 శాతం మేరకూ ఇతర జిల్లాలనుంచి ప్రస్తుతం దిగుమతి చేసుకోవడమౌతున్నది.

4 మేలురకం వ్యవసాయ పనిముట్లను, తేలికరకం ట్రాక్టర్ విడిభాగాలను తయారుచేసే యూనిట్లను నెలకొల్పుకోడానికి యిక్కడ మంచి అవకాశాలు వున్నాయి.

## IV. మామూలు ఇంజనీరింగ్ పరికరాలు :

హల్లర్, ఎక్స్‌పెల్లర్ వంటి విడిభాగాలకు యీ జిల్లాలో మంచి గిరాకీవుంది. ఇక్కడ 68 బియ్యపుమిల్లులు, నూనెమిల్లులు వున్నాయి. వీటికి ఏటా 4 లక్షల రూపాయల విలువమేరకు విడిభాగాలు కావలసివుంటాయి.

2. వ్యవసాయానికి వుపయోగించే పంపుసెట్లకు, కార్లు, మోటారుసైకిళ్ళు మొదలైనవాటికి మరమ్మత్తు పనులు ఎక్కువగా చేయవలసి వుంటుంది గనుక వీటి విడిభాగాల గిరాకీ ఎక్కువ.

3. సాధారణంగా యీ జిల్లాలోనే నిపుణులైన పనివారు లభిస్తారు. లేదా హైదరాబాదునుంచి అయినా వీరిని తేలికగా రప్పించుకోవచ్చు.

4. లఘు పరిశ్రమలకు ముడి పదార్థాలను అందజేయడంలో ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం వల్ల ముడి పదార్థాలను పొందడంలో ఎదురయ్యే యిబ్బందులను చాలా వరకు అధిగమించవచ్చు.

## V. (ఇనుప) రేకు వస్తువులు :

వరంగల్లు జిల్లాకు 60,000 రూపాయల రేకుపెట్టెలు అవసరంకాగా 60 శాతం మట్టుకే యీ జిల్లాలో తయారవుతున్నాయి. మిగిలిన 40 శాతం పెట్టెలూ ఇతర జిల్లాలనుంచి దిగుమతి చేసుకోవడం జరుగుతోంది.

2. 1956_57లో కన్న 1957_58లో యీ జిల్లాలో ఇనుప పెట్టెల అమ్మకం 10 శాతం పెరిగింది. ముందుముందు జనాభా పెరుగుతున్న దృష్ట్యానూ, ఆదాయం పెరుగుతున్న దృష్ట్యానూ యీ పెట్టెలకు మరింత గిరాకీ ఏర్పడవచ్చు.

3. దేశంలో ఇనుము, ఉక్కు పరిస్థితులు మెరుగుపడడం తోటే బి. పి. షీట్ రేకుల కేటాయింపులను ఎక్కువ చేయడం జరుగుతుంది.

4. ఈ జిల్లా అవసరాలను తీర్చాలంటే ఉత్పత్తి పెరగవలసిన అవసరం చాలా వుంది.

### (బి) బకెట్లు :

1. ఈ జిల్లాకు కావలసిన జి. ఐ. బకెట్లలో దగ్గరదగ్గర 90 శాతం వరకు ఇతర జిల్లాలనుంచే వస్తున్నవి.

2. 1957_58లో యీ జిల్లాకు కావలసివున్న జి. ఐ. బకెట్లు 3,500 డజన్లు. అంటే రూపాయల్లో చెప్పాలంటే 1.2 లక్షలు. ఏటా వీటి గిరాకీ కూడా పెరుగుతోంది. నిజానికి ఇనుప వస్తువులకు దేశంలో గిరాకీ వున్నప్పటికీ యిది తేలిగ్గానే లభ్యమౌతుంది.

3. వరంగల్లులో వీటిని తయారుచేసే యూనిటు ఒక దానిని నెలకొల్పుకొంటే గిరాకీకి తట్టుకోవచ్చు. పోటీకి నిలుస్తుందో నిలువదో అని భయపడ వలసిన అవసరం కూడా లేదు.

4. జి. ఐ. రకం, బి. పి. రకం రేకుల సరఫరా పరిస్థితి మన దేశంలో ముందుముందు మెరుగుపడుతుంది.

5. ప్రాంతీయంగానే నిపుణులైన పనివారు దొరుకుతారు.

### (సి) రివిట్లు :

1. టిన్‌మేన్ రివిట్లు తయారు చేసే యూనిటు ఒక్కటి కూడా వరంగల్లు జిల్లాలో లేదు. వరంగల్లు జిల్లాలోనే కాదు దక్షిణాదినే లేదు.

2. ఒక్క వరంగల్లు జిల్లాలోనే 2½ టన్నులకు పైగా యివి అవసరమౌతాయి. గత రెండేళ్ళుగా 10, 15 శాతం మేరకు వీటి గిరాకీ పెరిగింది.

3. దీనికి అవసరమయ్యే ముడిసరకు_అంటే 6, 7, 8 గేజ్ గల ఇనుప వైరు దేశంలో ఎక్కువగానే దొరుకుతుంది.

4. వీటిని తయారుచేసే పద్ధతి చాలా తేలిక. ప్రత్యేకమైన పనితనం అక్కరలేదు.

## VI. ఇత్తడి పాత్రలు, అల్యూమినియం పాత్రలు

1. సాసర్లు, పెనాలు, పళ్ళాలు, గిన్నెలు, గ్లాసులు మొదలైన గృహపరికరాలను తయారు చేసే యూనిటును ఒక దానిని నెలకొల్పు కోవడానికి యిక్కడ అవకాశం వుంది.

2. డోర్నకల్‌లో యీ యూనిటును ఏర్పాటు చేసుకోవచ్చు.

## VII బేక్‌లైట్ అనుబంధ విద్యుత్ పరికరాలు :

1. బేక్‌లైట్ అనుబంధ విద్యుత్ పరికరాలను, ప్లాస్టిక్ కవరు ఎలక్ట్రికల్ కేబిల్‌లను తయారు చేసే యూనిటు మొత్తం ఆంధ్రప్రదేశ్‌లోనే లేదు.

2. ప్రస్తుతం వరంగల్లు జిల్లాలో యీ పరికరాలకు సుమారు 2 లక్షల రూపాయల విలువ మేరకు గిరాకీవుంది. ముందు ముందు ఏటా 20 శాతం చొప్పున వీటి గిరాకీ కూడా ఎక్కువ కావచ్చు.

3. ఒక్క తెలంగాణా ప్రాంతంలోనే దగ్గర దగ్గర 207 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సౌకర్యం కల్పించాలని భావించారు. అందువల్ల ఈ పరికరాలకు గిరాకీ పెరగవచ్చు.

4. దీనికి కావలసిన ముడి పదార్థాలను బొంబాయినుండి తెప్పించుకోవచ్చు.

## VIII. అగ్గి పెట్టెలు ;

1 మహబూబాబాదు అగ్గిపెట్టెల ఫ్యాక్టరీని పునరుద్ధరించకపోతే 'బి' తరహావీ, 'సి' తరహావీ అగ్గిపెట్టెల ఫ్యాక్టరీలను నెలకొల్పవచ్చు.

2. వరంగల్లు జిల్లాలో 1958 లో 2.5 లక్షల అగ్గిపెట్టెలకు గిరాకీ వుంది.

3. ప్రస్తుతం యితర ప్రాంతాలనుంచి దిగుమతి చేసుకోవడం జరుగుతోంది.

4. ముఖ్యమైన ముడి పదార్థం—చెక్కపొర వరంగల్లులోనే దొరుకుతుంది. ఎందుకంటే యిక్కడ చెక్కపొరని తయారు చేయడానికి ఉద్దేశించిన ఫ్యాక్టరీ ఒకదానికి పరిశ్రమలశాఖ మంజూరీ అప్పుడే లభించింది కూడా.

5. దీనికి కావలసిన రసాయనికాలను హైదరాబాదునుంచి తెచ్చుకోవచ్చు.

## IX. తోలువస్తువుల పరిశ్రమ :

1. తోలు శుద్ధి పరిశ్రమ వరంగల్లు జిల్లాలో ముఖ్యమైన పరిశ్రమ. ప్రస్తుతం యీ జిల్లాలో చర్మాన్ని శుద్ధి చేసే యూనిట్లన్నీ రసాయనికాలు వాడకుండా మామూలు దేశవాళీ పద్ధతుల్లో శుద్ధి చేస్తున్నాయి.

2. తోళ్ళను పదునుపెట్టే యూనిటును ఒక దానిని ఏర్పాటు చేయడానికి యిక్కడ మంచి అవకాశం వుంది.

3. తోళ్ళను పదునుపెట్టే విభాగం ఏర్పాటైనప్పుడు బూట్లు, చెప్పులు, సంచులు, సూట్‌కేసులు బెల్టులు మొదలైన తోలు వస్తువులను తయారుచేసే యూనిట్లను నెలకొల్పుకోవచ్చు.

4. తోళ్ళను పదును పెట్టడంలో అవసరమయ్యే సాంకేతిక సహాయాన్ని హైదరాబాదులోని లఘు పరిశ్రమల సహాయ సంస్థ అందజేస్తుంది.

5. అవసరమైన పనివారలను స్థానికంగానే సంపాదించుకోవచ్చు.

6. పదునుపెట్టిన తోలు వస్తువులకు యీ జిల్లాలో గిరాకీ బాగానేవుంది.

## X. ఇతర పరిశ్రమలు ;

### (అ) చేనేత పరిశ్రమకు సంబంధించిన అనుబంధ పరికరాలు :

1. ఈ పరికరాలను తయారుచేసే యూనిటు ఒక్కటి కూడా యీ జిల్లాలో లేదు.

2. మగ్గాలకు, యితర పరికరాలకు యీ జిల్లాలో గిరాకీ బాగావుంది.

3 చేనేత మగ్గాలకు సంబంధించిన కండెలు. నాడెలు ఆసులు, చరకాలు మొదలైనవి అవసరం వున్నాయి.

4. ఇందుకు కావలసిన పనివారు యీ జిల్లాలోనే లభిస్తారు.

### (ఆ) ఎముకల పొడి, జిగురు తయారీ.

1. వరంగల్లు జిల్లాలో పశు సంపద అపారంగావున్న దృష్ట్యా యీ యూనిట్లను ఏర్పాటు చేసుకోడానికి అవకాశాలు ఎక్కువగా వున్నాయి.

(i) ఎముకల పొడి : ఎముకల్ని పొడిచేసి ఎగుమతి చేయడం మనదేశంలో లాభసాటి పరిశ్రమగావుంది. విదేశాలలో దీనికి మంచి గిరాకీ వుంది. ఈ పొడిని ఎరువుగా వాడవచ్చు. కబేళాలలోనూ, గ్రామాలలో చనిపోయిన పశువులనుండి ఎముకలు లభిస్తాయి. ఎముకల్ని పొడిచేసే యూనిట్లను ఈ జిల్లాలోని వివిధ ప్రాంతాలలో నెలకొల్పుకోవచ్చు.

(ii) జిగురు : చర్మకార పరిశ్రమలో మిగిలిపోయిన పదార్థాలనుండి జిగురును తయారు చేయవచ్చు. తోళ్ళను శుద్ధిచేసే ప్రాంతాలలో జిగురు తయారుచేసే కేంద్రాలను నెలకొల్పుకోవచ్చు.

కవర్లు, అట్ట పెట్టెల తయారీ, పుస్తకాల బైండింగుపనుల్లో దీనిని వాడుకోవచ్చు. బట్టల మిల్లుల్లోకూడా దీనిని వాడతారు. దూదితో చేసే వస్తువులను బింకంగా ఉంచడానికి యిది తోడ్పడు

తుంది అగ్గిపెట్టె తయారీలోకూడా యిది ఉపయోగింప బడుతుంది:

(ఇ) పైప్ ఫౌండ్రీ :

1. దీనికిగల గిరాకీ దృష్ట్యా ఒక యూనిటును నెలకొల్ప డానికి అవకాశంవుంది.

2. ప్రస్తుతం చాలావరకు పైప్‌లు బయటినుంచే వస్తున్నాయి.

3. సీసం, రాగి ప్లేట్లు, సల్ఫ్యూరిక్ ఏసిడ్, సిల్వర్ నైట్రేట్, పొటాషియం అయోడైడ్ — ఇవి ఈ పరిశ్రమకు అవసరమయ్యే ముఖ్యమైన ముడి పదార్థాలు.

(ఈ) టైర్ రీట్రేడింగ్ :

1. ఇటువంటి యూనిటు ఒక్కటికూడా వరంగల్లు జిల్లాలో లేదు.

2. వరంగల్లు జిల్లాలో సుమారు 1,500 లారీలు, కారులు వున్నాయి. సగటున నెలకు 50 టైర్లను రీట్రేడింగు చేయవలసి వుంటుంది.

3. ఇందుకు అవసరమైన నిపుణులు యీ జిల్లాలోనే లభిసారు.

(ఉ) పలకలు, బలపాలు :

1. పలక రాయి ములుగు తాలూకాలోని రాయనగూడాలోనూ, మహబూబ్ నగర్ తాలూకాలోని బలపలూరులోనూ దొరుకుతుంది.

2. పరిశ్రమలు—వాణిజ్య శాఖ, లఘుపరిశ్రమల సహాయ సంస్థలనుంచి సేకరించిన సమాచారాన్నిబట్టిచూస్తే ఈ రెండు ప్రాంతాల్లోనూ దొరికే పలకరాయి, పలకలు తయారుచేయడానికి చాలా అనువైనదిగా తేలింది.

ఇక్కడ లభించే పలకరాయి కర్నూలు జిల్లాలోవి మార్కాపురంలో దొరికే పలకరాయి లాంటిది. మార్కాపురం పలకరాయే యిప్పుడు ఆంధ్రప్రదేశ్ అంతటికీ ఎగుమతి అవుతున్నది.

3. గ్రామీణ ప్రాంతాలలో విద్యా సౌకర్యాలు పెరగడంతో పలకలు, బలపాలకు, రోజురోజుకు మంచి గిరాకీ పెరుగుతున్నది.

(ఊ) కాచు తయారీ :

1. కాచు తయారీ చేయడానికి ప్రధానమైన ముడి పదార్థము సండ్ర కలప. ఇది ములుగు, ఏటూరు నాగారం ఫారెస్టు రేంజిలలో లభిస్తుంది.

2 ఉత్తర భారత దేశంలోనూ, మధ్య భారత దేశంలోనూ దీనికి గిరాకీ ఎక్కువ.

3. దేరాడూన్‌లోని అటవీ పరిశోధనా సంస్థనుండి దీనికి అవసరమైన శిక్షణను, పరిజ్ఞానాన్ని పొందవచ్చు.

4. చెల్వాయ్, ములుగు అటవీ ప్రాంతాలలో ఒక యూనిటును ఏర్పాటు చేసుకోవచ్చు.

(ఋ) పాలిథిన్ ఫిల్మ్, ట్యూబుల తయారీ :

ఇటీవలికాలంలో వినియోగదారుల వస్తువులను పేక్ చెయ్యడానికి పాలిథిన్ షీట్లు బాగా వాడుకలోకి రావడంతో యీ వస్తువులకు గిరాకీ పెరిగింది. పాలిథిన్ ఫిల్మ్, ట్యూబులను తయారు చేయడానికి అవసరమయ్యే పాలిథిన్ పలుకులు యిప్పుడు ప్రాంతీయంగానే తయారుచేసుకోబడుతున్నాయి. పాలిథిన్ పలుకుల్ని సన్నటి పొరలగానూ, గొట్టాలగానూమార్చే థర్మో ప్లాస్టిక్ ఎక్స్‌ట్రూడర్లుకూడా దేశంలోనే తయారు చేయబడుతున్నాయి. ముడి పదార్థాలు తేలికగా లభిస్తున్న దృష్ట్యా ఒక యూనిటును పాలిథిన్ సంచులు,ట్యూబులు తయారుచేసేందుకు ఈ జిల్లాలోనెలకొల్పవచ్చు.

(ౠ) సంగీత వాద్యాలు :

1. సంగీత వాద్యాలను తయారుచేసే కేంద్రాలు ఆంధ్రప్రదేశ్‌లో చాలా తక్కువగా వున్నాయి.

2. క్లారినెట్, నాదస్వరం, బేండ్ మొదలైనవాటికి గిరాకీ బాగా వుంది. వీటిని ఎగుమతి చేయవచ్చుకూడా.

3. ఈ ప్రాంతంలోనే నిపుణులైన పనివారలు లభిస్తారు.

(I) రడీమేడ్ దుస్తులు :

1. దోర్నకల్లులో రడీమేడ్ దుస్తుల కేంద్రాన్ని ఏర్పాటు చేసుకోవడానికి అవకాశాలు బావున్నాయి.

2. అద్దె—కొనుగోలు పద్ధతిన మిషన్లు దొరుకుతాయి.

3. ఈ ప్రాంతపు ప్రజల అవసరాలకు మాత్రమేగాక ప్రభుత్వ అవసరాలనుకూడా అదుకోవచ్చు.

# మా "రామకోటి"

—కె. కాశీపతి

మా రామకోటి—కొలవెన్ను రామకోటేశ్వరరావు గారు గత శతాబ్దం చివరలో జన్మించిన గొప్ప వ్యక్తులలో ఒకరు. జాగృత భారత జాతికి ప్రతీకగా రాణించిన మహా మేధావులకోవకు చెందిన వారు ఆయన. ఆయన జీవితమూ, చేసిన కృషీ మానవ ప్రవర్తనకూ, సంస్కృతికీ వన్నెలు దిద్దాయి. భారతజాతి పునరుద్ధరణాన్ని ప్రతిబింబింపజేసిన "త్రివేణి" పత్రిక సంపుటాలలో ఆయన అమర వాక్కులు మనకు వారసత్వంగా విలిచాయి. ఆయన నడిపిన ఈ పత్రిక ప్రభావం నలభై మూడేండ్లపాటు వేలాది ప్రజల హృదయాలలో హత్తుకొనిపోయింది. "రామకోటి" ఇక లేడు. అయితే ఆయన వెలిగించిన జ్యోతి రాబోయే తరాలవారికి మార్గదర్శకంగా వుంటుంది.

## జననం-బాల్యం

రామకోటేశ్వరరావు గారి తండ్రి గుంటూరు జిల్లాలోని నర్సరావుపేటలో పేరుమోసిన న్యాయవాది. ఆయన అక్కడి రాజాలకు న్యాయ సలహాదారుగా పనిచేశారు. శ్రీమంతమైన కుటుంబంలో "రామకోటి" ఏకైక పుత్రుడు. అల్లారు ముద్దుగా పెరిగాడు. కులీన వంశానికి చెందిన యువకులకు వున్న లక్షణాలన్నీ ఈయనకు అలవడినాయి. అయినా ఆయన తన జీవితాంతం అమాయకుడుగా, నిరాడంబరుడుగానే గడిపారు. బాల్యంలో విద్యాభ్యాసం నర్సరావు పేటలో జరిగింది. మచిలీ పట్నంలోని నోబుల్ కాలేజీలో ఇంటర్‌మీడియెట్ చదివారు. ఆ రోజుల్లో మచిలీపట్నం జాతీయ చైతన్యానికి ప్రధాన కేంద్రంగా వుండేది. కొండా వెంకటప్పయ్య పంతులుగారు అప్పుడు అక్కడ న్యాయవాద వృత్తిని ఆరంభించారు. 1904లో, గుంటూరు జిల్లా కేంద్రమైన తరువాత, ఆయన అక్కడికి తరలివెళ్ళారు. వెంకటప్పయ్యగారు కృష్ణా జిల్లా మహాసభను ఏర్పాటుచేశారు నవ భారత సందేశాన్ని ప్రచారం చేసేందుకు "కృష్ణా పత్రిక" అనే సుప్రసిద్ధ వార పత్రికను స్థాపించారు. ఆ తరువాత ఆయన ఆంధ్రోద్యమ వ్యవస్థాపకులైనారు. దక్షిణ భారతంలో మహాత్మా గాంధీకి ముఖ్య శిష్యులైనారు.

కోపల్లె హనుమంతరావు, ముట్నూరి కృష్ణారావు, డా. పట్టాభి సీతారామయ్యగారలు యువకోత్సాహంతో, నవ చైతన్యంతో కార్య రంగంలో ప్రవేశించిన రోజులవి.

అనంగీకారమైన బెంగాలు విభజన విద్రోవస్థలోవున్న భారత ప్రజలను మేల్కొల్పింది. స్వదేశీ ఉద్యమానికి మూల కారణమైంది. జాతీయ విద్యను అభ్యసించాలని దేశమంతటా ఆందోళన బయలుదేరింది. ఈ జాతీయోద్యమపు పిలుపు, బ్రహ్మసమాజ సందేశం, బాబు బిపిన్ చంద్రపాల్ ద్వారా ఆంధ్రలో వ్యాపించింది. దీని ప్రభావం మచిలీపట్నం ప్రజలమీద పడింది. "వందేమాతరం" వినాదం స్కూళ్ళల్లో, కాలేజీలలో ప్రతిధ్వనించింది. హనుమంతరావు, కృష్ణారావు, పట్టాభిగారలు ఆంధ్ర జాతీయ కళాశాలను నడిపించారు. వారి అభ్యర్థనపైన గురుదేవుని ఆశీర్వాదంతో శ్రీ నందలాల్‌బోస్, ఈ కళాశాలలో కళను బోధించడానికి శ్రీ ప్రమోద్‌కుమార్ బెనర్జీని పంపారు.

బెంగాలు నుంచి రామమోహనరాయ్, రవీంద్రనాథ్‌లు, మహారాష్ట్రనుంచి గోఖలే, తిలక్‌ల ఉత్తేజపూర్వకమైన సందేశాలు మచిలీ పట్టణానికి వ్యాపించాయి వీరేశలింగం, చిలకమర్తి గారలు ఆధునిక తెలుగు సాహిత్యాన్ని సృష్టించ నారంభించారు. వీరు రాజమండ్రినుంచి సంఘ సంస్కరణోద్యమాన్ని ఆరంభించారు. శ్రీ చెళ్లపిళ్ళ వేంకటశాస్త్రి మచిలీపట్నం హిందూ హైస్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేస్తూ వుండేవారు. ఆయన అనేకమంది ఆధునిక కవులను ప్రోత్సహించారు.

ఇట్టి ఉత్తేజకరమైన వాతావరణంలో "రామకోటి" మచిలీపట్నంలో రెండు సంవత్సరాలు గడిపి కాల పరిస్థితులను ఆకళింపు చేసుకొన్నారు, మచిలీ పట్నం ఆయనకు ఉత్సాహోద్రేకాలను కలిగించింది. "రామకోటి" మంచి చురుకైన విద్యార్థి. కాలేజీ నుంచి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యాడు. ఆ కాలంలోని శ్రీమంతులైన విద్యార్థులందరి మాదిరే ఆయన మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీ బి. ఎ. తరగతిలో చేరాడు. ఆంగ్ల సాహిత్యంలో అగ్రశ్రేణిలో ఉత్తీర్ణుడై పట్టభద్రుడైనాడు. ఆయన మద్రాసులో వున్నపుడు అక్కడ థియొసాఫికల్ సొసైటీతోనూ, డా. అనీబిసెంటు కార్యక్రమాలతోనూ సన్నిహిత సంబంధం పెట్టుకొన్నాడు. థియొసాఫికల్ సభ్యునికి వుండవలసిన ఆంతరంగిక సంస్కారం ఆయనలో పుష్కలంగా వుంది.

## చందనపు అత్తరు

ఆ కాలపు ధనవంతులైన పట్టభద్రులు చేసినట్లుగా "రామకోటి"కూడా లా కాలేజీలో చేరారు. ఆయన "లా" చదువుతున్నపుడు, బరంపురంలోని ధనిక భూస్వామి పుత్రికా రత్నమైన రాజ్యలక్ష్మమ్మను వివాహమాడారు. ఆయన తన ప్రథమ బహు

మతిగా ఆమెకు ఒక చందన పేటికను బహూకరించారు. ఆయనకు సున్నితమైన చందనపు అత్తరు అంటే చాలా మోజు. నిజానికి అత్తరులలో చందన మెటువంటిదో, వ్యక్తులలో ఆయన అట్టివాడు.

లా డిగ్రీ పుచ్చుకొన్న తరువాత ఆయన తన తలిదండ్రుల అభీష్టం ప్రకారం నర్సరావుపేటలో న్యాయవాది వృత్తిని చేపట్టారు. అయితే ఆయన మనస్సు మాత్రం ఈ వృత్తిపైన లగ్నంకాలేదు. ఆయన సంస్కృతి అభ్యున్నతికి కలలు కంటూ వచ్చాడు. అప్పటికి ఆకలలింకా బీజరూపంతోనే వుండిపోయినాయి.

1921 లో మహాత్మాగాంధి దేశానికి పిలుపునిచ్చారు. గుంటూరు జిల్లా స్వాతంత్ర్య సమరంలో ముందుకు దూకింది. న్యాయవాదులైన శ్రీయుతులు కొండా వెంకటప్పయ్య, గొల్లపూడి సీతారామశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, వేదాంతం వరసింహాచారి ప్రభృతులు సహాయ నిరాకరణోద్యమంలో అగ్రగాములుగా నిలచారు. అనేకమంది న్యాయవాదులు తమవృత్తికి స్వస్తిచెప్పారు. మన "రామకోటి"కూడా తమ వృత్తికి తిలోదకాలిచ్చారు.

## స్వరాజ్య పత్రిక

ఈ కాలంలోనే ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు. మద్రాసు హైకోర్టులో, అధిక ధనార్జనగల న్యాయవాది వృత్తిని విడిచిపెట్టి గాంధీ సందేశాన్ని దేశ వ్యాప్తం చేయడానికి "స్వరాజ్య" అనే ఆంగ్ల దినపత్రికను స్థాపించారు. ఈ పత్రికను నడపడానికి ఆయన పణిక్కర్, కృపానిధి, ఖాసా సుబ్బారావు, వరదాచారి, జి. వి. కృష్ణారావు వంటి ఉత్సాహవంతులైన యువకులను చేరదీశారు. ప్రశాంతంగా, గంభీరంగావుండే "రామకోటి"కి దినపత్రిక నడిపే పని చాలా భారమనిపించింది. అందుకని ఆయన ఆ పత్రిక నుంచి తప్పుకున్నారు.

## ఆంధ్ర జాతీయ కళాశాల

స్వరాజ్ ఇంకా కనుచూపుమేరలోకి రాలేదు. గాంధీజీ నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను చేపట్టాడు. "రామకోటి" సహచరులు చాలమంది తమతమ వృత్తులకు వెళ్లారు. మచిలీపట్నం లోని హనుమంతరావుగారి వద్దనుంచి, నేషనల్ కాలేజి వైస్-ప్రిన్సిపాలుగా ఉపాధ్యాయ పదవిని చేపట్టడం మీకు అంగీకారంగా వుంటుందా అని "రామకోటి"కి ఒక అభ్యర్థన వచ్చింది. "రామకోటికి"కి ఈ పదవి నచ్చింది. అది ఆయన స్వభావానికి అనువుగావుంది. ప్రిన్సిపాలుగా వున్న హనుమంతరావు మాత్రమే కాక ఉపాధ్యాయ సిబ్బందిలో అడివి బాపిరాజు, కాటూరి వెంకటేశ్వరరావు, విశ్వనాథ సత్యనారాయణ గారలు కూడా వున్నారు. అది సాహితీ పరుల సంగమం ! కొంతకాలం తరువాత "రామకోటి" ఆ కాలేజీ ప్రిన్సిపాలు అయ్యారు.

## కూల్డ్రేతో పరిచయం

ఈ విద్యా సంస్థను నడపడానికి ప్రభుత్వ సహాయం పొందే విషయంలో అభిప్రాయ భేదం వచ్చింది. "రామకోటి" కాలేజీ నుంచి విరమించుకొన్నారు. ఆయనతో పాటు కవీ-కళాకారుడైన శ్రీ అడవి బాపిరాజు కూడా వెళ్ళిపోయారు. శ్రీ అడివి బాపిరాజు ద్వారా "రామకోటి" రాజమండ్రి ఆర్ట్సు కాలేజీ ప్రిన్సిపాలు ఆస్వాల్డ్ కూల్డ్రేతో పరిచయం కలిగించుకొన్నారు. కూల్డ్రే పండితుడు, కళాకారుడు. దామెర్ల వెంకటరావు, కవికొండల వెంకటరావు, బాపిరాజు వంటి మేధావులైన యువకులను తీర్చి దిద్దాడు ఆయన.

## "త్రివేణి" అవతరణ

నర్సరావుపేటలోని మరొక న్యాయవాదిశ్రీ చావలి వెంకట కృష్ణయ్య కూడా యీ "రావు-రాజు" వర్గంలో చేరారు. వీరు సాంస్కృతిక విషయాలు చర్చించుకుంటూ వుండేవారు. "రామకోటి" కలలుకన్న సంస్కృతి వ్యవస్థ ఒక పత్రిక రూపం ధరించింది. ఇది ఆంగ్లంలో వెలువడింది. ఈ ముగ్గురూ కలిసి, దక్షిణ భారతంలో అనేక భాషలకు కూడలియైన మద్రాసుకు వెళ్ళారు. అక్కడ ఇతరుల సహకారాన్ని పొందారు. 1927, క్రిస్మస్ పండుగ రోజున, నుంగంబాకంలోని మలబారీ భవనంలో ప్రముఖ కవులు, కళాకారుల సమక్షంలో భారత పునరుజ్జీవన లక్ష్యంతో "త్రివేణి" పత్రికకు ఆవిష్కరణ జరిగింది. ఈ సమావేశానికి శ్రీ వెంకటకృష్ణయ్య అధ్యక్షత వహించారు. ఈ పత్రికకు "రామకోటి" సంపాదకులు, బాపిరాజు సహాయ సంపాదకులయ్యారు. బాపిరాజు ముఖచిత్రానికి డిజైను వేశారు. థియోసాఫికల్ సొసైటీకి చెందిన జినరాజదాస తొలివ్యాసం వ్రాశారు.

ఈ కొత్త పత్రిక ఆశయాలను సంపాదకుడు ఇలా వివరించారు.

"అన్ని దేశాలలోని సంస్కార వంతులైన స్త్రీ పురుషులను దగ్గరకు చేర్చి, సౌహార్ద్రత నెలకొల్పడం "త్రివేణి" లక్ష్యమై వుంది. భారతదేశంలో కానీ, ఇతరచోట్ల కానీ, ఆదర్శానికి ఆలవాలమైన ఉద్యమాలన్నీ ఈ పత్రికలో ప్రత్యేకంగా ప్రచురించబడతాయి. సౌందర్య పిపాసులు, సత్యోపాసకులైన వ్యక్తుల హృదయ పూర్వక సహకారాలను మేము అభ్యర్థిస్తున్నాము."

సత్యం, శివం, సుందరం అనే ప్రధాన సూత్రాల పైన దీనికి పునాది వేయబడింది. "రామకోటి" మేధస్సులో మెలగిన "త్రివేణి" జన్మించింది. త్రివేణి "రామకోటి" మనస్సులోని మూడు లక్ష్యాల సంగమమైంది. సబర్మతిలోని సత్యపరిశోధన, శాంతినికేతనంలోని సౌందర్యోపాసన, అడయారులో ఆత్మ విచారం సమ్మేళనమే ఇది."

ఈ 'త్రివేణి' ఏమిటి ?

"రామకోటి" సాధన దీక్షలో ఆవిర్భవించిన మూడక్షరాల మంత్ర మిది. ఇది ఆయన ఆత్మ సంగీత రాగాలాపన. ఆయన జీవిత రహస్యం, సందేశం; లక్ష్యం కూడా.

అది ఆయన చేసిన గొప్ప సాహసకృత్యం. 'త్రివేణి' సంఘటన ముందర, ఆయన కృష్ణాపత్రిక సంపాదకత్వం, అవిభక్త

మద్రాసు శాసనసభ్యత్వం, స్వాతంత్ర్య సమరంలో ఇతరులతో పాటు అనుభవించిన కారాగార శిక్ష అన్నీ అల్పవిషయాలుగా కనిపిస్తాయి.

మాకు "రామకోటి" ఇలా చెప్పేవాడు. సాంప్రదాయికంగా భౌతికదృష్టిలో త్రివేణి అనేది పావన ప్రయాగ వద్ద గంగా యమునా సరస్వతీ నదుల కలయికను సూచిస్తుంది. ఆధ్యాత్మిక దృష్టిలో "ఇడ, పింగళ, సుషుమ్నా" నాడుల ద్వారా ప్రవహించే యోగశక్తుల సమ్మేళనాన్ని తెలియజేస్తుంది. సాంఖ్యయోగంలో త్రివేణి సత్వరజస్తమో గుణాలను తెలుపుతుంది. సృష్టి, లయ కారకత్వం గల త్రిమూర్తులకు చిహ్నం. ఆయుర్వేద పదకోశంలో ఇది ధాతువులను సూచిస్తుంది. భగవత్సాక్షాత్కారానికి త్రిమార్గము లైన భక్తి, జ్ఞాన, కర్మ యోగాలను తెలుపుతుంది. "రామకోటి" ఈ పత్రికను కళ, సాహిత్యం, చరిత్రకు అంకితం చేశాడు.

ఈ ప్రఖ్యాత సంపాదకుడు తన లక్ష్యాలను చాలావరకు సాధించాడనేది ఎవ్వరూ కాదనలేరు. దూరదూర ప్రాంతాలనుంచి ఆదర్శవంతులైన రచయితలను ఆకర్షించాడు ఆయన. అనేక మందిని రచయితలుగా చేశాడు. తన పత్రికలో ప్రచురితమయ్యే వాటిలో ఆకారంలోను అంతర్యంలోను సౌందర్యం వుండాలని ఆయన రెండు ప్రమాణాలను నిర్ధారించాడు ఆయన కొంత కాలం వరకు ప్రకటనలను పూర్తిగా నిరాకరించాడు. ఆ తరువాత కూడా, ఆయన సంపుటాలలో విక్రయపద్ధతులకు సంబంధించిన చౌకబారు అడ్వర్టయిజుమెంట్లకు స్థానంలభించలేదు.

కాలంగడచిన కొద్దీ, సంస్కృతీ పరులైన మేధావులకు త్రివేణి కార్యాలయం మక్కాగా తయారైంది. శ్రీయుతులు జినరాజదాస, నవరత్న రామారావు, టి. వి. గుండప్ప, మస్తి వెంకటేశ అయ్యంగార్, కె. యస్. వెంకట్రామన్, కె. బాలసుబ్రహ్మణ్య అయ్యర్, కె. చంద్రశేఖరన్, బి వి సుబ్రహ్మణ్యం, కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్, యం. చలపతిరావు వంటి ఉద్దండపండితులు, ప్రసిద్ధ రచయితలు అందరూ ఏదో ఒక రూపంలో 'త్రివేణి'తో కలిసి పనిచేశారు. ప్రపంచ ప్రసిద్ధిపొందిన ఈ సంచిక తీరు తెన్నులకు అందచందాలు చేకూర్చారు.

రైట్ ఆనరబుల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రి 'త్రివేణి' కృషిని, విలువను ఉగ్గడిస్తూ ఇలా అన్నారు.

"త్రివేణి" ఉన్నత శ్రేణికి చెందిన పత్రిక. ఇది విశిష్టమైన స్థానాన్ని ఆక్రమించుకుంది. మహోన్నత సంస్కృతిగల విద్యావేత్తలను ఆకర్షించింది, దాని స్థానాన్ని అక్రమించడం చాలా కష్టం. మనలో అభిరుచి, విచక్షణ, విశ్రాంతి అవకాశాలు మొదలైన లక్షణాలు గలవారు చాలా తక్కువమంది ఉన్నారు. మీరు సాధించిన విజయానికి నా అభినందనలు తెలియ చేస్తున్నాను. అతిసుందరమైన "త్రివేణి"ని నిర్వహించడానికి రచయితలు, చందాదారులు సాధ్యమైన ప్రయత్నం చేస్తారని నేను ఆశిస్తున్నాను."

## పరస్పర అవగాహన

వ్యాపార రీత్యా "రామకోటి" విజయం సాధించలేక పోయినప్పటికీ ఒక అపూర్వమైన లక్ష్యాన్ని సాధించాననే సంతృప్తితో ఆయన గతించాడు. 'త్రివేణి' ద్వారా ఆయన వివిధ భారతీయ భాషల రచయితల మధ్య పరస్పర అవగాహనకు దోహదం కల్పించాడు భారతదేశ సందేశాన్ని విదేశాలకు వినిపించాడు.

## మెరుపు తీగ

"రామకోటి," అండదండలు లేనివాడేమీ కాదు. ఆయనకు అపారమైన చేయూత లభించింది. శ్రీయుతులు రాజగోపాలాచారి, రాధాకృష్ణన్, మోచర్ల రామచంద్రరావు, గోవిందరాజాచారి, మీర్జా ఇస్మాయిల్, సర్ తేజ్ బహదూర్ సప్రూ, సి. వి. రామన్, తదితరులు అనేకులు తమ యీ అభిమాన పత్రిక నిర్వహణలో నిరంతరమైన సహాయాన్ని అందజేశారు. అయితే "రామకోటి" లక్ష్యాలు యితరులు అందుకోజాలని మహోన్నత శిఖరాల వంటివి. సున్నితమైన ఆయన మార్గాలను యితరులు అనుసరించడం చాలా కష్టం. ఆయన సౌందర్యోపాసన యితరులకు అలవి గానిది, ఆయన రచనా కౌశల్యాన్ని యితరులు సాధించడం అసాధ్యమైన విషయం, మెరుపుతీగ ఎక్కువకాలం ప్రకాశించదు. సౌరభాలను వెదజల్లే కుసుమాలు వాడిపోక తప్పదు. "రామకోటి" కూడా అంతే.

కొద్దివారాల క్రితమే నేను ఆయనను కలిశాను. అదే మా ఆఖరి సమావేశం. దృష్టి తగ్గిపోయి మంచం పట్టాడు. ఆయనవాక్కు, స్మృతి సరిగానే ఉన్నాయి. ఆయన 'త్రివేణి' కుటుంబంగా వ్యవహరించే తన పాత స్నేహితులందరిని గూర్చి అడిగాడు. "వారంతా గత స్మృతులయ్యార"ని ఆయన అన్నాడు. ఇప్పుడు ప్రియమైన "రామకోటి" కూడా మనస్మృతిగానే మిగిలిపోయాడు. ఆయన స్మృతి అదొక తరగని మధుర స్మృతి.

# ఆగస్టు మాసంలో స్మృతికివచ్చే మహానుభావులు

—కల్యాణసిం

7వ తేదీని

జాతీయకవి, అంతర్జాతీయవాది ఐన రవీంద్రనాథ ఠాకూర్ ప్రజ్ఞాప్రాభవాలు కొలదిపెట్టరానివి. ఆయన కవి, నాటకకర్త, దేశ భక్తుడు, విశ్వకుటుంబి, చిత్రకారుడు, తత్వవేత్త. 'గీతాంజలి' కుసుమాలను ప్రోదిచేసిన కవితా ఆరామకుడు, సాహిత్యానికి నోబెల్ బహుమానం పొందిన ఏకైక భారతీయుడు. జన గణ మన అధి నాయకుడైన భారత భాగ్యవిధాతకు జయపెట్టినమేటి. "బాటసారులు చెట్టపట్టాలు పట్టి జయగీతాలు పాడుతూ పోతున్నారు. క్షుద్రమైన కుట్రలలో చిక్కుకొని ఇంటిదగ్గరే కూర్చొనిపోకండి. ప్రపంచం విశాలమైనది, కాలం వేగంగా పోతూఉంది. మానవాత్మ బల సంపన్నమైనది. సోదరా! లే! ముందరికి సాగిపో, ముందరికి సాగిపో" అనే అమర సందేశాన్ని అందించిన రవీంద్రుడు ఎనభై సంవత్సరాలపాటు భారతాకాశంలో ప్రకాశించి 1941లో అస్తమించాడు.

12వ తేదీని

ఏభై ఏళ్ల క్రిందటి పత్రికలుకాని సామాన్యమైన వచన గ్రంథాలుకాని ఈ నాడు చదవాలంటే తలనొప్పివస్తుంది. అప్పుడు పుస్తక రచనకు వాడబడుతూ ఉండినభాష కృతకం. ఈ నాడు సరళమైన వ్యావహారిక భాషలో వస్తున్న పత్రికలూ, పుస్తకాలూ లక్షలకొద్దీ ప్రజలు చదివి ఆనందిస్తున్నారంటే ఆ ఆనందానికి కారకులైనవారు గిడుగు వేంకటరామమూర్తి. 'ముందుభాష', ఆ తరవాతే వ్యాకరణం. మారే జీవద్భాషకూ, మారని వ్యాకరణానికీ పొత్తుకుదురదు. మారుతున్న భాషను బట్టి వ్యాకరణం మారాలి, అని వాదించి వ్యావహారిక భాషను ఉద్ధరించి తెలుగువారికి మహోపకారం చేసిన మహోపాధ్యాయ రామమూర్తి పంతులు 1863లో జన్మించాడు.

15వ తేదీని

కేంబ్రిడ్జిలో చదువుతున్నప్పుడే మిల్టన్ తరవాత మిల్టన్ అంతటి మేధావి అనిపేరు పడాడు అరవిందఘోష్. మనికోలా బాంబు కేసులో అనుమానితున్నిగా అలీపూర్ జైలులో ఉండినప్పుడు ఆయనకు వాసుదేవ సాక్షాత్కారమైంది. తరవాత 1910 నుంచి 40 ఏళ్లపాటు అంటే పరమపదించేవరకూ పుదుచ్చేరిలో యోగవిష్ఠ, దేశభక్తుడు, కవి, మహాయోగి ఐన అరవిందుడు పూర్ణయోగ సిద్ధాంత ప్రతిపాది. సంధ్యావేళ యావద్భారత దేశమూ కొద్ది నిమిషాలపాటు 'మేమంతా ఒక్కటే' అనే ఒకే భావాన్ని జపిస్తే అపారమైన ధ్యానశక్తి ఉత్పాదనమౌతుంది." అని ఉపదేశించిన ఆ పరయోగి 1872లో ప్రభవించాడు.

సహస్రాబ్దుల భారతీయ ఆధ్యాత్మికతకు సంపూర్ణసిద్ధి శ్రీరామకృష్ణపరమహంస—మానవాకృతి ధరించిన ఉపనిషత్సారం. ఆయన మహావిద్వాంసుడు, మహామేధావి ఐన వివేకానందుని వంటి మహాపురుషులచేత రామకృష్ణుడు — పుస్తకాల చదువురాని రామకృష్ణుడు—అద్భుత మేధావిగా పరిగణింపబడ్డాడు. హిందూ, ఇస్లామ్, క్రైస్తవవాది వివిధ మతాలను వేరుగా అనుష్ఠించి అన్నిటను ఉన్నవాడు ఆ పరమాత్మయే అని గ్రహించి "అన్ని మతాలలోనూ సత్యం ఉంది. ఎన్ని మతాలున్నాయో అన్నీ మార్గాలే దేవుని చేరడానికి" అని బోధించిన సర్వధర్మ సమన్వయకర్త పరమహంస. ఆ మహనీయుని జీవితచరిత్ర కామినీ కాంచన విజయ మహాకావ్యం మానవ కారుణ్య రసప్లావితమైన మహా ప్రబంధం. ఎట్టి నిగూఢ విషయాన్నైనా అత్యంత సరళంగా తెలియజెప్పగలిగిన అసాధారణ ఆచార్యుడు. "దేవుడు అందరు మానవులలోనూ ఉన్నాడు. కాని అందరు మానవులూ దేవునిలో లేరు. అందువల్లనే వారు బాధలనుభవిస్తున్నారు" హృద్యాలైన సూక్తి రత్నాలకు రత్నాకరుడైన శ్రీ రామకృష్ణుడు 1886లో నిర్యాణం చెందాడు.

18వ తేదీని

గాంధీజీ అభిప్రాయాలతో ఏకీభవించక సమరంచేసి స్వరాజ్యం సంపాదించాలని మహాప్రయత్నంచేసిన సాహసమూర్తి సుభాష్ చంద్రబోస్. కలకత్తాలో ఆశ్చర్యకరంగా అదృశ్యుడై బర్లిన్‌కు, అక్కడినుంచి టోక్యోకు, టోక్యోనుంచి సింగపూర్‌కు వీరయాత్రచేసి బ్రిటన్‌పై యుద్ధం ప్రకటించి ఆజాద్ హింద్ ప్రభుత్వాన్ని నెలకొల్పి నేతాజీగ లక్షల జనానికి ఆరాధ్యుడైనాడు. ఫార్మోజాలోని తైహోకుదగ్గర విమానంకూలి క్షతగాత్రుడైన నేతాజీ తైహోక్ ఆసుపత్రిలో 1945లో అసువులు విడిచాడు.

24వ తేదీన

జీవితమె త్యాగమయముగా చేదుమందు
మ్రింగిన మహాపురారి శ్రీ టంగుటూరి

ఆంధ్రకేసరి దివ్య నామాక్షరములు
చెరగవీ వీరభారత చరితమందు.

అసదృశ త్యాగమూర్తి ఆంధ్రకేసరి ప్రకాశం జన్మించినది 1872లో.

28వ తేదీని—

యోహాన్ వోల్ఫ్‌గాంగ్ ఫన్ గథె, జర్మన్ కవులలో అగ్రస్థానం అలంకరించినవాడు. ప్రపంచ మహా కవులలో ఒకనిగా పరిగణింపబడుతున్నాడు. ఫౌస్ట్ అనే ఆయన కావ్యంలో తన తత్వాన్ని నిరూపించాడు. జీవితం అర్థంలేని స్వప్నంకాదు, అది గంభీర సత్యం. ఆకలి, దాంబికమూఢప్ప తక్కినవన్నీ మాయమైపోయిన సంశయాళువుల, విషయాసక్తుల లోకంలో మానవుడు మానవుడుగా నిలిచి ఉండడం సాధ్యమని ప్రకటించిన తాత్త్వికుడు గథె. కాళిదాసుని శాకుంతలం చదివి ఆనందంతో గంతులువేసిన రసజ్ఞుడు. ఆయన 1749లో జన్మించాడు

ప్రపంచ మహా రచయితలలో పేరెన్నికగన్నవాడు ల్యాఫ్ నికలాయేవిచ్ టాల్‌స్టాయ్. ప్రపంచ చింతనాన్ని ప్రభావితం చేసిన కొద్దిమందిలో ఒకడు. 'భగవద్రాజ్యం నీలోనేఉంది' అనే ఆయన రచన గాంధీజీని యోచనా నిమగ్నుణ్ణిచేసి ఆయన మనస్సు మీద శాశ్వతముద్ర వేసింది. మానవుని నిజస్వభావం మీద నాగరికత తెచ్చిపెట్టిన కృతకత్వాన్ని తొలగించి మానవ ప్రేమ దర్శనం చేయించే అంతరంగజ్యోతిని అనుసరించినప్పుడే వాస్తవమైన సుఖం లభిస్తుందని విశ్వసించి అహింసను బోధించిన ఆమహాత్ముడు 1828లో జన్మించాడు.

31వ తేదీని—

ఆదిభట్ల నారాయణదాసు కవి, పండితుడు, బహుభాషా విశారదుడు, గాయకుడు, వాగ్గేయకారుడు. రమణీయమైన శరీరం, కమనీయమైన కంఠం శంఖో అని ఆలపిస్తే మైలుదూరం వినబడేది. పండిత పామరులకు విజ్ఞాన వినోదదాయకంగా కథచెప్పి నవరసాలలో ఓలలాడించే ఆ హరికథా పితామహుడు 1864లో జన్మించాడు.

క్రీ.పూ.30లో కన్నుమూసిన క్లియోపాత్ర మొదలు క్రీ.శ. 1930లో కన్ను తెరచిన నీల్ ఆమ్‌స్ట్రాంగ్ వరకూగల ఇందరు మహానుభావులు స్మృతి పథంలో ఈ విధంగా దర్శనమిస్తారు ఈ (ఆగస్టు) మాసంలో.

---

(26వ పుటనుండి)

## భార్గవ కమిటీ నివేదిక......

ప్రభుత్వం ఇచ్చిన ప్రణాళికా గ్రాంటులను రాష్ట్ర రెవిన్యూ ఆదాయంగా పరిగణించకూడదు. అభివృద్ధి ఖర్చును, అందుకొరకు డబ్బు వచ్చిన ఆధారాలను పరిశీలించవలసినప్పుడు మాత్రమే ఈ గ్రాంట్లను లెక్కలోకి తీసుకోవాలి. కనుక మిగులు నిధులు లెక్కకట్టునపుడు, ఆయ వ్యయాలనుంచి ప్రణాళికా గ్రాంట్లను మినహాయించవలసి వుంటుంది. అభివృద్ధి ఖర్చును లెక్క కట్టునపుడు మాత్రమే ఈ రెండు అంశాలను లెక్కలోకి తీసుకోవాల్సి ఉంటుంది. మిగులు నిధులు లెక్క కట్టునపుడు రాష్ట్ర ప్రభుత్వం వద్ద లభ్యమైన అంకెల ఆధారంగా మేము ఈ సూత్రాలను అనుసరించినాము.

## 23. ఆంధ్ర ప్రాంతపు రెవిన్యూ లోటు.

ఖర్చు కాకుండా మిగిలిపోయిన తెలంగాణా మిగులు నిధులను లెక్క కట్టునపుడు ఆంధ్ర రెవిన్యూ లోటులో తెలంగాణాకు గల వాటాను నిర్ణయించి, ఆ వాటా డబ్బును ఖర్చుకాని తెలంగాణా మిగులు నిధులకు జమ చేయాలని తెలంగాణా ప్రాంతం తరపున వాదించబడింది. మా దృష్టిలో ఈ ప్రశ్న ఉత్పన్నమయ్యే అవకాశం లేదు. మిగులు నిధుల నిర్ణయంతో దీనికి తగిన సంబంధం లేదు. తెలంగాణా మిగులు నిధులు ఆంధ్ర ప్రాంతపు మిగులు లేక తరుగు నిధులపైన ఆధారపడటం లేదు. ఉభయ ప్రాంతాలలో అభివృద్ధి పైన జరిగిన ఖర్చు విషయంలో, ప్రతి సంవత్సరం ప్రతి ప్రాంతంలో వాస్తవంగా జరిగిన ఖర్చును ప్రాతిపదికగా తీసుకొని లెక్కలు తయారు చేయడం జరిగింది. తెలంగాణా మిగులు నిధులు తెలంగాణా ప్రాంతం అభివృద్ధికి మాత్రమే ఖర్చు పెట్టాలని దీనికి తోడు ప్రతి సంవత్సరం రాష్ట్రం చేసే ఖర్చులో సమంజసమైన వాటాను తెలంగాణాకు కేటాయించాలని 1956 వ సంవత్సరపు "పెద్ద మనుష్యుల వప్పందం" చెబుతున్నట్లు మనం సరిగా అర్థం చేసుకోవాలి. అభివృద్ధి ఖర్చు విషయంలో తెలంగాణాకు రావలసిన సమంజసమైన వాటా విషయం మేము ఇదివరకే పరిశీలించినాము. ఈ విషయంలో ఆంధ్ర ప్రాంతపు ఆదాయపులోటును పరిశీలించవలసిన అవసరం లేదు. (సశేషం)

మీరు

# క్రొత్త 1969 నార్టన్

## సైకిలును చూచేరా

## ?




## అది చూచుటకు ఎంతో ముచ్చటవేస్తూ ఉంటుంది!

అవును! క్రొత్త నార్టన్‌కు ఆశ్చర్యకరమైన వరిక్రొత్త అంశములు ఉండుట వలన దానిని చూడగానే మీరు కొనాలనుకొంటారు. అది భారతదేశములో సైకిళ్ళను తయారుచేయుటలో మార్గదర్శకులైన వారిచే భారతదేశములో తయారుచేయబడుతోంది!

**హింద్ సైకిల్స్ లిమిటెడ్,**
250, వర్లి, బొంబాయి-25 డి.డి.
భారతదేశములో పూర్తి సైకిలును తయారుచేసే ఒక పెద్ద సంస్థ. అన్ని విడి భాగములను ఒకే చోట తయారుచేస్తోంది.




## ఏ విధముగా చూచినా ఎంతో మంచి సైకిలు-నార్టన్

# రాడార్

## ఆధునిక వాతావరణ సూచి



విశాఖపట్నంలో బంగాళాఖాతానికి అభిముఖంగావున్న సుందరమైన కొండ 'డాల్ఫిన్స్‌నోస్' పైన భారత ప్రభుత్వవాతావరణ పరిశీలన శాఖవారు ఇటీవల, తుఫానురాక గురించి హెచ్చరికచేసే మొట్టమొదటి రాడార్ కేంద్రాన్ని నెలకొల్పారు. ఈ రాడార్ కేంద్రానికి 1970 మే 24వ తేదీన లాంఛనప్రాయంగా ప్రారంభోత్సవం జరిగింది. భారత ప్రభుత్వ యాత్రిక, పౌరయాన మంత్రిత్వ శాఖల ఉప మంత్రిణి డా. శ్రీమతి సరోజినీమహిషి యీ రాడార్ కేంద్రానికి ప్రారంభోత్సవం చేసారు. ఆంధ్రప్రదేశ్ ఉపముఖ్య మంత్రి శ్రీ జె. వి. నరసింగరావు అధ్యక్షత వహించారు. విశాఖపట్నంలోని రాడార్ హెచ్చరిక కేంద్రంకాక, తూర్పుతీరంలో మరొక 6, పశ్చిమ తీరంలో 2 నెలకొల్పుతారు. తుఫానుహెచ్చరిక రాడారు కేంద్రాలవల్ల ఏప్రాంతంలో మేఘాలు ఏర్పడుతాయో తెలుసుకోవచ్చు. సముద్రంలో దూరప్రాంతాలలో కూడా తుఫానులు, పెనుగాలులు ఎక్కడ ఆరంభమై ఏ వైపు పయనిస్తాయో తెలుసుకొన్న తర్వాత తుఫానుల ప్రమాదంనుంచి తప్పించుకోవడానికి సకాలంలో హెచ్చరిక చేయడానికి వీలుకలుగుతుంది. విశాఖపట్నం, దాని పరిసర ప్రాంతాలలో పెనుగాలులు తరుచుగా వస్తుండడంవల్ల రాడార్ కేంద్రం నెలకొల్పడానికి విశాఖపట్నం ఎన్నికచేయబడింది. తూర్పుతీరంలో మచిలీపట్నం, మద్రాసు, నాగపట్నం, భువనేశ్వరం, కలకత్తాలలోనూ పశ్చిమతీరంలో గోవా, బొంబాయిలలోనూ ఇట్టి హెచ్చరిక రాడార్ కేంద్రాలను నెలకొల్పడానికి తలపెట్టబడింది. విశాఖపట్నంలోని రాడార్‌ను, టోక్యోలోని జపాను రేడియో కంపెనీవారు ఉత్పత్తిచేశారు. ఇతర తీర కేంద్రాలలో నెలకొల్పబడనున్న తుఫాను హెచ్చరిక రాడార్లను బెంగుళూరులోని భారత్ ఎలెక్ట్రానిక్స్ కంపెనీ ఉత్పత్తిచేసి అందజేస్తుంది. ✦

# నగరంలో



గాంధీభవన్‌లో మే 17న హిందీ ప్రచారసభ 18వ స్నాతకోత్సవానికి రాష్ట్ర గవర్నరు శ్రీ ఖండూభాయ్ దేశాయ్ అధ్యక్షత వహించారు.



కేంద్రమంత్రి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ జూన్ 2వ తేదీన పరిపాలనా సిబ్బంది కళాశాలలో సాంకేతిక పరిణామం-పరిశ్రమలకు సంబంధించిన జాతీయ సదస్సుకు ప్రారంభోత్సవం చేశారు.

## వార్తా చిత్రాలు



కేంద్రమంత్రి శ్రీ ఐ. కె. గుజ్రాల్ జూన్ 8వ తేదీన "హిందుస్తాన్ సమాచార్" న్యూస్ సర్వీస్‌కు ప్రారంభోత్సవం చేశారు.



ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి జూన్ 9వ తేదీన జూబ్లీహాలులో జిల్లా వైద్య, ఆరోగ్యశాఖాధికార్ల సమావేశానికి ప్రారంభోత్సవం చేశారు.



కేంద్ర మంత్రి శ్రీ కె. సి. పంత్ జూన్ 2న ఆనందనిలయంలో ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానంద రెడ్డిని కలుసుకున్నారు.



రాష్ట్ర విద్యామంత్రి శ్రీ పి. వి. నరసింహారావు మే 15న వేద పండితులను సన్మానించారు. వేద పఠనంలో ప్రతిభకు గుర్తింపుగా యేటా ఆరుగురు వేద పండితులను ప్రభుత్వం సన్మానిస్తూ వుంటుంది.



ఉప ముఖ్యమంత్రి శ్రీ జె. వి. నరసింగరావు మే 28వ తేదీన శాంతినగర్‌లో 808 మార్కు అగ్గిపెట్టెల కర్మాగారానికి ప్రారంభోత్సవం చేశారు.



## హిందుస్తానీ సంగీత కార్యక్రమం

సమాచార, పౌర సంబంధ, యాత్రిక శాఖ అధ్వర్యంలో మే 19 వ తేదీ రాత్రి 9 గంటలకు హిందుస్తానీ సంగీత కార్యక్రమం జరిగింది. గాత్ర సంగీత విద్వాంసులు శ్రీయుతులు నాసర్ అహ్మద్‌ఖాన్, హిల్లాల్ అహ్మద్ ఖాన్, ఫిడేలు విద్వాంసుడు శ్రీ జె. జహూర్ అహ్మద్‌ఖాన్; సితార్ విద్వాంసుడు శ్రీ జాఫర్ అహ్మద్ ఖాన్, తబలా విద్వాంసుడు శ్రీ మహబూబ్ అహ్మద్ ఖురేషీ యీ కార్యక్రమంలో పాల్గొన్నారు. ❀

# కంభం చెఱువు

— కందూరి నారాయణ మూర్తి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఎన్నో చెరువులు ఉన్నవి కాని అన్నింటికిని తగిన ప్రాముఖ్యత లేదు. పాకాల, రామప్ప, కంభం చెరువులు ముఖ్యంగా చెప్పదగినవి. పై మూడింటిలో కంభం చెరువు చాలా పెద్దది.

కంభం చెరువు కర్నూలు జిల్లాలో, కర్నూలు పట్టణానికి నూటాయాభై కిలోమీటర్ల దూరంలో ఉంది. ఈ చెరువు విస్తీర్ణము ఆరు కిలోమీటర్లు. ఈ చెరువు క్రింద ఇరవై గ్రామాలలో ఎనిమిది వేల ఎకరముల భూమి సాగుబడి అవుతున్నది. కంభం చెరువు ఈ తాలూకాలో వ్యవసాయానికి వున్న పెద్ద నీటివనరు.

జమదగ్ని మహర్షి ఈ ప్రాంతంలో ఆశ్రమం నిర్మించుకుని వుండెనట. ఈ ప్రాంతంలో నీరులేక పైరులన్నీ ఎండి పోవుట చూచి అచ్చట ఒక చెరువు నిర్మించిన బావుండునని తలంచి దీని నిర్మాణ కార్యక్రమమును చేపట్టెనట. జమదగ్ని మహర్షి కొండమీద బ్రహ్మేశ్వరస్వామి దేవాలయమును కట్టించి దానికి సమీపమున గుండిక నదీ తీరమునందే తన ఆశ్రమమును నిర్మించి యుండెనట.

కళింగ గజపతులు ఈ ప్రాంతమును ఏలుచున్నప్పుడు ఈ ప్రాంతపు పరిపాలనాధికారి గోపన్న బడయార్ అను పేరు గల ఆయన శిథిలావస్థలో వున్న ఈ చెరువును వృద్ధిచేశాడు. కాని చెరువుకు మాటిమాటికి గండ్లు పడుతూ వుండేవి. గోపన్న బడయార్‌కు ఇదంతా అర్థం గాక పెద్దలను అడిగాడు. వారు జలదేవత మానవబలి గోరుతున్నదని అది చేసిన యెడల ఇట్టి ఆగ్రహించి ఇంక జరుగవని చెప్పారుట. గోపన్న బడయార్ మంచిరోజు చూచి ఊరంతా చాటింపు వేయించాడు. కాని మనుష్యుల బలికి ఏ ఒక్కడూ ముందుకు రాలేదు. అప్పుడు ఇద్దరు యాదవ సోదరులు ముందుకు వచ్చారుట వారిపేర్లు పెదకంబడు, చినకంబడు. వారిరువురిని జలదేవత ప్రీత్యర్థము బలిపెట్టారు. వారి జ్ఞాపకార్థంగా పెదకంభం చినకంభం అను గ్రామాలు కట్టబడినవి.

కొన్ని సంవత్సరములు గడచిన తరువాత నరేంద్రుడనే ప్రాంతీయాధికారి ఈ చెరువు కట్టను తెగ్గొటించాడుట. కాని అతని అనంతరము వచ్చిన ప్రాంతాధికారులు ఈ చెరువును మరమ్మత్తులు చేయుటకు ఒక్కరూ ముందుకు రాలేదు. ఈ విధంగా అర్థ శతాబ్దం గడిచిపోయింది.

శ్రీకృష్ణదేవరాయల భార్య అయిన వరద రాజమ్మ (గజపతి వంశ రాజకుమారి) తనకు పుట్టింటివారు యిచ్చిన అరణపు ధనంతో గండిని పూడ్పించింది. చెరువుకట్టను రాయితో దిట్టంగా కట్టించింది.

ఈ చెరువు ఎంతో సహజమైనది. ఈ ప్రాంతమంతా కొండలమయ మగుటచేత ఎంతో అందముగా వుంటుంది. ఈ చెరువులో మొత్తం ఏడు చిన్నచిన్న కొండలు మునిగివున్నవి. మనకు మూడు కొండలు మాత్రము బయటికి కన్పిస్తాయి. ఇచ్చట మూడు కొండలలో ఒకదాని పేరు గోపర్వతమట. ఒక సారి గోవు ఒకటి ఆ కొండమీదికి నీరు తక్కువగా నున్నప్పుడు పచ్చగా నున్న గడ్డిని తినేందుకు పోయెనట. అది వర్షాకాల మగుటచే వర్షము విపరీతముగా పడి నీటి ప్రమాణము హెచ్చింది. ఆ గోవు ఆ కొండమీదినుండి బయటకు రాలేక ప్రాణము విడచినదనీ అందుకే ఆపేరు వచ్చినదనీ చెప్పుకొంటారు.

పడమటి కొండను, తూర్పుకొండను కలుపుట వలన ఈ చెరువు ఏర్పడినది. వీటి మధ్యదూరము నాలుగు ఫర్లాంగులు. చెరువుకట్ట వెడల్పు 34 గజములు. ఈ చెరువు కట్టమీద రహదారి బంగ్లా ఒకటి వున్నది. ఇచ్చటికి దూరప్రాంతముల నుండి జనం వచ్చుటచేత వారి వసతి సౌకర్యార్థమై ఈ బంగ్లా నిర్మింపబడినది కంభం ఊరిలోనుండి ఈ చెరువు కట్టవరకు కంకరరోడ్డు ఉన్నది. ఇచ్చటికి విద్యార్థులు విహార యాత్రలకు వస్తుంటారు.

కొండమీద అర్ధచంద్రాకారముగా వున్న వంపు పేరు నక్కలగండి. ఈ నక్కలగండినే అలుగుగా ఉపయోగిస్తున్నారు. ఇచ్చట పెదకంభము, చినకంభము అనే రెండు తూములున్నవి. మొదటి దానివలన ఉత్తరమందున్న భూములకును, రెండవదాని వలన దక్షిణ భాగముగల భూములకు నీరు లభిస్తున్నది.

చెరువు కట్టమీద తూర్పున ఒక చిన్న ఆలయం వుంది. అందు శ్రీ కృష్ణదేవరాయలు, వరద రాజమ్మ యొక్క విగ్రహములు వున్నవి. ఈ ఆలయమునకు సమీపముననే పోలేరమ్మ గుడికూడా వున్నది.

*

# మన గ్రంథాలయాలు

— అద్దంకి కృష్ణమూర్తి

ఇటీవల ఆంధ్రప్రదేశ్ సందర్శించిన భారత–అమెరికన్ నిపుణుల బృందంవారు, మన రాష్ట్రంలో గ్రంథాలయాల అభివృద్ధికి ప్రభుత్వమువారు చేయుచున్న కృషిని కొనియాడుతూ, గ్రంథాలయోద్యమంలో ఆంధ్రప్రదేశ్‌దే అగ్రతాంబూలమని" ప్రకటించారు. వారీవిధంగాభావించడానికి తగినకారణాలువున్నవి. ఎందుచేతనంటే, ఒకప్పుడు కేవలం పుస్తక నిలయాలుగావున్న గ్రంథాలయాలను గ్రంథాలయ సేవా సంస్థలుగా రూపొందించి ఎక్కువ మందికి ప్రయోజనం కలిగే విధంగా కార్యక్రమాన్ని మన రాష్ట్ర ప్రభుత్వమువారు అమలు లోనికి తెచ్చారు. ప్రప్రథమంగా ఒక సమగ్రమైన పౌర గ్రంథాలయ చట్టము చేసిన ఘనత ఆంధ్రప్రదేశ్‌కే దక్కింది. ఇది 1961 సంవత్సరంలో అమలులోనికి వచ్చింది. ఈ చట్టాన్ని 1968 సంవత్సరంలో మరికొంత సవరించారు. ఈ శాసనాన్ని అనుసరించి రాష్ట్రంలో ప్రత్యేకంగా ఒక గ్రంథాలయ శాఖను ఏర్పాటు చేసి ఈ శాఖకు అధిపతిగా ఒక డైరక్టరును నియమించారు. వారు రాష్ట్ర ప్రభుత్వము స్వయముగా నిర్వహించే గ్రంథాలయాలు, జిల్లా గ్రంథాలయ సంస్థల ఆధ్వర్యంలో పని చేసే గ్రంథాలయాలు, ఇతర గ్రంథాలయాలు. వాటన్నిటికి సంబంధించినకార్యకలాపాలు పర్యవేక్షిస్తూ, అవసరమైన సలహాలిస్తూ వుంటారు. ఇకజిల్లాస్థాయిలో గ్రంథాలయనిర్వహణకు ప్రభుత్వమువారు జిల్లాగ్రంథాలయ సంస్థలను ఏర్పాటుచేసివున్నారు. ఈసంస్థ సభ్యులు వారిలోనుండి ఒకరిని అధ్యక్షునిగా ఎన్నుకుంటారు. జిల్లా గ్రంథాలయ పాలకుడు ఈ సంస్థకు కార్యదర్శిగా పని చేస్తారు. జిల్లాలో గల శాఖా గ్రంథాలయాలను ప్రతీ ఏడు తనిఖీచేస్తూ గ్రంథాలయాల సక్రమ నిర్వహణకు వీరు దోహదం చేస్తారు. జిల్లాస్థాయిలో ఈ గ్రంథాలయాలను చాలా మటుకు గ్రంథాలయ శాస్త్రంలో శిక్షణ పొందిన గ్రంథపాలకులు, (లైబ్రరియన్లు) నిర్వహిస్తున్నారు వారి సంఖ్య రాష్ట్రం మొత్తము మీద 406.

## పుస్తకాల ఎన్నిక

మనరాష్ట్రంలో మొత్తము 7,000 గ్రంథాలయాలున్నవి. వాటిలో ఎక్కువ భాగము ప్రయివేటు నిర్వాహణలోవున్నవి. కాగా 2,865 గ్రంథాలయాలు ప్రభుత్వము స్వతంత్ర ప్రవత్తినిచ్చిన జిల్లా గ్రంథాలయ సంస్థల ఆధీనంలోవున్నవి. ఈ గ్రంథాలయాలకు అవసరమైన పుస్తకాలు కొనుగోలు చేయుటలో జరుగుచున్న లోటుపాట్లను, అవకతవకలను అరికట్టుటకు ప్రభుత్వమువారు ప్రప్రథమంగా ఒక కేంద్ర నిర్ణయ సంఘాన్ని ఏర్పాటు చేశారు. ఈసంఘంవారు ఎన్నికచేసిన పుస్తకములు మాత్రమే గ్రంథాలయాలు కొనుగోలుచేయవలసి వుడుంటచే ప్రజాధనం దుర్వినియోగం జరుగదు అంతేకాకుండా కేవలం పుస్తకాల సంఖ్యను పెంచడం గాక వాటి నాణ్యాన్ని పెంచే అవకాశముంది.

పుస్తక సమాచారాన్ని గ్రంథాలయాధికారులకు తాజాగా అందించే సుదుద్దేశంతో గ్రంథాలయ శాఖవారు కలకత్తా జాతీయ గ్రంథాలయంవారి సహకారంతో 1958 లగాయతు "జాతీయ" గ్రంథ సూచికలను, తెలుగులోను, ఉర్దూలోను ముద్రిస్తున్నారు. పిల్లల పుస్తకాల వివరాలతోకూడిన 'బాలసాహితీ మాల'ను కూడా ప్రచురించారు. ఇది చాలా గర్వించదగిన విషయము.

## దశాంశ వర్గీకరణ విధానం

ప్రభుత్వము వారి అజమాయిషీలోపని చేస్తున్న గ్రంథాలయాలలో క్రమబద్ధమైన రీతిలో వర్గీకరణ (క్లాసిఫికేషన్) జరుగవలసిన ఆవసరాన్ని గుర్తించి మన రాష్ట్రంలో అమెరికా గ్రంథాలయ నిపుణుడు 'మెల్విన్‌డ్యూయి', రూపొందించిన దశాంశ వర్గీకరణ విధానం అనుసరించబడింది. 28 లక్షల పుస్తకాలను ఈ విధంగా వర్గీకరించారు. ఈ విధానాన్ని అమలుపరచడం వలన చదువరులు తమకు కావలసిన పుస్తకాలను సులభంగా ఎన్నిక చేసుకోవచ్చును.

## ఆర్థిక సహాయం

గ్రంథాలయాల నిర్వహణకు అవసరమైనసొమ్మును, స్థానిక సంస్థలు తమ అధికార ప్రాంతంలో యింటిపన్ను, ఆస్తిపన్ను, పై రూపాయికి 4 పైసలు వంతున 'గ్రంథాలయ సెస్సు' విధించి, వసూలుచేయగా వచ్చిన మొత్తాన్ని జిల్లా గ్రంథాలయాలకు జమకడతారు. ఈ మొత్తానికి సమానమయిన సొమ్మును రాష్ట్రప్రభుత్వము గ్రాంటుగా యిస్తుంది. గతసంవత్సరం 16 లక్షల రూపాయలు లైబ్రరీసెస్సు వసూలయింది.

## గ్రంథాలయ సేవ

ప్రభుత్వమువారు నిర్వహించే గ్రంథాలయాలు, జిల్లాకేంద్ర గ్రంథాలయాలు దినానికి 12 గంటలు పనిచేస్తూవున్నవి. హైదరాబాదు నగరంలోని రాష్ట్ర, కేంద్ర గ్రంథాలయంలో పాఠ్యపుస్తకాల విభాగము విద్యార్థుల సౌకర్యార్థం పరీక్ష దినాలలో ఉదయం 8

నుండి రాత్రి 12 గంటలవరకు తెరిచివుంచే ఏర్పాటు చేయబడింది. ఇక్కడ అంధులకు కూడ ఒక ప్రత్యేక 'బ్రెయిల్' విభాగము, ఏర్పాటుచేయబడింది. పిల్లల విభాగంకూడ ఎక్కువ ప్రయోజనకరంగానూ, ఆకర్షణీయంగాను తీర్చిదిద్దబడింది. ప్రస్తుతము ఏలూరులో నడుపబడుతున్న పద్ధతిలో 'సంచార గ్రంథాలయాలు' పెద్ద నగరాలలో ఏర్పాటు చేయాలనే ఆలోచనవున్నది. జంట నగరాలలో ఈ పథకాన్ని అమలు చేయుటకు ఏర్పాట్లు చేయబడుచున్నవి.

---

## కుటుంబనియంత్రణ అవార్డులు

### 1968_69 సంవత్సరానికి ప్రకటన

కుటుంబనియంత్రణ రంగంలో 1968_69 సంవత్సరంలో ఉత్తమ కృషి జరిపిన వారికి రాష్ట్ర స్థాయిలోనూ, జిల్లాల స్థాయిలోనూ అవార్డులు బహూకరించడానికి సంబంధించిన పథకాన్ని అమలుజరపడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది. జిల్లాస్థాయిలో అవార్డులు పొందడానికి అర్హులైనవారిని అంటే జిల్లాలోని ఉత్తమ పంచాయతీ సమితిని గ్రామ పంచాయతీని, ఉత్తమ కార్యసాధకుల (మొదటి బహుమతి, రెండవ బహుమతిని) నిర్ణయించడానికి, జిల్లాలో ఒక కార్యక్రమాన్ని ఏర్పాటుచేసి బహుమతి గ్రహీతలకు అవార్డులు అందజేయడానికి జిల్లా సమీక్షా సంఘాలకు అధికారం ఇవ్వబడింది. రాష్ట్రస్థాయిలో బహుమతి గ్రహీతలను నిర్ణయించడంకొరకు అధికార, అనధికార సభ్యులతో ప్రభుత్వం రాష్ట్ర అవార్డుల సంఘాన్నికూడా నియమించింది. ఈ సంఘం ఏప్రిల్ 20 వ తేదీన సమావేశమై రాష్ట్ర స్థాయిలో అవార్డులు ఇవ్వవలసిన వారి జాబితాను స్థిరీకరించింది.

## రాష్ట్రస్థాయి అవార్డులు

ఉత్తమజిల్లా మొదటి బహుమతి: తూర్పు గోదావరి జిల్లా రెండవ బహుమతి; కర్నూలుజిల్లా, మూడవ బహుమతి: పశ్చిమ గోదావరిజిల్లా. ఈ జిల్లాల వైద్య, ఆరోగ్యశాఖాధికార్లకు షీల్డులు బహూకరిస్తారు.

జంట నగరాలకు, ఉత్తమ కృషిని పురస్కరించుకొని ప్రత్యేక అవార్డుగా షీల్డు బహూకరించాలని రాష్ట్ర అవార్డుల సంఘం నిశ్చయించింది.

ఉత్తమ పంచాయతీ సమితి: తూర్పుగోదావరి జిల్లాలోని రాజవొమంగి పంచాయతీసమితి. ఈ సమితి అధ్యక్షునికి కానీ ఆయన ప్రతినిధికికానీ షీల్డునూ, రొక్కాన్ని బహూకరిస్తారు.

ఉత్తమ గ్రామపంచాయతీ: నల్గొండ జిల్లాలోని తిమ్మాపూర్ గ్రామ పంచాయతీ, ఈ పంచాయతీ సర్పంచికికానీ ఆయన ప్రతినిధికికానీ జిల్లాలో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో రొక్కాన్ని మాత్రం బహూకరిస్తారు.

స్థానిక సంస్థచే నిర్వహించబడే ఉత్తమ పట్టణ కుటుంబ నియంత్రణ కేంద్రం: కుటుంబ నియంత్రణ క్లినిక్, బేగంబజారు, హైదరాబాదు పురపాలక సంఘం. హైదరాబాదులోని నగర కుటుంబ నియంత్రణ సంస్థ జిల్లా కుటుంబ నియంత్రణ వైద్యాధికారికి కానీ ఆయన ప్రతినిధికికానీ షీల్డును బహూకరిస్తారు.

స్వచ్ఛంద సంస్థ నిర్వహించే ఉత్తమ కేంద్రం: కడపజిల్లా, జమ్మలమడుగులోని చాంప్‌బెల్ మిషన్ ఆసుపత్రి. ఈ ఆసుపత్రి అధిపతికిగానీ, ఆయన ప్రతినిధికిగానీ షీల్డును బహూకరిస్తారు.

ప్రభుత్వం నిర్వహించే ఉత్తమ పట్టణ కుటుంబ నియంత్రణ కేంద్రం: శ్రీకాకుళం జిల్లా చీపురుపల్లిలోని కుటుంబ నియంత్రణ క్లినిక్కు. ఈ క్లినిక్కు వైద్యాధికారికి షీల్డును బహూకరిస్తారు.

వెసక్టమీ విషయంలో ఉత్తమ ప్రభుత్వ డాక్టరు: మొదటి బహుమతి_హైదరాబాదు, బేగంబజారులోని కుటుంబ నియంత్రణ క్లినిక్కు అసిస్టెంటు సర్జన్ డా. కె పరంధాం (4031 వెసక్టమీలు). ఈయనకు బంగారు పతకాన్నీ, రొక్కాన్నీ బహూకరిస్తారు, ట్యూబెక్టమీ విషయంలో ఉత్తమ ప్రభుత్వ డాక్టరు: మొదటి బహుమతి_గుడివాడలోని ప్రభుత్వ ఆసుపత్రికి చెందిన డా. పి మధుసూధనరావు (1290 ట్యూబెక్టమీలు), రెండవ బహుమతి_చిత్తూరు జిల్లా మదనపల్లిలోని ప్రభుత్వ ఆసుపత్రికి చెందిన డా. (శ్రీమతి) కున్హి నని (651 ట్యూబెక్టమీలు) వీరుభయులకూ బంగారు పతకాలనూ, రొక్కం బహుమతులనూ బహూకరిస్తారు.

లూప్‌ల విషయంలో ఉత్తమ ప్రభుత్వ డాక్టరు: మొదటి బహుమతి_చిత్తూరు జిల్లా కుటుంబ నియంత్రణ సంస్థ సంచార యూనిటు అసిస్టెంటు సర్జను డా. ఎ. అనసూయ (766 లూపులు) రెండవ బహుమతి_ కాకినాడలోని జిల్లా కుటుంబ నియంత్రణ సంస్థ సంచార యూనిటుకు చెందిన డా ఎన్. రూన్సీమణి (634 లూపులు) వీరికి బంగారు పతకాలనూ, రొక్కాన్నీ బహూకరిస్తారు.

వెసక్టమీల విషయంలో మండపేటకుచెందిన డా. బి సుబ్బారావును, ట్యూబెక్టమీల విషయంలో చీరాలకు చెందిన డా. కె. సదానందరావును లూపులవిషయంలో కాకినాడలో మునిసిపాలిటీ మహిళా వైద్యాధికారి డా. ఇందిర దేవదత్తను ఉత్తమ ప్రయివేటు ప్రాక్టీషనర్లుగా నిర్ణయించారు. వీరు ముగ్గురికి వెండి కప్పులనూ, రొక్కాన్నీ బహూకరిస్తారు




## బసవరాజు కృతులు

(రచన : శ్రీగిద్దలూరి చెంచు బసవరాజు : ప్రచురణ : సాహితీ సమితి_ రేపల్లె. 94 పేజీలు; వెల: రూ. 2)

పద్యరచనకు కాలదోషం పట్టిందనడానికి ఆధునిక కవిత్వంలో అనేకమైన నిదర్శనాలు కన్పిస్తున్నప్పటికీ అరపాదడపా ప్రతిభాశాలురైన కవులు కొందరు, ఉత్తమ కవిత్వానికి పద్యరచన ఏ మాత్రమూ ఆటకం కాదని నిరూపిస్తున్నారు. వివేచన గలిగిన చదువరులు మాత్రం కవిత్వానికి ప్రక్రియ బాహ్యస్వరూపమేనని, కవిత్వ పద్యం పద్యంలోనైనా, గద్యంలోనైనా వచన కవిత్వంలోనైనా మరి దేనిలోనైనా ఉండవచ్చునని గుర్తింపగలరు. కాని సంప్రదాయవాదులైన కొందరు పద్యాలలో వ్రాసినదంతా కవిత్వమేనని భ్రమపడి తమ పద్యాలను కవిత్వంగా చలామణీ చేయాలని ప్రయత్నిస్తుంటారు. దీనికితోడు వారి పద్యాలలోని భావాలుకూడా వెనుక చూపుతోనే కాలాన్ని వెనక్కి తిప్పాలనే దురాశతో సాగినట్లైతే ఇక చెప్పనే అక్కరలేదు.

శ్రీ గిద్దలూరి చెంచు బసవరాజుగారు రచించిన 'మల్లికార్జునస్తవము' 'సంయుక్త' అనేకృతులతోపాటు కొన్ని ఖండకావ్యాలను గూడా చేర్చి సాహితీ సమితి పక్షాన ప్రకటించిన పుస్తకమిది. కొన్ని అపవాదులున్నప్పటికీ 'స్తవములు' కావ్యకళా ప్రధానాలని చెప్పడానికి వీలుపడదు. బసవరాజుగారు చెప్పుకొన్నట్లే శ్రీ మల్లికార్జున స్తవము "కేవలము భక్తి నివేదనము." కావ్యకళా ప్రధానమైనది కాదు. వీరశైవులకు ఇలవేలుపైన మల్లికార్జునుని యీ స్తవము శివశ్రీ బండారు తమ్మయ్యగారి 'అముఖము' సంతరించుకొన్నది.

"రసవిలయుండు శ్రీ గిరిధరాధర వాసుఁడటంచుఁబేరుపెం
పెసగగ నమ్మియుంట వృథయేగద! ఘోరహలాహలాగ్నులన్
మెసవు మహానుభావునకు నీకు దయాఽమృత మాధురీఝురీ
విసరము లేవిధానఁ బ్రభవించును? శ్రీ గిరి మల్లికార్జునా!"

అనే పద్యంలో ఉన్నట్లే వ్యాజస్తుతి అక్కడక్కడా ఈ శతకంలో ద్యోతకమై యింపుగొలుపుతున్నది. తన మొఱలకు కరగక మౌనము వహించిన భగవంతుని గూర్చి "అమ్మ పెట్టదడుగుకో సహింప'దనుటలో నిజమయ్యెనని కవి చమత్కరించారు. "బసవుడు నీవు నొక్కఁడుగ భావనసేయ, నినున్ భజింప నబ్బసవనిఁజెందునట్లె" యనిచెప్పు వీరశైవ సంబంధమైన యీ శతకములో భపుల దూషణ కానరాకపోవుట యొక విశేషము.

'సంయుక్త' అనే కృతిలో జయచంద్రు దవమానము పొందిన పిమ్మట "తోక ద్రొక్కిన మహాసర్ప క్రియన్ రోజు" కొన్న విధమును, సంయుక్త సంయమనంతో అటు తండ్రిని, యిటు ప్రియుని సమాధాన పరచడానికి చేసిన ప్రయత్నాన్ని, పృథ్వీరాజు సాహసాన్ని చక్కగా వర్ణించారు

" అంతరంగిక వైరం బదెంతయున్న
నెవడు పర దేశముల ప్రాపు నిచ్చగించు?
దానికంటె ననర్థ నిదానమున్నె!
దేశమాత విఘూర్ణిల్లదే! సతంబు "

అనే పద్యంలో ఐకమత్యము యొక్క ఆవశ్యకతను నొక్కి చెప్పారు. గోరీమామూదు ద్రోహము చేసిన పిమ్మట జయచంద్రుని పశ్చాత్తాపాన్ని రమ్యంగా వర్ణించారు.

అప్పుడప్పుడు వీరు వ్రాసికొన్న పద్యాలకు గ్రంథరూప మీయదలచి కొన్ని ఖండ కావ్యాలను పైకృతులకు జత చేర్చారు. కాని వీనిలో కావ్యత్వం చాల స్వల్పం. గ్రంథాలయము, నాగేశ సంస్మరణము వంటి ఒకటి రెండు ఖండ కావ్యాలు మాత్రం గమనించతగ్గవి.

పద్య కావ్యాలకు ఆదరణ తక్కువగా ఉన్న యీ కాలంలో యీ కృతిని వెలువరించ సాహసించిన బసవరాజుగారిని అభినందించాలి. ఈ గ్రంథానికి సాహిత్య అకాడమీ ధన సహాయం లభించింది.

--రామ మోహనరాయ్

## వానచినుకులు

(కథల సంపుటి ) డి. కామేశ్వరి
ప్రతులకు: స్పందన సాహితి
1_8_17/2. చిక్కడపల్లి, హైదరాబాదు_20

కథకి జీవితంలో ఒక బలమైన సంఘటనే ఆధారం. ఆ సంఘటన ద్వారానే ఒక సందేశాన్ని మనం అందుకోవాలి. నవల జీవిత సంఘటనల సంపుటి. హృదయానికి హత్తుకునేటట్లు ఒక సంఘటనను వివరించటమే కథ యొక్క ముఖ్యోద్దేశం. లేదా ఆసంఘటన ద్వారానే ఆవ్యక్తి జీవితాన్ని ఛాయా రూపంగా ప్రతి బింబితం చేసి ఇతరుల జీవితానికి కొంత మెరుగులు దిద్దగలిగిన స్థితి, స్థోమత కథకి ఉండాలి. అది పెద్ద కథగాని, చిన్నకథగాని, ఖండిక గాని, కావ్యంగాని సామాజికమైన స్పృహ లేక పోతే, దానికి విలువ లేదు. నేటి సామాజిక వ్యవస్థలోని లోటు పాట్లను వ్యక్తీకరిస్తూ, మానవ మేధస్సులోని సంఘర్షణల ప్రతి రూపాన్ని బయలుపరుస్తూ రేపు విలువగలిగిన శాశ్వతమైన విలువల్తో వెలువడాలి. అలా కథలు రాసే వాళ్ళు చాలా అరుదు.

కథలు స్త్రీలు రాసినా, పురుషులు రాసినా పై అంశాలను విస్మరించిన నాడు గొప్ప కథలు వెలువడవు. నేడెంతో మంది విరివిగా కథలను సృష్టిస్తున్నా తెలుగు దేశాన్ని. తెలుగు దేశపు పరిసితులను, పల్లెపట్టుల ప్రజాజీవితాలను చిత్రించే కథలు రావడంలేదు. ఈకథలూ దానికి దూరమే. ఆంధ్రేతరుడు తెలుగు కథ చదివినప్పుడు తెలుగు దేశం, వారి సంస్కృతి, సంప్రదాయాలు అతని కళ్ళకు కట్టుతాయా అనేది ప్రశ్న— ఇందులో ఏడు కథలున్నాయి. ఒక్క 'విముక్తి', 'దేశంకోసం' తప్పించి తతిమ్మావి చాలా మామూలు కథలు. చెదరిన రూపం, క్షంతవ్యులు, దూరపుకొండలు, నీ వెండలులోని కథా వస్తువులు ఈనాడు చాలా మంది కథల్లో కనిపిస్తూనే ఉన్నాయి. విశేషం లేదు. చిత్రీకరణలోనూ విశేషత లేదు. ఒక పరిమిత పరిధిలో కథలు తిరగుతాయే తప్ప రెక్కలల్లార్చి తెలుగు దేశం నలుమూలలకు ఎగిరి పోవు. తెలుగుదనాన్ని ప్రదర్శించే కళా ఖండాలుగా రూపొందడం లేదు.

సామాజికమైన సమస్యలు ప్రదర్శింప బడటంలేదు

విముక్తి చాలా మంచి కథ. 'సావిత్రమ్మ' సజీవమైనపాత్ర. మన కళ్ళముందెపుడూ నిల్చే ఉంటుంది చక్కని మలుపు తిప్పి, తళుక్కుమనేటట్లు వీటిని బోధించారు. 'వానచినుకు'ల్లో కథా కథనం బాగుంది హాయిగా నడుస్తుంది.

“అంతా ఒకటే మనుషులు—బుట్ట బొమ్మలు. గడ్డికుక్కిన సంచులు తడారినగొంతుకలు చేసేశబ్దాలు—గాజుగొట్టాల్లో గాలి కూతల్లా పగిలిన పెంకులమీదా ఎలుకకాళ్ళ చప్పుడు, అర్థ రహితమైన ధ్వనులు—ఆకారాల్లేని రూపాలు, కదల్లేని శక్తులు” ఈ నాడు మనచుట్టూ పరుచుకున్న శూన్యతకి, కృత్రిమ జీవిత విధానానికి మచ్చుతునకలుగా పై మాటలు—ఇలాంటి కవిత్వం వాసన గల మాటలు కామేశ్వరి గారి కథల్లో కన్పిస్తాయి. కథలు ఎత్తుగడలో వున్న బిగువు—పట్టు రాను రాను ముగింపు కొచ్చేసరికి సడలిపోతాయి

మనో పథంలో మిగిలేది 'సావిత్రమ్మ'. రచనలో నిజాయితి, ఆసక్తి, శ్రద్ధగల రచయిత్రి. మున్ముందు ఇంకా మంచి కథల నందించగలరని ఆశించవచ్చు. ఆఖరి మాటగా స్పందన సాహితీ వారిని అభినందించక తప్పదు— ఇంత తక్కువ వెలతో చక్కని ముఖచిత్రంతో పుస్తకాన్ని అందించినందుకు స్పందన సాహితి అభినందనీయులు.

—కె. శివారెడ్డి

## మెదక్‌లో పాలశీతల కేంద్రానికి ప్రారంభోత్సవం



రాష్ట్ర వ్యవసాయ మంత్రి శ్రీ కాకాని వెంకటరత్నం మే 13 వ తేదీన 2000 లీటర్ల శక్తిగల పాల శీతల కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. పాల ఉత్పత్తిదారులు తమ ఆదాయాన్ని పెంచుకోవడానికి ఇది మంచి అవకాశం కలిగిస్తుందని ఆయన అన్నారు. పాల ఉత్పత్తిదారులు రోజుకు 5000 లీటర్ల పాలు సరఫరా చేయగలిగినట్లయితే దీనిని చిల్లింగ్ కేంద్రంగా అభివృద్ధి చేయడానికి కృషి చేయగలనని ఆయన వాగ్దానం చేశారు. ఈ



వ్యవసాయశాఖ మంత్రి శ్రీ కాకాని వెంకటరత్నం మే 13న మెదక్‌లో పాలశీతల కేంద్రానికి ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం.

కేంద్రంవల్ల కలిగే సదుపాయాలను ఉపయోగించి, పాడి పశువులను అభివృద్ధిపరచవలసినదని ప్రజలకు వినతి చేశారు. తెలంగాణాలో ఈ సంవత్సరం జూన్ నెలలోగా, తలపెట్టిన శీతల కేంద్రాలన్నీ నెలకొల్పబడుతాయి.

ఈ సభకు అధ్యక్షత వహించిన గృహ నిర్మాణ మంత్రి శ్రీ సి. రాజ నరసింహ మాట్లాడుతూ, వ్యవసాయ కూలీలుకూడా పాడి పశువులను కొనుక్కోవడానికై వారికి జాతీయం చేయబడిన బ్యాంకులచే అప్పులివ్వబడతాయని చెప్పారు. మెదక్‌లో ఉద్యోగుల వసతికొరకు 30 ఇండ్లు నిర్మించబడుతాయని ఆయన హామీ ఇచ్చారు. అంతకుముందు జిల్లా కలెక్టరు శ్రీ ఎస్. చక్రవర్తి అతిథులకు, ప్రజలకు స్వాగతం చెబుతూ ఈ పాల శీతల కేంద్రాన్ని ఉర్లాండు ప్రజలు విరాళంగా ఇచ్చారనీ, మెదక్‌లో అప్పటి వ్యవసాయ క్షేత్ర డైరెక్టరు డా. లివింగ్‌స్టన్ దాని కొరకు చాలా కృషి చేశారని వెల్లడించారు.



పంచాయతీ ఎన్నికల సందర్భంగా మహబూబ్‌నగర్ జిల్లాలోని హోన్‌వాడ గ్రామంలో ఓటువేయడానికి బారులుతీర్చిన ఓటర్లు.

## నాగార్జునసాగర్ సిబ్బంది గృహాలకు శంకుస్థాపన

మధ్య తరహా నీటి పారుదల శాఖా మంత్రి శ్రీ ఆర్. నారప రెడ్డి ఒంగోలులో నాగార్జున సాగర్, సిబ్బంది గృహాలకు, కార్యాలయ భవనాలకు శంకుస్థాపన చేశారు. వీటి నిర్మాణానికి రూ. 26 లక్షలు ఖర్చవుతుందని అంచనా.

## పంచాయతీఘర్‌కు ప్రారంభోత్సవం

ఖమ్మం జిల్లా కలెక్టరు శ్రీ ప్రేమ్‌రాజ్ మాథూకర్, మే 12వ తేదీన, బూర్గంపాడు పంచాయతీ సమితిలోని కరకగూడెం గ్రామంలో పంచాయతీ కార్యాలయ భవనానికి ప్రారంభోత్సవం చేశారు. దీనినిరూ 9,700ల ఖర్చుతో నిర్మించారు.



గుంటూరు జిల్లాలోని ఫిరంగిపురంలో తుఫాను బాధితుల కొరకు నిర్మించిన వసంతనగర్ ఇళ్ళ కాలనీకి జూన్ 4న ప్రారంభోత్సవం చేస్తున్న రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎం. టి. రాజు.

కలెక్టరు గ్రామస్థులతో వారు ఎదుర్కొంటున్న సమస్యలను గురించి చర్చించారు. ఈ ప్రారంభోత్సవ కార్యక్రమానికి హాజరైన కరకగూడెం, పినపాక, ఉప్పాక, సీతంపేట గ్రామాల ప్రజలు గిరిజన గ్రామాలైన కల్వలనాగారం, భట్‌పల్లి, కలకగూడెం, అనంతారంలను వరంగల్ జిల్లాలోని బీలెల్లితో కలుపుతూ సీతంపేట నుంచి ఏటూరు నాగారం వరకు రోడ్డు నిర్మించాలని కలెక్టరుకు విజ్ఞప్తి చేశారు.

## మల్యాల సమితికి గ్రాంటు మంజూరు

తీవ్రతర ప్రాంతాభివృద్ధి పథకంక్రింద కరీంనగర్ జిల్లాలోని మల్యాల సమితికి రూ. 10.35 లక్షలు మంజూరుచేశారు.

మూడు సంవత్సరాలపాటు అమలు జరిగే యీ పథకాన్ని వ్యవసాయ రీఫైనాన్స్ కార్పొరేషను మంజూరు చేసింది. సమితి ప్రాంతంలోని రైతులకు జగిత్యాల భూమితనఖా బ్యాంకు నుంచి ఋణాలు ఇవ్వడంద్వారా కొత్తగా బావులు త్రవ్వడాన్ని, పాత బావులను అభివృద్ధిపరచడాన్ని, కొత్తగా విద్యుచ్ఛక్తి కనెక్షను ఇవ్వడాన్ని, ఆయిల్ ఇంజన్లను, ఎలక్ట్రిక్ మోటార్లను సరఫరా చేయడాన్ని యీ పథకం ఉద్దేశిస్తున్నది. సమితికి మంజూరుచేసిన మొత్తంలో రూ. 3.85 లక్షలను 125 బావులు త్రవ్వడానికి, రూ. 3 లక్షలను 120 ఎలక్ట్రిక్ మోటార్లు సరఫరా చేయడానికి రూ. 2 లక్షలను 50 ఆయిల్ ఇంజన్లు సరఫరా చేయడానికి వినియోగిస్తారు రూ 0.35 లక్షల ఖర్చుతో 35 పాతబావులను అభివృద్ధిపరుస్తారు. వ్యవసాయ పనులకు కొత్తగా ఎలక్ట్రిక్ కనెక్షన్లు ఇవ్వడానికి రూ. 1.25 లక్షలు వెచ్చిస్తారు.

## గిద్దలూరులో విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం

పౌరసరఫరాల శాఖామంత్రి శ్రీ ఆనం సంజీవరెడ్డి, మే 15వ తేదీన నెల్లూరు జిల్లా రాపూరు తాలూకాలోని గిద్దలూరు గ్రామంలో వీధిదీపాలకు ప్రారంభోత్సవంచేశారు. జిల్లాపరిషత్తు అధ్యక్షుడు శ్రీ ఎస్. చంద్రశేఖరరెడ్డి అధ్యక్షత వహించారు. నెల్లూరు మునిసిపాలిటీ అధ్యక్షుడు శ్రీ ఆనం వెంకటరెడ్డి అప్పర్ ప్రైమరీ స్కూలులో కీ. శే. ఎ. సి. సుబ్బారెడ్డి చిత్రపటాన్ని కీ. శే. వి. వెంకటసుబ్బారెడ్డి చిత్రపటాన్ని ఆవిష్కరించారు.

మంత్రి యీ సందర్భంలో ప్రసంగిస్తూ ప్రజలు సమైక్యంగా ఉండి గ్రామీణాభివృద్ధి కొరకు పాటుపడాలని విజ్ఞప్తి చేశారు. నక్సలైట్ల కార్యకలాపాలను ఎదుర్కోవడానికి ప్రజలు అప్రమత్తతతో ఉండాలని ఆయన కోరారు. గిద్దలూరు వంటి వెనుకబడిన గ్రామాలలో సేద్యానికి నీటిపారుదల సౌకర్యం కల్పించడం కొరకు వాటర్ పంపింగ్ పథకాలను మంజూరుచేయడానికి తాము కృషిచేయగలమని ఆయన తెలిపారు.

## సమపల్లిలో జూనియర్ కళాశాల

రాష్ట్ర హోంమంత్రి శ్రీ జె. వెంగళరావు ఇటీవల ఖమ్మం జిల్లా కల్లూరు సమితిలోని సమపల్లిలో శ్రీ బండి శోభనాచలం జూనియర్ కళాశాలకు ప్రారంభోత్సవం జరుపుతూ, గ్రామాలలో కాలేజీలు నెలకొల్పబడాలనీ, విద్యార్థులు గ్రామీణ వాతావరణంలో విద్యాభ్యాసం కొనసాగించాలనీ సూచించారు. ఇలా చేసినట్లయితే విద్యార్థులు తమ తల్లిదండ్రుల ప్రత్యక్షపర్యవేక్షణలో క్రమశిక్షణతో మెలగడానికి అవకాశముంటుందని ఆయన చెప్పారు.

అంతకు ముందు మంత్రి కాలేజిభవనానికి ప్రారంభోత్సవం జరిపారు. కాలేజీ స్థాపనకు రూ. 50,000లు విరాళమిచ్చిన శ్రీ బండి శోభనాచలం చిత్రపటాన్ని ఆవిష్కరించారు.

దాత శ్రీ శోభనాచలం మాట్లాడుతూ విద్యార్థులు, వారి తల్లిదండ్రులు, కాలేజీ కమిటీవారు యీ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని వినతిచేశారు.





వరంగల్లు జిల్లాలో గిరిజనుల సమిష్టి వ్యవసాయం చేపట్టడానికి ఉద్దేశించబడిన రంగాపూర్ ప్రాజెక్టు, గిరిజనుల పునరావాస కార్యక్రమం ఎవిధంగా జరుగుతున్నది పరిశీలించే నిమిత్తం మే 9న పాత్రికేయుల బృందం జిల్లా కలెక్టరు వెంట అక్కడకు వెళ్ళారు

## కల్వకుర్తిలో వ్యవసాయ ఉత్పత్తిలో పెరుగుదల

మహబూబునగరం జిల్లా కల్వకుర్తి పంచాయతి సమితి సర్వసభ్య సమావేశం ఇటీవల సమితి అధ్యక్షులు శ్రీ యల్. పాండురంగారెడ్డి అధ్యక్షతన సమావేశమై సమితితో వివిధ రంగాలతో జరుగుతున్న అభివృద్ధి పనులను సమీక్షచేసింది. వ్యవసాయ రంగంలో గణనీయమైన అభివృద్ధి జరిగినందుకు సర్వసభ్య సమావేశం హర్షంప్రకటించింది.

1970 మార్చి 31 తో అంతమైన సంవత్సరకాలంలో 650 ఎకరాలలో మేలురకం వరివిత్తనాలు, 565 ఎకరాలలో వేరుసెనగ విత్తనాలు వేసి పంటలు పండించడం జరిగింది. 590 టన్నుల రసాయనిక ఎరువులు ఉపయోగించ బడినాయి. 125 ఎలెక్ట్రిక్ మోటార్లు మంజూరైనాయి. ఈ చర్యల ఫలితంగా పంటల దిగుబడి $12\frac{1}{2}$ శాతం హెచ్చింది. త్రాగునీటి సరఫరాకొరకు పైపులైనులు వేయడానికి సమితి రూ. 10,000 లు మంజూరు చేసింది.

జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ కె. కె. రెడ్డి, మక్తల్, కొడంగల్, కొల్లాపూరు సమితి అధ్యక్షులు కూడా ఈ సర్వసభ్య సమావేశానికి హాజరైనారు.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ప్రారంభం

ఆరోగ్య, వైద్య శాఖల మంత్రి శ్రీ మహమ్మద్ ఇబ్రహీం అలీ అన్సారీ, మే 14 వ తేదీన నెల్లూరు జిల్లా కొవ్వూరు పంచాయతీ సమితిలోని ఎల్లాయపాలెం గ్రామంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. దీనిని రూ. 38,000 ల ఖర్చుతో నిర్మించారు.

ఈ సందర్భంలో జరిగిన బహిరంగ సభలో రెవెన్యూ శాఖామంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ప్రసంగిస్తూ, నక్సలైట్ల బెడద నుంచి గ్రామస్థులకు రక్షణ కల్పించడానికై యువజన దళాలను ఏర్పాటుచేసుకోవాలని గ్రామప్రజలను కోరారు. ఆరోగ్యకేంద్రం భవనంకొరకు రెండు ఎకరాలస్థలాన్నీ, రూ. 10,000 ల రొక్కాన్నీ బహూకరించిన శ్రీమతి ఎన్. రుక్మిణమ్మ దాతృత్వాన్ని ఆయన కొనియాడారు.



సమాచార, పౌరసంబంధ, యాత్రికశాఖవారు కరీంనగర్ జిల్లాకు బహుమతి చేసిన 16 ఎం. ఎం. ప్రొజెక్టరుకు మే 25 న జిల్లా పరిషత్తు కార్యాలయ ఆవరణలో పోలీసు సూపరింటెండెంట్ మీట నొక్కి ప్రారంభోత్సవం చేశారు.



చిత్తూరు జిల్లాలోని మదనపల్లి తాలూకాకు చెందిన కల్వెర్ల గ్రామనివాసి శ్రీ రామరాజు తాటిచెట్టును ఒక్కడూ పెకలిస్తున్న దృశ్యం.

## గిరిజనులకు గృహవసతి

రాష్ట్ర రెవిన్యూ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి ఇటీవల గుంటూరు జిల్లాలోని పిడుగురాళ్లలో గిరిజనుల ఇండ్లకాలనీకి ప్రారంభోత్సవం జరిపారు. తుఫాను బాధితుల సహాయక కార్యక్రమం క్రింద పిడుగురాళ్లలో గిరిజనులకు ఇండ్లు నిర్మించబడ్డాయి. తుఫాను సమయంలో అధికారులు శక్తి వంచనలేకుండా సహాయ కార్యక్రమాలు చేపట్టినందుకు వారిని మంత్రి అభినందించారు. తమ ఆర్థిక పరిస్థితిని చక్కబరచుకోవడానికి గిరిజనులు కుటీర పరిశ్రమలు చేపట్టాలని మంత్రి సలహా యిచ్చారు.

ఈ సందర్భంలో ఏర్పాటైన బహిరంగసభకు జిల్లా రెవిన్యూ అధికారి శ్రీ ఎం.వి. నటరాజన్ అధ్యక్షత వహిస్తూ గుంటూరు జిల్లాలో తుఫాను బాధితుల సహాయార్థం 66 కాలనీలు నిర్మించబడుతున్నాయనీ, ఇవి ఇంకా 2 నెలల కాలంలో పూర్తి అవుతాయనీ చెప్పారు. భూములులేని పేదవారికి 34,000 ఎకరాల భూమి పంచిపెట్టబడిందనీ త్వరలోనే మరొక 8,0000 ఎకరాల భూమి పంపిణీ చేయడం జరుగుతుందనీ ఆయన తెలియజేశారు.



భారతీయ రెడ్‌క్రాస్ సంఘం తాలూకు పలివెల (తూ. గో. జిల్లా) సబ్‌బ్రాంచి గౌరవ కార్యదర్శి శ్రీ వి. వెంకట్రామయ్యకు రాష్ట్రగవర్నరు బంగారు పతకాన్ని బహూకరించారు.

తుఫాను బాధితుల సహాయార్థం రూ. 1.60 కోట్లు విలువ చేసే భూమి స్థలాలు సేకరించడం జరిగిందని జిల్లాపరిషత్తు అధ్యక్షులు శ్రీ నాగేశ్వరరావు చెప్పారు.

## ఇబ్రహీంపట్నం సమితిలో కొత్త పథకాలు

ఇబ్రహీంపట్నం సమితి స్థాయీ సంఘం సమితి అధ్యక్షుడు శ్రీ అనంత రెడ్డి అధ్యక్షతన సమావేశమై గ్రామాలలో త్రాగేనీటి బావుల నిర్మాణ పరిస్థితిని సమీక్షచేసి ప్రస్తుతం 89 గ్రామాలలో 212 పాత బావులను లోతుగా త్రవ్వడానికి రూ. 63,600 లు మంజూరు చేసింది. అంతేకాకుండా కొత్తగా మరికొన్ని బావులు త్రవ్వించడానికి రూ. 1,18,8000లు మంజూరు చేసింది. ఈ బావుల నిర్మాణంతో వేసవికాలంలో త్రాగేనీటి కొరత ఏర్పడదని ఆశింపబడుతున్నది.

ఈ స్థాయీ సంఘ సమావేశంలో సేద్యపు బావులు త్రవ్వడానికి 35 రైతులకు సబ్సిడీక్రింద రూ. 21,600 లు మంజూరు చేయడం జరిగింది. రూ. 5,000 ల ఖర్చుతో మిస్ట్ బ్లోయర్, రూ. 2,000ల ఖర్చుతో విత్తనములు రసాయనిక ఎరువులకు రెండుడ్రిల్లు యంత్రాలు కొనడానికి నిర్ణయం జరిగింది. ఇవి ప్రదర్శనలకు ఉద్దేశించబడినాయి. సంకరజొన్న, సజ్జ, వరి పంటలు వేయడానికి 10 ప్రదర్శన క్షేత్రాలు, సంకర ఆముదాల పంటకు 25 క్షేత్రాలు నిర్వహించబడుతాయి. వీటికి రూ. 3,450 లక్షలు ఖర్చు అవుతాయి.

## గ్రామాభివృద్ధికై చిన్న నీటివనరుల మంత్రి విజ్ఞప్తి

రాష్ట్ర ప్రభుత్వ చిన్నతరహా నీటిపారుదల శాఖ మంత్రి శ్రీ వి. పురుషోత్తమ రెడ్డి ఇటీవల నల్గొండ జిల్లా రామన్నపేట సమితిలోని భీమనపల్లి, వంకమామిడి, సంగం, ఐపూరు, పహల్వాన్‌పూర్, ఎన్నారం తదితర గ్రామాలలో పర్యటించి మరమ్మతులు జరుగుతున్న భీమనపల్లి ఆనకట్టను తనిఖీచేశారు. ఈ ఆనకట్టలో సర్వేపనులు, మరమ్మతులు త్వరగా పూర్తి అయ్యేట్లు చూడగలనని మంత్రి హామీ యిచ్చారు.

ఆయన దంటూరు గ్రామంలో క్రొత్తగా నిర్మాణం కానున్న ప్రాజెక్టు ప్రాంతాన్ని పరిశీలించారు. ఈ ప్రాజెక్టు నిర్మాణానికి రూ. 1,32,000 లు ఖర్చు అవుతుంది.

ఐపూరు గ్రామంలో జరిగిన బహిరంగ సభలో మంత్రి ప్రసంగిస్తూ, ప్రజలు స్థానిక రాజకీయాలకు స్వస్తిచెప్పి గ్రామాభివృద్ధికి కృషి చేయాలని ఉద్బోధించారు. ఐపూరు ప్రాజెక్టు త్వరలో చేపట్టడం జరుగుతుందని ఆయన హామీ ఇచ్చారు. దీనికి సర్వేపని పూర్తి అయింది. దీనిక్రింద 500 ఎకరాలు సాగు అవుతాయని ఆయన చెప్పారు.

ఎన్నారంలో జరిగిన బహిరంగ సభలో మంత్రి ప్రసంగిస్తూ అభివృద్ధి పథకాలు అమలు పరచడానికి యువకులు ముందుకురావాలని ఉద్బోధించారు. భూములు లేని పేద ప్రజలకు బంజరు భూములను పంచి పెట్టడానికి ప్రభుత్వం ప్రత్యేక చర్యలు తీసుకొంటున్నదని ఆయన చెప్పారు.

ఈ బహిరంగ సభలకు జిల్లా పరిషత్తు అధ్యక్షులు శ్రీ వి. రామలింగారెడ్డి అధ్యక్షత వహించారు. అంతకుముందు దుబ్బాక సర్పంచ్ మంత్రికి ఘనస్వాగతమిచ్చారు. శ్రీ ఎన్. వెంకటరెడ్డి వందన సమర్పణ చేశారు.

## పంద్రపాడులో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ప్రారంభం

గుంటూరు జిల్లా పంద్రపాడులో మే 20 న పంచాయతీ రాజ్ మంత్రి శ్రీ తోట రామస్వామి, ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

వాణిజ్య శాఖామంత్రి శ్రీ పి. అంకినీడు ప్రసాదరావు కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. పంద్రపాడులో రూ. 60,000 ఖర్చుతో త్వరలో ఒక కుటుంబ నియంత్రణ కేంద్రం నిర్మించబడ గలదని ఆయన తెలిపారు. ప్రాథమిక ఆరోగ్య కేంద్రం భవన నిర్మాణానికి విరాళాలిచ్చిన వదాన్యుల దాతృత్వాన్ని మంత్రి కొని యాడారు. ప్యాకేజీ కార్యక్రమం క్రింద, చుట్టుప్రక్కలగల 11 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేస్తారనీ, పొన్నూరు పంద్ర పాడు రోడ్డుపై తారు వేస్తారని ఆయన చెప్పారు.

## అనంతపురంలో భూసార పరిశీలన కేంద్రం

అనంతపురంలో ఇటీవలనే భూసార పరిశీలన కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. అనంతపురంజిల్లా అవసరాలను యీ కేంద్రం తీరుస్తుంది. ఇక్కడి భూముల సారాన్ని యీ కేంద్రంలో పరిశీలించి సాగురకం, ఎరువుల వాడకం, మొదలైన విషయాలను గూర్చి రైతులకు సలహా ఇవ్వడం జరుగుతుంది. అంతేగాక మోట బావులు, సేద్యపు నీరు లభించే విషయాలనుగూర్చి కూడా యీ కేంద్రంవారు రైతులకు తెలియజేస్తారు.

నమూనాల పరిశీలన ఉచితంగా జరుగుతుంది. స్టేట్ బ్యాంక్ మొదలైన సంస్థలనుండి ఋణాలు పొందడానికి సంబంధించి భూసార పరిశీలన జరిపే భూములకు వ్యవసాయశాఖ నిర్ణయించే విధంగా రుసుం చెల్లించాల్సి ఉంటుంది.

## కరీంనగర్‌లో గాంధీజీని గురించిన తోలుబొమ్మలాట

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ, యాత్రికశాఖ ఆధ్వర్యంలో మే 25వ తేదీన, కరీంనగర్‌లోని జిల్లా పరిషత్తు ఆరుబయలు రంగస్థలంలో సాంస్కృతిక కార్యక్రమం జరిగింది. ఆ సందర్భంలో మహాత్మాగాంధీ జీవితాన్ని గురించిన తోలుబొమ్మలాటనూ, వేములవాడ క్షేత్రాన్ని గురించిన ఫిల్మునూ ప్రదర్శించారు.

సమాచార, పౌరసంబంధ, యాత్రికశాఖ డైరెక్టరు ప్రారంభోపన్యాసంచేస్తూ తోలుబొమ్మలాటను గురించి వివరించారు. కరీంనగర్ జిల్లానూ, ఆంధ్రప్రదేశ్‌నూ అభివృద్ధిపరచడానికి శాంతి కాముకులైన యీ జిల్లా ప్రజలు జరుపుతున్న కృషిని కొనియాడుతూ ఆర్థికాభివృద్ధి సాధించడానికి కరీంనగర్ జిల్లాలో అవకాశాలు మిక్కుటంగా ఉన్నాయని అన్నారు. త్వరలో రామగుండంలో సుమారు రూ. 75 కోట్ల ఖర్చుతో ఎరువుల కర్మాగారం స్థాపించబడడంతో ఉద్యోగావకాశాలు విరివిగా లభింప గలవని శ్రీ వామనరావు అన్నారు. పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణం పూర్తి కావడంతో కరీంనగర్ జిల్లా స్వరూపం పూర్తిగా మారిపోతుందనీ, ఆహారోత్పత్తిని పెంపొందించడంలో యీ జిల్లా ప్రముఖ పాత్రవహించగలదనీ ఆయన అన్నారు

పోలీసు సూపరింటెండెంటు శ్రీ టి. పున్నయ్య, జిల్లా పౌరసంబంధాధికారి కార్యాలయానికి చెందిన క్రొత్త ఆర్. సి. ఏ. 16 ఎం. ఎం. ప్రొజెక్టరుకు ప్రారంభోత్సవం చేశారు. కరీంనగర్ జిల్లాకు క్రొత్త ప్రొజెక్టరును కటాయించినందుకూ, గాంధీజీ జీవితాన్ని గురించిన తోలుబొమ్మలను ప్రదర్శించే బృందాన్ని యీ జిల్లాకు పంపినందుకూ శ్రీ పున్నయ్య సమాచార శాఖ డైరెక్టరుకు కృతజ్ఞతలు తెలిపారు.

జిల్లా పౌర సంబంధాధికారి శ్రీ ఎస్. భాస్కరాచారి వందన సమర్పణ చేశారు.

## నల్గొండ జిల్లాలో ఎకరానికి 65 బస్తాలధాన్యం ఉత్పత్తి

నల్గొండ జిల్లా, నకిరేకల్ పంచాయతీ సమితిలోని వెర్క కొండారం గ్రామానికి చెందిన అభ్యుదయ కర్షకుడు శ్రీచంద్రశేఖర రెడ్డి, తమ రెండు ఎకరాల పొలంలో "జయ" వరి వంగడాన్ని వేసి ఎకరానికి 65 బస్తాల చొప్పున గరిష్ఠ దిగుబడి సాధించారు. ఈ 65 బస్తాల ధాన్యం బరువు 4,840 కిలోగ్రాములువుంది.

జిల్లావ్యవసాయ శాఖాధికారి శ్రీ ఎన్. శ్రీరామమూర్తి, సమితి అధ్యక్షుడు శ్రీ కె. రామచంద్రారెడ్డి, మొక్కల సంరక్షణాధి కారి శ్రీ చక్రపాణి బి డి ఓ. శ్రీ ఎన్. రామకృష్ణారావు, సర్పంచ్ పి. భిక్షంగార్ల సమక్షంలో ఈ పొలంలో పంటకోత జరిగింది.

శ్రీ చంద్రశేఖరరెడ్డిని అభినందించడంకోసం గ్రామంలో జిల్లా వ్యవసాయ శాఖాధికారి అధ్యక్షతన సభ ఏర్పాటు చేశారు.

## కడ్తల్‌లో పాల శీతల కేంద్రం

వ్యవసాయశాఖ మంత్రి శ్రీ కాకాని వెంకటరత్నం మహబూబ నగరం జిల్లా అమన్‌గల్ బ్లాకులోని కడ్తల్ గ్రామంలో పాల ఉత్పత్తిదారుల సమావేశంలో ప్రసంగిస్తూ ఈ సంవత్సరం కడ్తల్‌లో పదివేల లీటర్ల శక్తిగల పాల శీతల కేంద్రం నెలకొల్పబడుతుందని చెప్పారు. ఈ సమావేశానికి సమితి అధ్యక్షులు శ్రీ యల్. వెంకటరెడ్డి అధ్యక్షత వహించారు.

శ్రీ జయపాల్‌రెడ్డి యం. యల్. ఏ మాట్లాడుతూ ఇక్కడ పాలశీతల కేంద్రం స్థాపనవల్ల పేద రైతులకు లాభం చేకూరుతుం దని చెప్పారు. కల్వకుర్తి క్షామ పీడిత ప్రాంతంక్రింద చేర్చబడిం దని చెబుతూ ఆమన్‌గల్ బ్లాకును సమీకృత మెట్టసేద్యం పథకం క్రిందికి తీసుకొని రావాలని మంత్రిని అభ్యర్థించారు. శీతల కేంద్రాన్ని త్వరలో పూర్తి చేయాలని కోరారు.

## మహిళాసంక్షేమ కార్యక్రమాలకు నిధుల మంజూరు

మహబూబ్‌నగర్ జిల్లా, జడ్చర్ల పంచాయితీ సమితి 4 వ స్థాయీ సంఘం సమావేశం యిటీవల శ్రీ జె. రఘునందనరెడ్డి అధ్యక్షతన జరిగింది. ఈ సమావేశంలో, ఒక ఉడుపుల తయారీ కేంద్రాన్ని, ఒకబాలవాడీని నిర్వహించడం కొరకు రూ. 5,580 లనూ, ఆరు కుట్టుకేంద్రాలను నడపడం కోరకు, 50 శాతం విరాళం ప్రాతిపదికపై 8 కుట్టుయంత్రాలను సరఫరా చేయడం కొరకు రూ. 2,580 లనూ మంజూరుచేశారు. అంతకుముందు సభ్యులు, సమితిలో, స్త్రీ - శిశుసంక్షేమ కార్యక్రమాల క్రింద జరిగిన అభివృద్ధిని, సమీక్షించారు. 3 వ స్థాయీ సంఘం విద్యాకార్యక్రమాల ప్రగతిని గురించి సమీక్షించి; 21 పాఠశాల భవనాల నిర్వహణ, మరమ్మతుల నిమిత్తం విద్యాశాఖ విడుదలచేసిన రూ. 5,000 లు కాక, అదనంగా రూ. 3,468 ల మొత్తాన్ని మంజూరుచేసింది.




కరీంనగర్‌లో జూన్ 2 వ 'గ్రామ పంచాయతీ ఎన్నికలు' అనే నాటకం ప్రదర్శింపబడింది. జూన్‌లో జరగనున్న పంచాయతీ ఎన్నికలలో ఓటు ఏ విధంగా చేసేది యీ నాటకం తెలియపరుస్తుంది

## పాఠశాల భవనం ప్రారంభం



చింతలపూడిలో ప్రాథమిక పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేసిన పంచాయతీ రాజ్ మంత్రి

గుంటూరుజిల్లా, చింతలపూడిలో రూ. 20,000 ల ఖర్చుతో నిర్మించిన ప్రాథమిక పాఠశాల భవనాన్ని పంచాయతీరాజ్ శాఖా మంత్రి శ్రీ తోట రామస్వామి మే 20 వ తేదీన ప్రారంభించారు. ఈ సందర్భంలో ప్రసంగిస్తూ ఆయన దేశపరిపాలనా నిర్వహణలో యువకులు ప్రధానపాత్ర వహించాలని ఉద్బోధించారు. వాణిజ్యమంత్రి శ్రీ పి. అంకినీడు ప్రసాదరావు అధ్యక్షత వహించారు.

## గిరిజనులకు నివేశ స్థలాలు

గుంటూరు జిల్లా తాళ్లూరు సమితి అధ్యక్షుడు శ్రీ ఎన్. హనుమంత రావు, అదనపు సాంఘిక సంక్షేమ శాఖాధికారి శ్రీ కె. సోలమన్ ఇటీవల అత్తలూరు గ్రామంలో 77 గిరిజన కుటుంబాలకు నివేశన స్థలాల నిమిత్తం పట్టా సర్టిఫికేట్లనూ, గుడిశెల నిర్మాణార్థం ఒక్కొక్క కుటుంబానికి రూ. 100 ల చొప్పున రొక్కాన్నీ పంపిణీ చేశారు.

బి. డి ఓ. శ్రీ సి. ఎస్. బి. వి. నరసింహాచార్యులు ఈ సందర్భంలో ప్రసంగిస్తూ ఇటీవల మునగోడు, దిడుగు, బయ్యవరం, ఊటుకూరు, చౌమర్రు, గ్రంధసిరి. తాడువాయి గ్రామాలకు చెందిన 523 హరిజన, గిరిజన కుటుంబాలకు నివేశన స్థలాలకొరకు పట్టా సర్టిఫికేట్లనూ, గుడిసెలు నిర్మించుకోడానికై ఒక్కొక్క కుటుంబానికి రూ. 100 ల చొప్పున రొక్కాన్నీ పంపిణీ చేసినట్లు తెలిపారు.

సమితి అధ్యక్షుడు ప్రసంగిస్తూ అత్తలూరు గ్రామంతో పాటుగా దిడుగు మళ్లాది, తమ్మావరం, తాళ్లూరు, పెద్దకూరపాడు, కాశిపాడు, నెమరికల్లు గ్రామాలకుకూడా ఇటీవల విద్యుచ్ఛక్తి సరఫరా చేశారనీ, ఈ గ్రామాలలోని హరిజనవాడలకు ఈ సౌకర్యాన్ని విస్తృతీకరించారనీ వివరించారు.

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION. PUBLICRELATIONS AND TOURISM, ANDHRA PRADESH, HYDERABAD.
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVERNMENT OF ANDHRA PRADESH, AT THE GOVERNMENT CENTRAL PRESS, HYDERABAL

